# అపరాధ పరిశోధన

రు. 3 | ఏప్రిల్ '76

## సప్లిమెంట్



అపరాధ పరిశోధన అనుబంధం—28

# తెలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## సముద్రపు కుక్కలు
రచన: సుజనశ్రీ

## నిప్పును మూటగట్టుకు!
రచన: డాక్టర్ పెందుర్తి మాస్టర్జీ

## ఆడపులి
రచన: కంచర్ల రమణ

## కార్యసాధకులు
రచన: సంపత్

"ఖైదీ" సీరియల్ - 23 వ భాగము

అపరాధ పరిశోధన సప్లిమెంట్—28
ఏప్రిల్, 1976
వెల : 3-00 రూపాయలు
ఏడాది చందా 30 రూపాయలు
ఉచిత చందా డిపాజిట్టు 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

గెడా రంగారావు

# సముద్రపు కుక్కలు

**సుజనశ్రీ**

ప్రఖ్యాత రచయిత నారాయణరావు సీట్ బెల్ట్‌ని విప్పేసి, ఫ్రీగా కూర్చున్నాడు. హెరాల్డ్ రాబిన్స్ నవల తెరిచాడు.

ఎయిర్ హోస్టెస్ ఓవల్టిన్, బిస్కట్లూ సర్వ్ చేసింది.

నారాయణరావు ఓవల్టిన్ సిప్ చేస్తున్నాడు నవలలోకి చూస్తూనే! అంతలోనే విమానం కుదుపుతో జర్క్ ఇచ్చింది. ఓవల్టిన్ ఒలికిపోయి అతడి ప్యాంటు మీద పడింది.

నారాయణరావు చిరాగ్గా తల త్రిప్పి చూశాడు. విమానంలో మిగతా ప్రయాణీకులకు తనకు జరిగిన అనుభవమే జరిగినట్టుగా తెలుసుకున్నాడు.

కొందరు ఆత్రుతగా "హలో మిస్! ఎయిర్ హోస్టెస్ ప్లీజ్! ఏం జరిగింది?" అని అరిచారు.

ఒకరిద్దరు స్త్రీలు పెద్దగా ఏడ్వసాగారు.

ఎయిర్ హోస్టెస్ ఓపిగ్గా అందరికీ ధైర్యం చెబుతోంది. "మరేం ప్రమాదం లేదండీ! విమానంలో ఏదో చిన్న ట్రబుల్ ఏర్పడింది. అంతే! త్వరలోనే దాన్ని పైలట్లు సరిచేస్తారు."

విమానంలోని ప్రయాణీకులు కొందరు బిత్తరబోయి చూస్తుంటే, మరికొందరు ప్రార్థనలు చేస్తున్నారు. ఆడ ప్రయాణికులయితే ఏడ్పు మానలేదు హోస్టెస్ ఓదార్చినా.

ఆ గలభా చూసి నారాయణరావు ప్రాన్పడిపోయాడు. తన జీవితం గూడ అవసానదశకు చేరుకుందా? నిన్ననే మాసపత్రికకు కథ రాసి పోస్టు చేశాడు. అదే తన ఆఖరు రచన అవుతుందా? ఆ రచన ప్రచురితమయేసరికి తను కీర్తిశేషుడౌతాడా?

విమానం కుడిప్రక్క రెక్కలో ఇంజన్‌కి నిప్పంటుకుంది. పైలట్లు ఎంత నేర్పుతో బ్యాలెన్స్ చేసినా, విమానం ఒక ప్రక్కకు వాలింది. దెబ్బతిన్న పక్షిలా రివ్వున నేలమీదకు దూసుకుపోతోంది.

విమానం లోపల ప్రయాణీకులు అటూ ఇటూ ఊగిపోతూ, తల్లడిల్లుతున్నారు. రోదనలూ, ఆక్రందనలతో నానా భీభత్సంగా ఉంది. రేడియో ఆఫీసరు గ్రాండ్ కంట్రోల్‌ని కాంటాక్ట్ చేయటంకోసం ఆదేపనిగా అరుస్తున్నాడు గొంతు చించుకొని!

విమానం అతివేగంగా వెళ్ళి నీళ్ళను ఢీకొంది. ఉవ్వెత్తున నీళ్ళు లేచినయ్. విమానం నీళ్ళలోకి మునిగింది. మళ్ళీ అదే

వేగంతో మరి కొద్ది క్షణాల్లో పైకి తేలింది. అప్పటికి విమానం ముక్కలు ముక్కలుగా పగిలిపోయింది.

## 2

నారాయణరావు కళ్ళు మూసుకున్నాడు. విమానం సముద్రపు నీళ్ళలో క్రాష్ అయేసరికి అతడు తన చేతి కందిన వస్తువుని గట్టిగా వాటేసుకున్నాడు.

ఆఖరు ప్రార్థనగా భగవంతుడ్ని స్మరించాడు నారాయణ రావు.

నారాయణరావు కళ్ళు తెరిచాడు, ఎదురుగా చిత్ర గుప్తుడ్నీ, యమధర్మరాజునీ చూడటానికి సంసిద్ధుడై. పవిత్ర సాహిత్యాన్ని విస్మరించి కేవలం డబ్బుకోసమే అశ్లీల రచనలు చేసినందుకుగాను తన పేరు చిత్రగుప్తుడి చిట్టాలో పాపాత్ముల కోవలోనే ఉంటుంది తప్పకుండా, అనుకుంటూ చుట్టూ కలయజూశాడు.

చుట్టూరా ఆకుపచ్చ రంగులో అనంతమైన సాగరం, పైన నీలాకాశమూ కనుపించాయి. సూర్యుడు నడినెత్తిన ప్రకాశిస్తున్నాడు.

అతడి చేతులు దేన్నో బలంగా వాటేసుకుని ఉన్నాయ్. అదేమిటా అని ఆశ్చర్యంగా చూశాడు. విమానం సీటు పన్న కుషన్ అది. నాలుగడుగుల పొడవూ, ఒకటిన్నరడు గుల వెడల్పుతో చిన్నసైజు పరుపులా ఉంది. రెక్జిన్‌తో కుట్టిన దట్టమైన ఫ్యూమ్ దవటంవల్ల అది నీళ్ళమీదికి తేలింది. దానితోపాటు తనూ నీళ్ళమీద తేలుతున్నాడు.

విమాన ప్రమాదం జరిగిపోయి ఎంత టైమ్ గడిచిందో ఊహించటానికి యత్నించాడు. కానీ, అతడికి అంతా అగమ్యగోచరంగా ఉంది. విమాన శకలాలుగానీ, తోటి

ప్రయాణీకుల శవాలుగానీ మచ్చుకైనా గోచరించలేదు అతడికి.

తను ఇంకా బ్రతికి ఉన్నాడా అనే సంశయం పోనే లేదు నారాయణరావుకి.

కాలం గడిచేకొద్దీ నీళ్ళపైన తేలుతున్న శరీరభాగం ఎండ వేడికి మాడిపోతున్నది. నీళ్ళలో మోకాళ్ళ క్రింది భాగం మునిగి ఉన్నయ్. ఆ భాగం అంతకంతకూ చల్లబడుతూన్నట్లుగా ఉంది.

తనీ పరిస్థితిలో ఎంత సేపని తట్టుకోగలడు? మరికొద్ది సేపట్లో కడుపులో ఆకలి మొదలవుతుంది. దాహంవేసి నోరు పిడచకట్టుకుపోతుంది. విమానం ఏక్సిడెంట్‌లోనే హాయిగా చావకుండా, ఈ చిత్రహింస, దారుణమరణం ఏమిటి తనకు అనుకున్నాడు నారాయణరావు.

సాయంత్రమవుతుండగా కనుచూపు మేరలో సముద్రం మీద తెల్లని తెరచాప కనుపించింది అతడికి. నారాయణ రావుకి ప్రాణం లేచి వచ్చింది.

ఆ తెరచాప వస్తున్న వేపుకే చూడసాగాడు ఆశగా.

క్రమేపీ ఆ తెల్లని తెర ఏదో నౌకది అయివుంటుందని అతడికి అర్థం అయింది.

మరో అరగంట గడిచేసరికి ఆ నౌక బాగా చేరువలోకి వచ్చింది.

డెక్ మీద స్టీరింగ్ వీల్ పట్టుకుని ఒక వ్యక్తి ముందుకు చూస్తూ నిలబడ్డాడు. మరో వ్యక్తి రెయిల్స్ మీదుగా వంగి నీళ్ళల్లోకి చూస్తూ సిగరెట్ త్రాగుతున్నాడు.

నారాయణరావు తన జేబులో చెయ్యి పెట్టాడు. ఎర్రగళ్ళ జేబురుమాలుని బయటకు లాగాడు. దాన్ని గాలిలో ఊపుతూ పెద్దగా అరిచాడు.

అతడి అరుపుల్ని సిగరెట్ తాగుతున్న వ్యక్తి విన్నాడు. వెంటనే అతడు వీల్ ముందున్న వ్యక్తి వంకకు తిరిగి ఏదో చెప్పాడు, చూపుడు వ్రేలితో తనను చూపుతూ.

నౌక గమ్యం మళ్ళింది. నారాయణరావుకి ప్రక్కగా వచ్చింది. నౌక డెక్ మీదనుంచి త్రాళ్ళు విసిరారు.

త్రాడుని రెండు చేతుల్తో గట్టిగా పట్టుకున్నాడు నారాయణరావు.

## 3

నారాయణరావుకు పొగలు గక్కుతున్న వేడి కాఫీ అందించారు.

నారాయణరావు కాఫీ త్రాగాడు. అతడికి ఊపిరి చేరకుంది.

"నే నెక్కడున్నాను? ఈ నౌక ఏ దేశానిది? ఎక్కడకు వెడుతోంది?" ఆతృతగా అడిగాడు నారాయణరావు.

"ఇది ఈస్ట్ ఇండియా దీవులకి సంబంధించింది. ఈ నౌక పేరు 'సీ డెవిల్.' సముద్రంలో 'సీల్' జంతువుల్ని వేటాడే నౌక ఇది!" అ చెప్పిన వ్యక్తి ఆ నౌకకు చెందిన నావికుడని గ్రహించాడు నారాయణరావు.

"ఈ నౌక కెప్టెన్ ఎవరు? అతడితో నేను మాట్లాడాలి!" అంటూ లేచి కూర్చున్నాడు నారాయణరావు.

నల్లగా మాసిన దుస్తుల జతను తెచ్చాడు మరో నావికుడు. "ముందు మీ తడిబట్టల్ని విప్పండి! ఈ పొడి దుస్తులు ధరించండి!"

"కృతజ్ఞుడ్ని! నీ పేరేమిటి తెలుసుకోవచ్చా?"

"నా పేరు థామస్! నేనీ నౌకలో కుక్ని! వంట వాడ్ని!"

నారాయణరావు చుట్టూ చేరిన వాళ్ళు తలో వైపూ వెళ్ళిపోయారు.

నారాయణరావు లేచి నిలబడ్డాడు. డెక్ మీద మరో మూల చిన్న గుంపు కనిపించింది. అటుగా వెళ్ళాడు. జనం మధ్యలోకి తొంగి చూశాడు.

నేలమీద బలిష్ఠమైన వ్యక్తి పడుకుని ఉన్నాడు. అతడి ఒంటిన ఉన్న దుస్తులు పేలికలై ఉన్నాయి. గుండెలమధ్య దట్టంగా రోమాలు పెరిగి ఉన్నయ్. అతడు కళ్ళు మూసుకుని ఉన్నాడు. మరో నావికుడు అతడి ముఖం మీదకు బకెట్‌తో నీళ్ళను క్రుమ్మరిస్తున్నాడు క్షణక్షణానికి.

ఆ నౌక కెప్టెన్ లార్సన్ సిగరెట్ త్రాగుతూ నేల మీద పడివున్న వ్యక్తి వంకే చూస్తున్నాడు. అతడు ఆజానుబాహువు. కండలు తిరిగిన దేహం. కోరమీసాలు. ఎర్రబారిన కళ్ళు! 'డెవిల్' నౌకకు తగిన కెప్టెన్‌లా ఉన్నాడు.

కెప్టెన్ లార్సన్ ఏదో బూతులు తిట్టసాగాడు. అతడు తిడ్తూన్న దాన్నిబట్టి, క్రిందపడి ఉన్న వ్యక్తి నౌక 'మేట్' అనీ, అతడు అతిగా త్రాగి పడిపోవడంవల్ల నౌకకు మరో మేట్ లేకుండా పోయాడనీ, అందుకే కెప్టెన్ అలా అగ్గిమీద గుగ్గిలం అవుతున్నాడనీ గ్రహించాడు నారాయణరావు.

మరికొందరు డెక్ రెయిల్స్ దగ్గర అక్కడక్కడా చేరి తమకేం పట్టనట్టుగా మాట్లాడుకుంటున్నారు. వారంతా సీల్ జంతువుల్ని వేటాడే వేటగాళ్ళనీ, మామూలు

నావికులకన్న వాళ్ళ హోదా కొంచెం ఎక్కువనీ తర్వాత తెలుసుకున్నాడు నారాయణరావు.

"ఇక ఏం లాభం లేదు! చచ్చిపోయాడు!" అనరిచా రెవరో.

కెప్టెన్ లార్సన్ ప్రక్కకు తిరిగాడు. వంటజేసే థామస్ అతడి కంటబడ్డాడు.

"ఒరేయ్! చూశావుగా! ఒక మేట్ చచ్చిపోయాడు. వాడి స్థానాన్ని నీవు భర్తీ చేయాలి. నీవూ అతిగా త్రాగి చావకుండా బ్రతికేడువు? తెలిసిందా?" కెప్టెన్ లార్సన్ కర్కశంగా అన్నాడు.

"అలాగే సార్!" థామస్ డెక్ మెట్లుదిగి వంటశాల వైపుకు వెళ్ళిపోయాడు.

"శవానికి అంత్యక్రియలకు ఏర్పాటు చేయండి!" అంటూ కెప్టెన్ లార్సన్ అక్కడనుంచి ఇవతలకు వచ్చాడు.

అప్పుడే నారాయణరావు కెప్టెన్ ఎదుటపడ్డాడు. వెంటనే కెప్టెన్‌కి అభివందనం చేశాడు. "మాది భారత దేశం! నేను రచయితను!" అని పరిచయం చేసుకున్నాడు కెప్టెన్‌కి.

## 4

కెప్టెన్ గలగల నవ్వాడు. "ఏమిటీ రచయితవా నీవు? అంటే కష్టపడి కానీ సంపాదించలేవన్న మాట! మీ నాన్న బాగా సంపాదించి ఉండాలి! అది తింటూ ఎందుకూ కొరగాని వ్రాతలు రాస్తున్నావన్న మాట! మీ లాంటి వాళ్ళు ఈ నౌకలో కంచాలు కడగడానికి తప్ప మరెందుకూ పనికిరారు!" అన్నాడు.

"నా గురించి మీరు శ్రమ తీసుకోనక్కర్లేదు! వీలైనంత త్వరలో నన్ను ఏదో దేశంలో దింపండి!"

"ఈ నౌకలోకి వచ్చిన వాళ్లెవరూ, తిరిగి ప్రాణాలతో బయట పడలేదు తెలుసా? అదీగాక నా సిబ్బందిలో ఒక 'మేట్' చనిపోయాడు. ఒక నావికుడు అతడి స్థానాన్ని భర్తీ చేస్తాడు. కేబిన్‌లో పనిచేసే బోయ్ నావికుడౌతాడు. కేబిన్ బోయ్ స్థానానికి ఒక మనిషి అవసరం. ఊరికే చేయనక్కర్లేదులే తిండిపెట్టి నెలకు అయిదు పౌండ్లు ఇస్తాను."

నారాయణరావుకి కోపం ముంచుకు వస్తున్నది. అయినా తను నిస్సహాయుడు. 'సీ డెవిల్' నౌక కెప్టెన్ నిజంగానే నరరూప రాక్షసుడిలా ఉన్నాడు. తన చేతికి చిక్కిన మనుష్యుల్ని బానిసలుగా చేసేస్తున్నాడు. వీడి బారినుంచి బయటపడటం ఎలాగ?

ఏదో సైరన్ మ్రోత వినబడింది. నారాయణరావు అటుగా చూశాడు. చేరువగా మరో నౌక వస్తోంది.

"ఒరేయ్ థామస్! కేబిన్ బాయ్‌ని ఇలా కేకెయ్యి!" లార్సన్ అరిచాడు.

కేబిన్ బాయ్‌ని వెంటబెట్టుకుని థామస్ వచ్చాడు.

"ఒరేయ్ హాసన్! నీ వీ రోజునుంచి నావికుడివి. తెలిసిందా?"

"కానీ నావికుడి విధుల్ని ఎలా నిర్వర్తించాలో నాకు తెలియదే! నన్ను క్యాబిన్‌లోనే వుంచండి సార్!"

కెప్టెన్ లార్సన్‌లోని రాక్షసత్వాన్ని తొలిసారిగా చూసాడు నారాయణరావు.

క్యాబిన్ బోయ్‌కీ, కెప్టెన్‌కీ మధ్య మూడడుగుల దూరం ఉంది. కెప్టెన్ ముందుకి ఒక్క అంగ వేసి, పిడికిలి

బిగించి బోయ్ పొట్టలో గుద్దాడు.

నూట అరవై పౌన్ల బరువున్న బోయ్ ఫుట్ బాల్ లాగ ఎగిరి అల్లంత దూరంలో క్రింద పడిపోయాడు. బాధతో అతడు మెలికలు తిరిగిపోతున్నాడు. డెక్ మీదున్న వాళ్ళు బోయ్‌ని చూసి పకపక నవ్వుతున్నారు. ఎవరైనా చావు దెబ్బలు తిని బాధతో రోదిస్తుంటే, వాళ్ళకు వినోదమల్లే ఉంది.

ఇందాక సైరన్ వినిపించిన నౌక బాగా చేరువ అయింది. 'సీ డెవిల్'కి ప్రక్కగా ముందుకు సాగిపో తోంది.

గబగబా డెక్ చివరకు పరుగెత్తాడు నారాయణరావు. రెయిల్స్‌కి ఆనుకుని నిలబడి పెద్దగా అరిచాడు "ఆపండి! నౌకను ఆపండి! నేనూ అందులోకి వస్తాను. నన్ను రక్షిస్తే వెయ్యిరూపాయలిస్తాను."

అతడి మాటలు అవతలి నౌకలోకి వినిపించినయ్. అందులోనుంచి మరో వ్యక్తి బదులుగా అరిచాడు. "ఏమిటి నువ్వనేది? నిన్ను రక్షించాలా? అందుకు వెయ్యిరూపాయ లిస్తావా?"

ఎక్కడో నిల్చునివున్న కెప్టెన్ లార్సన్ గభాలున అక్కడకు వచ్చాడు.

"అతడు మత్తుగా త్రాగివున్నాడు. అతడి మాటల్ని లక్ష్య పెట్టకండి!"

అవతలి నౌకలోని వ్యక్తులు నారాయణరావుని చూసి హేళనగా నవ్వారు.

ఆ నౌక 'సీ... డెవిల్'ని దాటుకుని వెళ్ళిపోయింది.

కెప్టెన్ లార్సన్, నేలమీద పడివున్న కేబిన్ బోయ్ దగ్గరకు నడిచాడు.

"ఏంరా? నే చెప్పినట్టు చేస్తావా? మరోటి వడ్డించ మంటావా?"

"వద్దు బాబోయ్! మీరే పని చేయమంటే అదేచేస్తాను సార్!" కేబిన్ బోయ్ లబోదిబో కొట్టుకున్నాడు.

"ఇక నీ సంగతి ఏమిటి?" కెప్టెన్, నారాయణరావు వైపుకి తిరిగి అడిగాడు.

"నన్ను ఏదో దేశం చేరిస్తే, మీకు వెయ్యిరూపాయలు బహుమానమిస్తాను సరా!"

"నే చెప్పినట్టు నడుచుకుంటావా? లేక వాడికి జరిగిన మర్యాదే నీకూ జరగాలా?"

నారాయణరావు భీతితో కెప్టెన్ కళ్ళలోకి చూశాడు.

"ఏం మాట్లాడవు?" కెప్టెన్ మరోసారి గర్జించాడు.

తను కాదంటే అక్కడికక్కడే కొట్టి చంపగలరు వీళ్ళు. మానవతా విలువలు తెలిసినట్టు లేవు వీళ్ళకు. ఎంత సేపటికీ హింసాకాండ దౌర్జన్యం చేయడమే తెలుసు వీళ్ళకు.

"అలాగేనండీ! మీరేం చెయ్యమంటే అదే చేస్తాను!" తడారిపోయిన గొంతుని పెగల్చుకుని బదులిచ్చాడు నారాయణరావు.

"నీ పేరేమిటి?"

"నారాయణరావు!"

"అంతపేరు మాకు నోరు తిరగదు! రావ్ అని పిలుస్తాను. నీ వయసెంత?"

"ముప్ఫయ్ అయిదు సంవత్సరాలు!"

"సరే! వంటశాలకు వెళ్ళు. పని ఎలాచేయాలో శ్రద్ధగా నేర్చుకో! వంటకాలు పాడయాయో, నిన్ను వలుచుకు తింటాను."

నారాయణరావు నిశ్చేష్టుడై అలాగే నిల్చుండి పోయాడు.

## 5

సముద్రంమీద గాలి వీచసాగింది. కెప్టెన్ లార్సన్ పెద్దగా అరుస్తూ ఆజ్ఞలు జారీ చేస్తున్నాడు. నావికులు త్రాళ్ళను లాగుతున్నారు. తెరచాపలు ముడుచుకు పోతున్నాయ్.

ఒక్క క్షణం క్రితం డెక్ మీద సంభవించిన మరణాన్ని గురించి కానీ, అక్కడ జరిగిన హింసాకాండను గానీ ఎవరూ పట్టించుకున్నట్టు లేదు. ఇలాంటివి రోజూ సర్వ సాధారణంగా జరిగేవిలా ఉదాసీనత చూపారు అక్కడున్న వ్యక్తులు.

'సీల్' వేటగాళ్ళు ఏవో కథలు చెప్పుకుంటూ నవ్వుకుంటున్నారు. నావికులు తుఫానుని ఎదుర్కొనే సన్నాహంలో వున్నారు. కెప్టెన్ లార్సన్ పెద్దగా అరుస్తూ ఆజ్ఞలు జారీ చేస్తున్నాడు. ఆకాశంలోకి చూస్తూ, తుఫానుని అంచనా వేస్తున్నాడు.

నారాయణరావు వంటశాలలోకి వెళ్ళాడు థామస్ వెంట. థామస్ క్షణాల్లో మారిపోయాడు. నారాయణ రావుని తన స్వంత నౌకరులా భావించి అతడిమీద పెత్తనం చెలాయించసాగాడు.

సముద్రంమీద తుఫాను తీవ్రతరం అయింది. ఆ తాకిడికి నౌక అటూ ఇటూ ఊగిపోతోంది. నారాయణరావుకి నిలద్రొక్కుకోవడం కష్టమైపోయింది. కెప్టెన్ గదిలోకి టీ తీసుకువెడుతూ, వాననీళ్ళతో తడిసివున్న చెక్క నేలపై కాలు జారి బోర్లా పడిపోయాడు. మోకాలుచిప్పకు

బలమైన గాయమైంది. కాలు విరిగిపోయిందనే అను కున్నాడు నారాయణరావు.

అతడి వెనుకే శాపనార్థాలు పెట్టుకుంటూ వచ్చాడు థామస్. "నీ పుచ్చె పగులగొట్టా! సరిగా నడిచి చావ లేవూ? నీవు టీ తీసుకెళ్ళటానికి పనికిరాకపోతే ఇక ఈ నౌకలో నీ వింకేం చేసి చస్తావూ?"

వంటశాలలో వడ్డించటం గూడ తేలికనిపించలేదు నారాయణరావుకి.

ఆ రాత్రి హసన్ అతడి గాయానికి మందువేసి కట్టు కట్టాడు. అదే తన ఊళ్ళో అయితే, నారాయణరావు బెడ్ మీద హాయిగా విశ్రాంతి తీసుకునేవాడు. ఫ్యామిలీ డాక్టర్ పూట పూటా వచ్చి వైద్యం చేసేవాడు. ఏదో నవల చదువుకుంటూ తన బాధను మరిచిపోగలిగేవాడు.

కాలి గాయం బాధతో అతడికి రాత్రిళ్ళు సరిగా నిద్ర పట్టలేదు. ఈ నౌకలోనివాళ్ళకు రక్తపాతం అంటే లెక్క లేదు. హసన్ వ్రేలికి గాయమయింది ఒకసారి. కానీ అతడు దాన్ని లక్ష్యపెట్టనే లేదు.

అయితే వీరంతా అతి స్వల్ప విషయాలకు తీవ్రంగా వాదించుకుంటారు. సీల్ గుడ్లను పెడుతుందని కొందరూ, కాదు పిల్లల్ని కంటుందని మరికొందరూ, అది తన పిల్ల లకు ఈత నేర్పుతుందని కొందరంటే, మరికొందరు అది పుట్టుకతోనే ఈత నేరుస్తుందనీ కాట్లాడుకునేవారు.

నారాయణరావు తన స్థితికి విచారించాడు. స్వతహాగా అతడు దుర్బలుడు. సన్నగా, పీలగా వుంటాడు. స్పోర్ట్స అంటే అసలే ఆసక్తి లేదు. సాహసం అంటేనే అతడు ఆమడదూరంలో వుంటాడు. కుర్చీలో కూర్చుని, టేబుల్ మీదకు వాలి ఆ సమానం ఏదో రాసుకునే సంపన్నవ్యక్తి

ఈనాడు సముద్రపు జంతువుల్ని వేటాడే నౌకలో వంటవాడై, బంగాళాదుంపలు పొట్టు తీయటం, కంచాలూ, గ్లాసులూ కడగటం చేస్తాడని ఎప్పుడూ ఊహించలేదు.

ఈ పాటికి భారతదేశంలో ప్రఖ్యాత రచయిత నారాయణరావు విమాన ప్రమాదంలో దుర్మరణం పాలైనందుకు శ్రద్ధాంజలులు ఘటిస్తుంటారు తెలుగు ప్రజలు. స్మారక సభలు చేస్తుంటారు. తను చనిపోయినా బాగుండేది. జీవన్మృతుడయేవాడు. తన జన్మ నూటికి నూరుపాళ్ళూ సార్థకం అయివుండేది, ఇలా జీవచ్ఛవంలా నివసించేకన్నా!

కాలిబాధతో రాత్రంతా నిద్రపట్టలేదు అతడికి. ఎప్పుడో తెల్లవారుజామున కన్ను మూశాడో లేదో, థామస్ పెద్దగా అరుస్తూ, తిడుతూ లేపాడు, నారాయణరావుని.

నారాయణరావు వంటశాలలోకి వెళ్ళాడు. తన ఒంటి మీదున్న గుడ్డలు విప్పి, థామస్‌కి తిరిగి ఇచ్చేశాడు. పొడిగా ఆరిన తన డ్రెస్ వేసుకున్నాడు. అప్రయత్నంగా నారాయణరావు చేయి జేబులోకి పోయింది. అందులో తన డబ్బు అయిదువందలు మాయమయినై. ఏవో చిల్లర, ఒక రూపాయి నోటూ ఉన్నయ్ మరో జేబులో.

"నా జేబులో డబ్బు ఏమయింది?" నారాయణరావు అమాయకంగా అడిగాడు.

"పాపం గదా అని నా డ్రెస్ ఇస్తే, నాకే దొంగతనం అంటగడుతున్నావా? మరోసారి ఆ మాట అన్నావో నీ తల చితక్కొడతాను జాగ్రత్త!" అంటూ పిడికిళ్ళు బిగించి మీదకు వచ్చాడు థామస్.

అహింసకు ప్రతిరూపమయిన నారాయణరావు ఏం చేయగలడు? అక్కడ్నుంచి పారిపోయి, ఆ సమయానికి

తన్నులు తప్పించుకున్నాడు. కాలిబాధతో కుంటుతూ పారిపోతూన్న అతడ్ని చూసి మిగతావాళ్ళు విరగబడి నవ్వారు.

కాసేపయాక మళ్ళీ వంటశాల చేరుకుని తన పని చేసుకు పోసాగాడు నారాయణరావు.

# 6

కెప్టెన్ గది శుభ్రంచేసే పనికూడ నారాయణరావు మీదే పడింది. ఆ గదిలోకి వెళ్ళిన వ్యక్తి ఆశ్చర్యంతో నోరు తెరుచుకుని చూశాడు.

కెప్టెన్ బెడ్ చుట్టూ పుస్తకాలు చిందరవందరగా పడివున్నయ్. షేక్స్పియర్ డ్రామాలూ, మిల్టన్ పొయట్రీ, సైన్స్‌కి సంబంధించిన పుస్తకాలూ, కొన్ని తెలుగు గ్రంధాలు సైతం అల్మారాలో వున్నయ్.

మానవత్వం లేని రాక్షసుడుగా ప్రవర్తించే లార్సన్ ఇన్ని గ్రంధాల్ని చదివాడా? బెడ్ మీదున్న పుస్తకాన్ని తెరిచి చూశాడు నారాయణరావు. అందులో కొన్ని పేజీల్లో అక్కడక్కడా పెన్సిల్‌తో అండర్‌లైన్లు చేయ బడి వున్నయ్. అయితే కెప్టెన్ లార్సన్ విద్యాధికుడైన వింత పశువన్నమాట?

ఆ దఫా నారాయణరావు ధైర్యంగా కెప్టెన్ ఎదుట పడ్డాడు.

"నా జేబులో డబ్బు అయిదువందల రూపాయలు ఎవరో కాజేశారు!" అని ఫిర్యాదు చేశాడు.

"ఎప్పుడు పోయింది?" కెప్టెన్ తీరిగ్గా అడిగాడు.

తను నౌకలోకి వచ్చినపుడు థామస్ అతడి దుస్తు చ్చి, తన తడిగుడ్డల్ని తీసుకోవటమూ, డబ్బు పోయిందని

చెబితే థామస్ ఎలా కసురుకున్నదీ చెప్పాడు నారాయణ రావు.

"అంత డబ్బు గలవాడివి నిర్లక్ష్యంగా వదిలేస్తే ఎలాగ? లక్ష్యం లేనివాడివద్ద లక్ష్మి ఛస్తే నిలవదు తెలుసా?"

"ఇంతకీ నా డబ్బు తిరిగి నాకు చేరేదెలాగ సార్!"

"అదీ నీ తద్దినం! డబ్బుని అజాగ్రత్తగా పెట్టుకున్నావ్! అందువల్ల మరో వ్యక్తిలో ఆ డబ్బుని దొంగిలించాలన్న ఆలోచనను ప్రేరేపించావ్! అది నీవు చేసిన మరో తప్పు! ఇక వెళ్ళి పనిచూసుకో ఫో!"

అతడి కోపం చూసి నారాయణరావు అక్కడ్నుంచి ఇవతలకు వచ్చేశాడు.

## 7

థామస్ డెక్ మీదకు వెళ్ళి వీల్‌ని పట్టుకుని నౌకను నడుపుతున్నాడు.

నారాయణరావు వంటలో నిమగ్నుడైనాడు. అక్కడికి మరో నావికుడు వచ్చాడు. అతడి పేరు అహమ్మద్! అహమ్మద్ వట్టి వాగుడుకాయ! వినేవాడుంటే విసుగూ విరామం లేకుండా వాగుతూనే వుంటాడు, చెప్పింది చెప్పకుండా.

"నీ వసలు ఈ నౌకమీదకు ఎందుకు వచ్చావయ్యా? ఈసారి వేట ముగిసేలోపలే ఇందులో ఉన్నవాళ్ళు చాలా మంది చచ్చిపోవటం ఖాయం! నరకం అనేది ఎక్కడో లేదు. ఇదే చిన్న నరకం అనుకో! సాగరగర్భంలో తేలియాడే నీళ్ళమీది నరకం! కెప్టెన్ లార్సన్‌లాంటి కిరాతకుడు ఏ మతంలోని పురాణాల్లోనూ దొరకడనుకో! అసలు ఈ నౌక 'సీల్' జంతువులను అంటే సముద్రపు కుక్కలను

వేటాడుతుంది. కాని అసలైన సముద్రపుకుక్క ఆ కెప్టెన్ గాడు. వాడిని వేటాడే మొనగాడు రావాలి.''

“అయితే వీరంతా ఈ హింసాకాండను ఎలా సహిస్తున్నారు?''

“అక్కడే వుంది గమ్మత్తంతా! నా దగ్గర పనిచేసే బోటు సరంగునే తీసుకో! వాడు వచ్చినప్పుడు ఆడపిల్లలా గుండేవాడు. ఒక ఏడాదిలోనే ఈ వాతావరణం వాడిలో మార్పు తెచ్చింది. వాడి చేతిమీదుగా ఇద్దర్ని హత్య చేశాడంటే నమ్ము!''

అదీ నిజమే అనిపించింది నారాయణరావుకి. తను కూడా ప్రస్తుతానికి పిల్లిలా సాధువుగానే వున్నాడు. కానీ అందరూ తనని చవటక్రింద జమకట్టి హేళన చేస్తున్నారు. ఆ థామస్‌గాడయితే ఒక్క క్షణం ఊరికే కూర్చోనివ్వడు. ఎప్పుడూ ఏదో పని పురమాయిస్తూనే వుంటాడు. ఈ వాతావరణంలో మరి కొద్దికాలం వుంటే, తనలోనూ హింసాప్రవృత్తి ప్రబలుతుంది. అహమ్మద్ ఉదహరించినట్టుగా, తనూ ఎవర్నో హత్య చేసి తీరాల్సి వస్తుంది.

ఆ రోజు ఉదయాన్నే ఉధృతమైన గాలి వీచసాగింది. ఆ గాలి సాగినప్పుడు ఎవరైనా తెరచాప స్తంభం పైకి ఎక్కి అక్కడ త్రాళ్ళు తెగిపోకుండా కట్టు దిట్టం చేసి రావాలి.

కెప్టెన్ లార్సన్ ఆ పనిని హసన్‌కి చెప్పాడు. హసన్ క్యాబిన్ బోయ్‌నుంచి నావికుడుగా వచ్చినవాడు. తెరచాప స్తంభం పైకి చూస్తూంటేనే అతడు భయంతో వణికి ఛస్తున్నాడు. దాదాపు ఎనభై అడుగుల ఎత్తున్న

స్తంభం శిఖరాగ్రానికి వెళ్ళి, క్రిందకు చూస్తే, ఎంత ధైర్యస్థుడయినా, కొత్తవాడికి గుండెలవిశిపోతాయి.

లార్సన్ కళ్ళెర్రజేయటం చూసి హాసన్ తెరచాప స్తంభం పైకి త్రాటి నిచ్చెన మీదుగా ఎగబ్రాకాడు. తీరా పైకి పోయాక గాలి ఉధృతానికి పడవ అటు ప్రక్కకూ, ఇటుప్రక్కకూ ఊగిసలాడిపోయింది. హాసన్ బల్లిలా తెరచాప స్తంభానికి కరుచుకుపోయాడు.

"ఒరేయ్ కుక్కా! త్వరగా తాళ్ళు సరిచెయ్! గాలికి అవి తెగిపోతాయో, నీ పీక కూడా తెగగోస్తాను!" లార్సన్ అరిచాడు.

హాసన్‌లో చలనం కలిగింది. అతడు త్రాళ్ళను గట్టిగా కట్టాడు. తెగేలా వున్న త్రాళ్ళకు కొత్త తాడు జోడించి కట్టాడు.

"ఇక దిగిరా!" లార్సన్ అనుమతి ఇచ్చాడు.

## 8

ఈ నౌక మీదకు వచ్చాక వారాలూ, తేదీలు గూడ మరచిపోయాడు నారాయణరావు.

అతడు తీరిక క్షణాల్లో కెప్టెన్ లార్సన్ మనస్తత్వం గురించే ఆలోచించేవాడు. ఒక్కొక్కపుడు లార్సన్ తత్వవేత్తలా కనుపిస్తాడు. మరోసారి హృదయం లేని పాషాణంగా తోస్తాడు.

అతడి ప్రవర్తన చాలా విచిత్రంగా వుంటుంది. ఏవేళ-ప్పుడు యెలా వుంటాడో యెవరూ వూహించలేరు.

అయితే అతడిపట్ల ఈ నౌకలోని వారందరికీ పూర్తి ద్వేషం వుంది. అదను చిక్కితే లార్సన్‌ని దారుణంగా చంపి స్వేచ్ఛను పొందాలన్న కోర్కె ప్రతి ఒక్కరికీ

ఉంది. కానీ కెప్టెన్ లార్సన్ కసాయితనానికి ఝడిసి అతడికి లొంగి ఉన్నారందరూ.

ఆరోజు మరో విచిత్రం జరిగింది. కెప్టెన్ లార్సన్ థామస్‌ని పేకాటకు పిలిచాడు. నారాయణరావుని కూడా పిలిచి ఆట గమనిస్తూండమని చెప్పాడు.

ప్రతి ఆటలోనూ లార్సన్ గెలిచాడు. థామస్ తన గదికి వెళ్ళి కొద్దికొద్దిగా డబ్బు తెచ్చి ఆటలో పెట్టేవాడు. ఓడిపోగానే తిరిగి మళ్ళీ కొంత తెచ్చేవాడు.

కెప్టెన్ లార్సన్, పాత వంటవాడూ, ప్రస్తుతం నావికుడూ అయిన థామస్ దాచుకున్నదంతా గెల్చుకున్నాడు. దాన్ని లెక్కవేస్తే సరిగా అయిదువందల రూపాయలయింది.

"ఆ డబ్బు నాదే!" అన్నాడు నారాయణరావు సంతోషంతో.

"అని దాని మీద రాసి వుందా? ఈ లోకంలో బలం గల వాడిదే అన్నీను. అసలా ప్రకృతి సృష్టిలోనే ఉంది. బలమైన ప్రాణులు బలహీనమైన వాటిని విందుచేస్తయ్. లేడిని పులి, ఏనుగుని సింహం, కప్పను పాము, ఎలుకని పిల్లి ఇలాగే! కానీ మానవుడు తానేదో తెలివైన వాడిననే గర్వంతో బలహీన వర్గాలకు సాయం చెయ్యాలనే మిషతో చట్టాల్ని యేర్పరిచాడు. అంతమాత్రంచేత పేదవాడి బాధలు తీరిపోతాయా? లేదు! బలవంతుడు చట్టాని కందకుండా పని చేస్తూ సన్నకారువాడ్ని పీడిస్తూనే వున్నాడు!"

"అంటే ప్రపంచంలో నీతీ, నిజాయితీ, ధర్మం, న్యాయం ఇదంతా బూటకమేనా?"

"ముందు మనిషి తన సంక్షేమాన్ని చూసుకుంటాడు. తర్వాత తనమీద ఆధారపడిన భార్యా పిల్లల సంక్షేమం

కోసం పాటుపడతాడు. ఆ తర్వాత నే మనిషి సంఘానికి ఉపయోగపడే పనులు చేయాలని సాంఘిక సంస్కర్తల ఉవాచగదా?"

"అంటే నీ స్వార్థాన్నే నీవు చూసుకుంటున్నావన్న మాట!"

లార్సన్ నవ్వాడు. "ఆ! ఇప్పుడు నీవు నా దారికి వస్తున్నావ్?"

"కానీ మీ స్వార్థం కోసం, మీ స్వలాభం కోసం, మీ ఆత్మ సంతృప్తికోసం ఇంత మందిని ఇంత దారుణంగా హింసించటం అన్యాయం కాదూ?"

"నీవు చెప్పినదానికి ఒప్పుకుంటాను. నేనింత కర్కశంగా ఉండకుండా, సౌమ్యంగా ఉంటానే అనుకో! అప్పుడు వీళ్ళు నన్ను అసలు బ్రతకనిస్తారంటావా? నన్ను చంపి, నా కండల్ని కాకులకూ గద్దలకూ వేయరూ?"

"ఇప్పుడు మాత్రం తక్కువేముంది. పగబట్టిన నాగుల్లా, ఎప్పుడు అదను దొరుకుతుందా, ఎప్పుడు కాటు వేద్దామా అని ఎంతమంది కాచుక్కూర్చోలేదు?"

"అందులోనే నా కానందం వుంది. అవకాశం వస్తే నా ప్రాణాలు తీయటానికి వెనుకాడని శత్రువులతో నేను ఎప్పుడూ అప్రమత్తతో, అజాగ్రత్తతో మెలగటానికి ఆస్కారం ఉంటుంది."

"మీరేమన్నా చెప్పండి. మీ హింసాత్మక ధోరణి మాత్రం నాకు నచ్చలేదు." నారాయణరావు నిష్కర్షగా చెప్పేశాడు. తీరా అనేశాక తన మాటకు లార్సన్ కోపగించుకుంటాడేమోనని భయపడ్డాడు.

కెప్టెన్ లార్సన్ పకపక నవ్వాడు. "నేను హింసా

త్మక ధోరణి గలవాడ్ని అనుకుంటే, నా సోదరుడ్ని చూస్తే నీవేమంటావో నా కర్థం కావడంలేదు. వాడికి నాపాటి అక్షరజ్ఞానం గూడ లేదు. మనిషిని నిలువునా చర్మం వలిపిస్తాడు వాడు!''

''మీ సోదరుడా? ఆయనేం పని చేస్తుంటాడు?''

''నాలాగే వాడికీ మరో ఓడ వుంది. అయితే అది స్టీమ్‌తో నడిచేది. వాడూ 'సీల్స్'ని వేటాడ్తాడు. మా ఇద్దరికీ బద్ధ విరోధం! మాలో ఒకరివల్ల మరొకరికి చావు రాసి ఉన్నదనేది మాత్రం యథార్థం!''

నారాయణరావు మౌనంగా వుండిపోయాడు.

నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ, లార్సనే మళ్ళీ ''ఇన్నాళ్ళకు నా మనసు విప్పి మాట్లాడితే అర్థం చేసుకోగలిగిన వ్యక్తి దొరికాడు'' అన్నాడు.

ఆ విధంగా కెప్టెన్ లార్సన్ మెప్పు పొందగలిగినందుకు నారాయణరావు తనను తాను అభినందించుకున్నాడు.

నారాయణరావు ఇక వంటశాలకు పోవలసిన అగత్యం తప్పింది. ఆ బాధ్యత మరొకరికి అప్పజెప్పబడింది.

మరునాడు భోజనాల సమయంలో లార్సన్ పచ్చి బంగాళాదుంపను తెప్పించాడు. దాన్ని తన పిడికిలిలో పెట్టి వత్తేశాడు. బంగాళాదుంప పొడిపొడి అయిపోయింది. లార్సన్ గర్వంగా నవ్వాడు.

మరుక్షణంలోనే అతడు నారాయణరావు చేతిని పట్టుకున్నాడు గట్టిగా. అలానే గట్టిగా వత్తేశాడు. నారాయణరావు ఖూనీ జరుగుతున్నట్టుగా రంకెలు పెట్టాడు. చేతి ఎముక ఫ్రాక్చర్ అయిందా అన్నంత బాధ కలిగింది.

"నా బలాన్నంతా ఉపయోగించలేదు. ఏదో సాంపిలుగా వత్తాను. అంతమాత్రానికే ఇలా అయిపోతే ఎలా?" అన్నాడు నవ్వుతూ పైగా.

# 9

నారాయణరావు కెప్టెన్ ప్రాపకాన్ని సంపాదించడం థామస్‌కి కంటగింపు అయింది. అందుకని అతడో పథకం వేసి, వంటవాడ్ని మరో పనికి పారద్రోలాడు. దాంతో నారాయణరావు తిరిగీ నలభీమపాకానికి దిగాల్సి వచ్చింది.

ఒకరోజు థామస్ భోజనం చేస్తూ పదార్థాలు యేవీ బాగోలేవని పిడికిలి బిగించి నారాయణరావు మీదకు వచ్చాడు.

అయితే నారాయణరావు ఇదివరకులా భయపడి పారిపోలేదు. ఇక్కడి దౌర్జన్యానికీ, హింసాకాండకూ అతడు అలవాటుపడిపోయాడు.

తిరిగి తనుగూడ పిడికిళ్ళు బిగించి థామస్‌ని ఎదుర్కోవటానికి సంసిద్ధుడైనాడు. ఈ హఠాత్పరిణామానికి థామస్ వెనక్కి తగ్గాడు తనలో తనే విస్మయం చెందుతూ.

థామస్ అంతతో ఊరుకోలేదు. నారాయణరావుని భయపెట్టేందుకు మరో పన్నాగం పన్నాడు. వంటగది షెల్ఫ్‌లోంచి, మాంసం కోసే రెండడుగుల కత్తిని తీసుకున్నాడు. అందరూ చూస్తూండంగానే, బాహాటంగా, దాన్ని నూరసాగాడు. పదును బెట్టడం మొదలెట్టాడు.

నావికులూ, వేటగాళ్ళూ వింతగా థామస్ చుట్టూ మూగేరు. "రండర్రా! థామస్ కత్తి నూరుతున్నాడు నారాయణరావుని పొడవటానికి!" అని ఒకళ్ళనొకళ్ళు పిలుచుకుని మరీ వస్తున్నారు.

థామస్ ఇదంతా వేడుక కోసం చేయటం లేదనీ, అవసరం వచ్చినప్పుడూ, అవకాశం కలిగినప్పుడూ దాన్ని తప్పకుండా తనమీద ఉపయోగిస్తాడనీ నారాయణరావుకి తెలుసు.

అందరూ తనను వింతగా గమనించడం థామస్‌కి కొంత గర్వకారణం అయింది.

మరో నావికుడు హసన్, థామస్ వంక చూసి హేళన చేశాడు. "నీవు ఒట్టి దొంగవిరా!" అని అతడ్ని పరిహసించినపుడు, థామస్ అతడి వంక కత్తిని ఝుళిపించి బెదిరించాడు.

హసన్ ఇంకా హేళన చేశాడు. మెరుపులా థామస్ దూకాడు హసన్ మీదకు. హసన్ మోచేతి క్రింది నుంచి మణికట్టు వరకూ వున్న కండ తెగి క్రింద బడింది. అతడి చేతినుండి కారిన రక్తాన్ని చూసి, ఆవేశంలో కత్తితో పొడిచిన థామస్సే అదిరిపోయాడు. హసన్ మాత్రం చెక్కు చెదరలేదు.

"ఒరేయ్ థామస్! నీ పాపం పండే రోజు త్వరలోనే వస్తుందిరా! ఆ రోజున నీ మీద ఇంతకింతా పగ సాధించి తీరతాను!" అన్నాడు హసన్, అక్కడ్నుంచి వెళ్ళిపోతూ.

హసన్ మాటలకు థామస్ కొద్దిగా ఝుడిసిన మాట వాస్తవమే! కానీ తన చర్యవల్ల నారాయణరావు ఇంకా భయపడ్డాడని తెలిసి ఇంకా సంబరపడ్డాడు.

నారాయణరావు తనంటే భయపడుతున్నాడని తెలిసిన, థామస్ తనకు తీరిక వున్నప్పుడల్లా కత్తిని బయటకు తీసి నూరసాగాడు. తనకు నౌకలో అదే ఉద్యోగమా అన్నట్లుగా కత్తి పదును పెట్టసాగాడు.

అటు కెప్టెన్ లార్సన్ గానీ, మరో ఇతర వ్యక్తి ఎవరూ తనకు సాయం చెయ్యరు; థామస్ నుంచి రక్షించే ప్రయత్నం చేయరు, సరిగదా తన పిరికితనానికి నవ్వుతారు. థామస్ తనను కత్తితో పొడిస్తే, తను గాయపడితే, ఓడ లోని వారంతా వినోదిస్తారు.

దౌర్జన్యాన్ని, దౌర్జన్యంతోనే యెదుర్కోవాలి. హింసకు హింసే బదులు చెప్పగలదు. అందుకనే నారాయణరావు కిచెన్‌లో శోధించి మరో కత్తిని దొరకబుచ్చుకున్నాడు. ఆ రాత్రి నిశ్చింతగా నిద్రపోయాడు నారాయణరావు.

మర్నాడు మధ్యాహ్నం థామస్ అలవాటు ప్రకారం కత్తి తీసి నూరుతున్నాడు.

నారాయణరావు గూడ తను దొరకబుచ్చుకున్న పాత కత్తిని బయటకు తీశాడు. థామస్‌కి యెదురుగా కొంత దూరంలో కూర్చుని తను గూడ కత్తిని పదును పెట్ట సాగాడు.

ఇద్దరు వ్యక్తులు కత్తులు నూరుతుంటే డెక్ మీదకు సగం మంది జనం పోగయ్యారు, వాళ్ళిద్దరూ యుద్ధం చేస్తే చూడాలని కుతూహలంతో చూడసాగారు.

అలా అరగంట గడిచింది. ఈ మధ్యలో బోర్ కొట్టిన నావికులు తమ పనిలోకి వెళ్ళిపోయారు.

థామస్ తను కూర్చున్న చోటునుంచి లేచి, నారాయణరావు దగ్గరకు వచ్చాడు. 'వీళ్ళ ఆనందం కోసం మనం కొట్టుకు చావడం అవివేకం. వాళ్ళకు మనపై ఏ మాత్రం అభిమానం లేదు. మనం ఒకళ్ళ కుత్తుకలు మరొకరం కత్తిరించుకుంటే వీళ్ళు వినోదిస్తారు. నీవు మంచివాడి

వని నాకు తెలుసు! నీలోనూ ధైర్యం ఉందని గ్రహిం చాను. మనం మిత్రులుగానే ఉండిపోదాం!''

నారాయణరావు అతడిలోని మార్పుకు సంతోషిం చాడు. ఇద్దరూ చేతులు చాచి కరచాలనం చేసుకున్నారు.

''ఇంకేం చూస్తారు? ఫొండి, ఫొండి!'' అని అరిచాడు థామస్ అక్కడ మిగిలి ఉన్న వాళ్ళతో.

''థామస్ పొగరు తగ్గిందిలే! రావ్‌దే ఇకనుంచి పై చెయ్యి!'' జనంలో కొందరు చెప్పుకుంటూ వెళ్ళి పోయారు.

నారాయణరావు తన కింత సులభంగా గెలుపు లభి స్తుందని కలలో గూడ ఊహించలేదు.

అంతేకాదు! ఈ గెలుపుని పూర్తిగా సద్వినియోగం చేసుకోదలిచాడు గూడా. పైగా కెప్టెన్ లార్సన్ అప్పు డప్పుడూ నారాయణరావుని ప్రత్యేకించి పిలిపించేవాడు పిచ్చాపాటీ మాట్లాడేందుకు. ఆ సమయంలో నారాయణ రావు చెయ్యాల్సిన పనిని గూడ థామసే చేసేవాడు కిక్కురుమనకుండా!

# 10

''సీ డెవిల్'' నౌక ఇంకా ఉత్తరంగా ప్రయాణం సాగించింది. సముద్రంలోంచి చేపలు పైకి యెగిరి పడు తుంటాయి! రాత్రిపూట అయితే ఇంకా చెప్పనక్కర్లేదు. తెల్లారేసరికి బోలెడు చేపలు డెక్ నిండా పడి ఉంటయ్. థామస్ వాటన్నిటినీ ఏరుకళ్ళి కూరవండేవాడు.

''మన నౌక జపాన్ తీరప్రాంతాలకు వెళ్ళేసరికి ఉంటుంది పని! అక్కడే కెప్టెన్ లార్సన్ సోదరుడు కెప్టెన్ జాక్ ఎదురుపడతాడు. అతడి నౌక పేరు 'సీ

హాక్.' వాడి నౌక ఆధునికమైన ఓడ. మనదానిలాగ తెర చాపలతో కాకుండా, స్టీమ్ మీద నడుస్తుంది. పైగా దాని మీద ఫిరంగులు గూడ బిగించి ఉన్నాయట. దాని కెప్టెన్ చేపలవేట మిషతో సముద్రాల మీద తిరుగుతూ, ఇతర వ్యాపార నౌకల్ని దోచేస్తుంటాడట. చేతికి దొరికిన మను ష్యుల్ని బంధించి తీసుకువెళ్ళి, బానిస వ్యాపారం చేస్తా డట గూడాను." భోజనాల సమయంలో థామస్ చెప్పాడు నారాయణరావుకి.

థామస్ స్నేహంగానే ఉంటున్నా, అతడంటే మన సులో భయం పోలేదు నారాయణరావుకి. ఏవేళప్పుడు రహస్యంగా వెన్నుపోటు పొడుస్తాడో అని శంకిస్తూనే, తగు జాగ్రత్తలో ఉన్నాడు.

అయితే థామస్ దగ్గర మరో దుర్గుణం ఉందని గ్రహిం చాడు నారాయణరావు. అదే చాడీలు చెప్పే పాడు అల వాటు. కెప్టెన్ ప్రాపకం సంపాదించాలని అతడు మిగతా వారిపై పితూరీలు చెప్పేవాడు.

సామాన్యంగా భోజనాల దగ్గరే నావికులకూ, వేటగా ళ్ళకూ మాట్లాడుకునే తీరిక దొరుకుతుంది. కెప్టెన్ లార్సన్ లేకపోతే మరీ వీలు, కెప్టెన్ దురంతాల్ని గురించి, అతడి సోదరుడు తారసపడితే ఎలా యుద్ధం రేగేదీ చెప్పు కునేవారు ఒక్కోసారి. అందులో ప్రత్యేకించి చెప్పేవాడు జాన్సన్ అనే నావికుడు.

థామస్ తన కేమీ పట్టనట్టుగా, ముభావంగానే ఉంటూ, చెవులు రిక్కించి వినేవాడు. ఆ మధ్యాహ్నానికి ఆ వార్తల్ని కెప్టెన్ లార్సన్‌కి జేరవేసేవాడు.

ఆ రోజు నారాయణరావు, కెప్టెన్ లార్సన్ గదిలో కూర్చుని ఏవో మాట్లాడుతున్నాడు.

మాట్లాడుతూన్నవాడల్లా అకస్మాత్తుగా ఆగిపోయాడు కెప్టెన్. అక్కడ కాపలా కాసే నావికుడ్ని పిలిచి జాన్సన్‌ని పిల్చుకురమ్మన్నాడు.

కొద్ది నిముషాల్లో నావికుడు జాన్సన్ వచ్చాడు అక్కడకు.

వాడ్ని చూస్తూనే కెప్టెన్ లార్సన్ విసురుగా కుర్చీ లోంచి లేచాడు. "ఏరా పంది వెధవా? నాకు ద్రోహం తలపెట్టి నా అన్నతో చేతులు కలపాలని పథకం వేస్తున్నావురా?"

అతడి మాటలకు జాన్సన్ భయపడలేదు. "మేం చేస్తున్న చాకిరీకి నీకు మా మీద అభిమానం గూడ లేదు. పైగా మమ్మల్ని అతి దారుణంగా ట్రీట్ చేస్తున్నావ్! ఒక రకంగా మీ సోదరుడే నయం ఆ లెక్కన! బాగా కష్టించి పని చేసే వాళ్ళని పెంపుడు జంతువుల్లా చూసుకుంటాడు."

"నీలాంటి వెధవ వాగుడు వాగే వాళ్ళను నేను ఏం చేస్తానో తెలుసా?" అంటూ జాన్సన్ ఛాతీపై పిడికిలి బిగించి గుద్దాడు కెప్టెన్ లార్సన్.

జాన్సన్ తనను తాను రక్షించుకునేందుకు పెనుగులాడాడు. ఎదురుతిరిగి పోరాడాడు. కానీ అతడు కెప్టెన్‌కి సరిజోడీ కాడు ఎందులోనూ. అందువల్ల కెప్టెన్ లార్సన్‌దే పైచేయి అయింది.

ఈ హింసాకాండను చూడలేక నారాయణరావు ఆ గదిలోంచి బయటకు వెళ్ళబోయాడు. అతడ్ని కెప్టెన్ ఆటంకపరిచాడు.

"నీవు వెళ్ళటానికి వీల్లేదు. అక్కడే కూర్చుని ఏం

జరుగుతుందో కనిపెట్టు!'' అని వెనక్కి త్రోశాడు కుర్చీలోకి.

నేలమీద పడిపోయిన జాన్సన్‌ని తిరిగి లేవనెత్తి, మళ్ళీ కొట్టాడు కెప్టెన్. జాన్సన్ నోటంట నెత్తురు కక్కాడు. లేవదీసి నిలబెట్టినా, నిల్చునే స్థితిలో లేడు జాన్సన్! తోటకూర కాడలా వాలిపోతున్నాడు.

అతడ్ని నేలమీదనే వుంచి, అతడి డొక్కల్లోనూ, శరీరం మీదా బూటుకాలితో అందిన చోటల్లా తన్నాడు కెప్టెన్! మృత్యువుకి అతి చేరువులోకి నెట్టాక, అప్పుడు వదిలేశాడు జాన్సన్‌ని కెప్టెన్.

అతడ్ని మోసుకెళ్ళి డెక్‌మీద పారేయటానికి హాసన్‌ని పిలిచాడు కెప్టెన్.

హాసన్ జాన్సన్ వంక చూస్తూనే కెప్టెన్ లార్సన్ మీదకు తిరుక్కున్నాడు. ''నీవు మనిషివి కాదు! రాక్షసుడివి! నిండు ప్రాణాల్ని ఎన్నింటిని బలి తీసుకుంటే నీకు సంతృప్తి కలుగుతుంది?''

కెప్టెన్ లార్సన్ అతడ్నేం చేయలేదు. పైగా వికటంగా నవ్వాడు.

''ఒరేయ్! మాటల ప్రతాపం కాదురా! చేతనైతే కత్తి తీసుకో! రా నాతో తలపడు!''

''ఛీ! నీలాంటి వాడితో తలపడి, నా ప్రాణాల్నీ పరువునీ పోగొట్టుకోవడం ఇష్టంలేదు!''

అప్పుడే లోపలకు వచ్చిన థామస్ హాసన్‌ని చూసి ఏదో అన్నాడు. ''అమ్మో! కెప్టెన్ మీదకే తిరగబడ్తున్నారా? ఎంత ధైర్యం?'' అని కెప్టెన్‌కి వత్తాసు పలికాడు. హాసన్‌పై కెప్టెన్‌కి కోపం తెప్పించాలని థామస్ పథకం.

కెప్టెన్ పై కోపంగా ఉన్న హసన్ తన ద్వేషాన్ని థామస్ పైకి మరలించాడు. పిడికిళ్ళు బిగించి థామస్ పై గుద్దుల వర్షం కురిపించాడు.

థామస్ బొడ్లో దాచుకున్న కత్తిని బయటకు లాగాడు. దాన్ని అతడు ఉపయోగించే లోపలే, హసన్ అతడి చేతిని మెలిత్రిప్పాడు. థామస్ చేతిలోని కత్తి క్రింద పడిపోయింది.

"కూరలు తరిగే కత్తితో మనుష్యుల్ని చంపటానికి యత్నించటం నీ తెలివితక్కువదనానికి నిదర్శనం రా!" అంటూ థామస్‌ని కొట్టసాగాడు.

"అయ్యో, బాబో! చంపేస్తున్నాడు! రక్షించండి!" అంటూ కేకలు పెట్టాడు థామస్ నేల వాలిపోయి.

కానీ అతడాసించినట్టుగా కెప్టెన్ లార్సన్ అతడికి సాయం చేయలేదు. పైపెచ్చు అక్కడేదో కొత్త వినోదం జరుగుతున్నట్టుగా ఆనందించసాగాడు.

మరికొందరు నావికులూ చేరారు అక్కడకు. ఎవరూ థామస్‌కి ఆసరా ఇవ్వలేదు.

కెప్టెన్ లార్సన్ చేతిలో జాన్సన్ చావుదెబ్బలు తిన్నట్టుగానే, థామస్ గూడ హసన్ చేతిలో దెబ్బలు తిని స్పృహ కోల్పోయాడు.

"ఆ రోజు నన్ను కత్తితో పొడిచినందుకు ఇది తగిన శాస్తి!" అంటూ హసన్ అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు. థామస్ కొనప్రాణంతో మిగిలాడు.

ఆ నౌకలో జరుగుతున్న సంఘటనలు చూస్తుంటే, మానవుడు అరణ్యంలోని క్రూరమృగానికన్న దారుణంగా మారిపోతున్నాడేమో అనిపించింది హావ్‌కి.

అసలు వీళ్ళల్లో ఇంతటి హింసా ప్రవృత్తి ఎలా ఏర్పడిందా అని ఒక్కోసారి ఆలోచించేవాడు నారాయణ రావు.

వీళ్ళు తల్లిదండ్రులకూ, భార్యాబిడ్డలకూ సుదూరంగా మెలగటమే వాళ్ళలో ఆప్యాయత, ఆదరణ కరువు అవటానికి ఒకరకంగా కారణమేమో!

# 11

రాత్రి బాగా ప్రొద్దుపోయింది. నారాయణరావు డెక్ మీద రెయిల్స్‌కి ఆనుకుని ఏదో ఆలోచిస్తున్నాడు.

అంతలో నీళ్ళలో ఏదో ఆకారం కదలటాన్ని గమనించాడు అతడు, కానీ చీకటిలో అదేమిటో స్పష్టంగా కనుపించలేదు. ఎవరో నౌక ప్రక్కగా నీళ్ళలో ఈదుతున్న సవ్వడి మాత్రమే వస్తోంది. బహుశా ఎవరైనా ప్రమాదవశాత్తు నౌకలోంచి నీళ్ళలోకి పడిపోయారేమో అనుకుంటూ, శబ్దం వస్తున్న వేపుకు తాడు విసిరేశాడు నారాయణరావు.

కొద్ది క్షణాల్లోనే ఆ వ్యక్తి త్రాడు పట్టుకుని నౌక మీదకు అతి సాహసోపేతంగా ఎగబ్రాకాడు. తనచేత్తో రెయిల్స్‌ని గట్టిగా పట్టుకున్నాడు. ఒక్క దూకుతో రెయిల్స్ కివతలకు దూకాడు. అతడి తలనుంచి పాదాల వరకూ నీళ్ళు కారుతున్నయ్. అతడెవరో కాదు! కెప్టెన్ లార్సన్.

"ఏం జరిగింది సార్?" నారాయణరావు ఆశ్చర్యంగా చూశాడు.

"ఏడీ? ఆ వెధవెక్కడ? జాన్సన్ ఎక్కడ?" రంకెలు పెడుతూ, చిందులు త్రొక్కుతూ కెప్టెన్ లార్సన్ నౌక అంతా కలయ వెదికాడు.

డెక్ మీద ముసుగుదన్ని నిద్రపోతున్న వాళ్ళ ముసుగులు లాగి మరీ చూశాడు కెప్టెన్. తర్వాత మెట్లు దిగి నౌక లోపలిభాగానికి వెళ్ళాడు. వంటశాలా, ప్రతి గదీ శోధించి చూశాడు.

జాన్సన్ అయిపు లేదు. కళాసీలు పడుకునే చోటికి వెళ్ళాడు కెప్టెన్ లార్సన్. అక్కడ ఎనిమిది కళాసీల పడకలున్నయ్. నాలుగు ఒక వరసలో, మరి నాలుగు మరో వరసలో, రైల్లో స్లీపర్ బెర్త్సలా వున్నాయి.

కెప్టెన్ ప్రతివాడి దగ్గరకూ వెళ్ళి, వాడు నిజంగా నిద్రపోతున్నదీ లేక దొంగనిద్ర పోతున్నట్టుగా నటిస్తున్నాడా అని తరచి తరచి చూశాడు.

ఒకవేపు రెండు బెడ్లు ఖాళీగా వున్నయ్. పై రెంటిలో ఒకదాంట్లో హసన్ పడుకుని వున్నాడు.

కెప్టెన్ అతడి దగ్గరకు వెళ్ళంగానే, హసన్ పులిలా అరుస్తూ లార్సన్ మీదకు దూకాడు.

అక్కడంతా చీకటిమయం. హసన్ హఠాత్తుగా మీద పడడంతో, కెప్టెన్ లార్సన్ చేతిలోని టార్చిలైట్ క్రింద పడిపోయి, పడకల క్రిందకు దొర్లిపోయింది.

కెప్టెన్ని అనుసరిస్తున్న నారాయణరావుకి తను కలుగ జేసుకోవాలా వద్దా, లార్సన్కి సాయం చేయాలా, లేక వాడి ఖర్మకు వాడ్ని వదిలేసి ఊరుకుందామా అని సందేహించాడు.

ఈ లోపలే మరో వ్యక్తి గూడ వచ్చి హసన్ని కలిశాడు. అతడే జాన్సన్ అని పసిగట్టాడు నారాయణరావు.

నిరాయుధులైన వ్యక్తులు ఒకరితో ఒకరు కసిగా, కక్ష్యతో ఒకరినొకరు చావగొట్టుకోవడం చూస్తుంటేనే, నారాయణరావుకు కడుపులో దేవినట్టయింది.

"ఎవరైనా కత్తి అందుకోండి!" హాసన్ చీకట్లోనే జీరబోయిన కంఠంతో అరిచాడు.

"కత్తి లేకపోతేనేంరా ఫూల్! వాడి తలకాయని రాక్ కేసి చితక్కొట్టు, మెదడు బయటకు వెళ్లుకొచ్చేలా!" జాన్సన్ అరిచాడు.

చీకటిలో, నిశ్శబ్దంగా కెప్టెన్ లార్సన్ అతి లాఘవంగా ఇద్దరు శత్రువులతో పోరాడుతున్నాడు.

ఈ గలాటాకు మరికొందరు నిద్రలేచారు. వారూ హాసన్, జాన్సన్ల పక్షం వహించి, లార్సన్ పని పడుతున్నారు.

లార్సన్ ఒక్కడు. వాళ్ళు ఆరుగురు పోగయ్యారు. అలస్యమయితే తన ప్రాణాలు దక్కవనుకున్నాడు గాబోలు, శత్రువుల్ని ఎలాగో చీల్చుకుని పరుగుదీసాడు లార్సన్.

ఆరుగురు కలసినా అతడ్ని నిరోధించలేకపోయారు.

ఏదో అప్రమత్తతగా ఉండగా, జాన్సన్ అతడ్ని సముద్రంలోకి నెట్టేశాడట, ఎవరూ చూడకుండా.

నీళ్ళలో పడిపోయి, ఈదుతూ, ముందుకుపోతున్న నౌకను చేరుకో గలిగాడు లార్సన్ నాలుగు గంటలు గడిచాక. అటువంటి అలసిన వ్యక్తికి ఆరుగురితో తలపడే శక్తి ఉండటం సాధ్యంకాదు.

మెల్లెక్కుతున్న కెప్టెన్ కాళ్ళు పుచ్చుకుని లాగుతున్నారు. కెప్టెన్ లార్సన్ ఒక్కొక్క తాపుతో ఒకడ్ని వదిలించుకుని ఒక్కో మెట్టు ఎక్కుతున్నాడు.

పై మెట్టు మీద కెక్కేసరికి డెక్ మీద 'పీర్' దగ్గరున్న నావికుడు పరుగెత్తుకుంటూ వచ్చి కెప్టెన్‌కి చేయూతనిచ్చి, పైకి లాగేశాడు.

కెప్టెన్‌తో తలపడిన వారంతా కారిడర్‌లో, చీకట్లో ఉండిపోయారు.

## 12

చీకట్లో మిగిలిపోయిన వారు, వారిలో వారు తిట్టుకో సాగారు.

"మనం ఇంతమందిమి ఉండగా, వాడు ప్రాణాలతో ఎట్లా తప్పించుకు పోగలిగాడు?" హాసన్ బుసలు కొడు తున్నాడు. అతని ఒంటి మీద దుస్తులు చిరిగిపోయాయి. అతడి శరీరం మీద తగిలిన గాయాల్నుంచి రక్తం కారు తోంది.

జాన్సన్ పరిస్థితీ అలాగే వుంది. మరో కళాసీ చెయ్యి, మోచేతి వరకూ విరిగిపోయింది.

"వాడు మనిషయితే గదా? రాక్షసుడు కాబట్టే ఇందర్నీ తప్పించుకుని పోగాడు! పైగా మనలో యెవరి దగ్గరా సమయానికి కత్తిగూడా లేకపోయే! లేకపోతే ఉల్లిపాయని తరిగినట్టుగా, వాడి కంఠాన్ని తెగ్గోసి ఉండే వాళ్ళం."

"ఇంతకీ వాడు మనల్ని గుర్తించి ఉంటాడా?" మరె వరో తన భయాన్ని వ్యక్తం చేశారు.

"చీకట్లో యెలా గుర్తుపట్టగలడు? మనలో యెవరన్నా వాడి పక్షం అయి చెబితే తప్ప!"

"మన ఒంటిమీది గాయాలే మనల్ని ఇట్టే పట్టిస్తయ్!"

"కాకపోతే, ఆ కెప్టెన్‌గాడి మీదకు తలపడినట్టే, మన మీదకు గూడా యెవరో తలపడ్డారని చెబుదాం!' మరో వ్యక్తి నవ్వుతూ బదులిచ్చాడు.

"చాల్లేరా పిరికి వెధవల్లారా! మీ శూరత్వం మాటల్లో గాక చేతల్లో ఏ మాత్రం చూపించినా, వాడీపాటికి

యమపురికి వెళ్ళి ఉండేవాడు! ఇప్పుడు తిప్పలెవరికి? వాడు మిమ్మల్నేం అనడు. దీని కంతకూ కారకులు హాసన్, జాన్సన్ అని వాడెప్పుడో గ్రహించి వుంటాడు. మీ తెలివి తక్కువ తనం మా ఇద్దరి ప్రాణాల మీదకూ తెచ్చి పెట్టింది" జాన్సన్ విసుగ్గా అన్నాడు.

ఎవరో కారిడర్‌లోని ఆరిపోయిన దీపాన్ని వెలిగించారు.

ఆ వెలుతురులో వారగా నిలబడి వాళ్ళ మాటల్ని వింటున్న నారాయణరావు అందరి దృష్టిలో పడ్డాడు.

పైగా అదే సమయంలో డెక్ మెట్లమీద నుంచి కళాసీ ఒకడు అరిచాడు నారాయణరావుని కెప్టెన్ లార్సన్ పిలుస్తున్నట్టుగా.

కారిడర్‌లోని వ్యక్తులందరూ భయం భయంగా నారాయణరావు వంక చూశారు.

"ఇదో వస్తున్నా!" అని అరిచి, అడుగు ముందుకు వేశాడు నారాయణరావు.

"ఆగు! ఎక్కడకు వెళ్ళేది నీవు? నీ నోరు శాశ్వతంగా మూయించేస్తాను!" అంటూ అక్కడున్న వారిలో ఓ కళాసీ అతడి పీక చుట్టూ చేయి వేసి అదుమసాగాడు.

నారాయణరావు పై ప్రాణాలు పైనే పోయాయి. కెప్టెన్ లార్సన్ బలిష్ఠుడూ, మొండి ధైర్యం గలవాడు గనుక ఇంతమందినీ నిలద్రొక్కుకుని పారిపోగలిగాడు. మరి తనో? ఇక్కడున్న ఆరుగురిలో ఏ ఒక్కరినీ తను ఎదుర్కోలేడు.

"ఆగు! అతన్నేం చేయకు! అతనేం చెప్పాలే కెప్టెన్‌తో! వదిలెయ్!" హాసన్ అరిచాడు.

"అవును! అదీ నిజమే! కెప్టెన్ అంటే మన కెంత ఇష్టమో, అతగాడికీ అంతే! అతడ్ని వదిలెయ్యి!" జాన్సన్ గూడ హాసన్‌ని బలపరిచాడు.

బ్రతుకుజీవుడా అనుకుంటూ నారాయణరావు అక్కడ్నుంచి పరుగెత్తుకెళ్ళాడు. కెప్టెన్ రూమ్‌లోకి వెళ్ళాడు.

కెప్టెన్ లార్సన్ చిన్ననిక్కరుతో అర్ధనగ్నంగా ఉన్నాడు. అతడ్ని బెడ్‌మీద పడుకోబెట్టి, అతడి గాయాలకు మందువేసి కట్లుకడుతున్నాడు నౌక డాక్టర్.

"నీవు జాన్సన్ ప్లేస్‌ని తీసుకో మిస్టర్ రావ్! జాన్సన్‌కి బదులుగా 'వీల్' (నౌక స్టీరింగ్ లాంటిది) ని కంట్రోల్ చేసే భారం నీది!" అన్నాడు కెప్టెన్ లార్సన్, నారాయణరావు ముఖంలోకి చూస్తూ.

"ఆ పని నాకు సరిగా రాదుకదా?" నారాయణరావు నసిగాడు.

అయినా కెప్టెన్ వినిపించుకోలేదు.

'వీల్' దగ్గర అసిస్టెంట్‌గా చేస్తున్న కాళీచరణ్ సహాకారంతో త్వరలోనే పని నేర్చుకున్నాడు నారాయణరావు.

"త్వరలోనే నీవు మంచి పనివాడవవుతావ్ రావ్! ఆ తర్వాత నీవు ఏ నౌకలోకి వెళ్ళినా, నెత్తిన పెట్టుకుని పూజించుకుని మరీ నీకు పని ఇస్తారు. ఈ నౌకలోకి వచ్చే నాటికి నీకు ఎందుకూ కొరగాని లొల్లాయి పదాలు రాసుకోవడం మినహా మరేం చేతకాదు. నా శిష్యరికంలో నీవు నీ కాళ్ళమీద నిలబడగలిగే స్తోమతు సంపాదించుకోగలిగావ్! ఇక ఈ అనుభవాన్ని ఏనాటికీ మరిచిపోలేవు!" అని అభినందించాడు కెప్టెన్.

ఈ అనుభవం యెలా వున్నా, ఈ నౌకలో జరిగిన, దారుణాల్ని మాత్రం పది జన్మలకు గూడ మరిచిపోలేను అనుకున్నాడు నారాయణరావు మనసులో.

## 13

తనపై అత్యాచారం జరిగినప్పట్నుంచి, కెప్టెన్ లార్సన్ మరీ రాక్షసంగా ప్రవర్తించసాగాడు. నౌకలో పనిచేసే వారందరి పనీ నానాటికీ దుర్భరం కాసాగింది. లార్సన్ చేతిలో శిక్ష అనుభవించి గాయాలు తినేవారు రోజుకు ఇద్దరు ముగ్గురైనా తేలుతున్నారు. తన క్రింద పనిచేసే వాళ్ళ జీవితాల్ని ఎలా నరకప్రాయంగా చేయాలో కెప్టెన్ లార్సన్‌కి తెలుసు. అందుకై లక్షాతొంభయ్ ఉపాయాలు అతడికి వచ్చును.

హాసన్, జాన్సన్‌లు మాత్రం మళ్ళీ అవకాశం ఎప్పుడు వస్తుందా, ఎప్పుడు మళ్ళీ కెప్టెన్‌ని అంత మొందించుదామా అనే కాచుకుని ఉన్నారు.

ఒకసారి జాన్సన్ కత్తిని విసిరాడు కెప్టెన్ లార్సన్ మీదకు. వెంట్రుకవాసిలో అది గురితప్పి, వెళ్ళి తలుపుకు గుచ్చుకుంది.

కెప్టెన్ వికటంగా నవ్వాడు. తలుపుకు గుచ్చుకున్న కత్తిని లాగి బొడ్లో దోపుకున్నాడు.

జాన్సన్‌ని ఆ క్షణంలోనే చంపకుండా ఎందుకు వదిలేకాడా అని ఆశ్చర్యపోయాడు నారాయణరావు.

ఆ విషయాన్నే తర్వాత అడిగినప్పుడు, కెప్టెన్ లార్సన్ పెద్దగా నవ్వాడు. "ప్రమాదాలు ముంచుకురావడమంటే మంచినీళ్ళప్రాయం నాకు. జాన్సన్‌కి నన్ను చంపాలని ఉంది! వాడితో నేను చెలగాటమాడుతున్నాను. కావా

లంటే నీవూ వాళ్ళతో కలు! నాకేం అభ్యంతరం లేదు!'' అని బదులు చెప్పాడు.

హాసన్, జాన్సన్‌లతో అతడి మాటల్ని చెప్పాడు నారాయణరావు.

ఇద్దరూ పెదవి విరిచారు. ''నీ విందులో ఏమీ కలుగ జేసుకోకు రావ్! నోరు తెరవకుండా జరిగేది చూస్తుండు! ఎప్పుడైనా పనిబడితే ఏదైనా చిన్న సాయం చేద్దువులే!'' అన్నాడు జాన్సన్.

మర్నాడు నౌక ఏదో చిన్న ద్వీపం దగ్గర లంగరు వేసింది.

ఏదో మిషతో కెప్టెన్ లార్సన్, హాసన్‌నీ, జాన్సన్నీ చితకబాదాడు.

''ఒరేయ్ జాన్సన్! నిన్ను కాల్చుకు తింటానురా! నా బాధలు భరించలేక సముద్రంలోకి దూకి ఆత్మహత్య చేసుకోకపోతే నా పేరు లార్సన్ కాదనుకో!'' అన్నాడు పైగా.

ఈ దెబ్బతో వాళ్ళిద్దరూ పారిపోతారనుకున్నాడు నారాయణరావు. కానీ వాళ్ళకాఅవకాన్నివ్వ లేదు లార్సన్. నౌకలో మంచినీళ్ళు నింపుకోవడానికి ఆ ద్వీపంలో లంగ రేసింది ఆ నౌక. కెప్టెన్ లార్సన్ ద్వీపం మీదకు వెళ్ళి వచ్చాడు. తనతోబాటు హాసన్‌నీ, జాన్సన్‌నీ గూడ వెంటబెట్టుకుని వెళ్ళి, మళ్ళీ సురక్షితంగా రావటం నారాయణరావుకే ఆశ్చర్యం వేసింది.

అయితే ఆనాడు కెప్టెన్ లార్సన్‌తో చీకట్లో తలపడిన కళాసీల్లో ఇద్దరు పారిపోవడానికి యత్నించారు. వేటాడే పడవనొకదాన్ని వేసుకుని నౌకనుంచి విడిపోయారు వారిద్దరూ.

నౌకలో ఉన్న వేటగాళ్ళు రైఫిల్స్ తీసుకుని కాల్పులు జరపడంతో, చివరకు వాళ్ళిద్దరూ తిరిగి రాక తప్పలేదు.

మంచినీళ్ళు నింపుకున్నాక నౌక తిరిగి తన పయనాన్ని మొదలుపెట్టింది దక్షిణాభిముఖంగా. ఇక ఇక్కడ్నుంచి సీల్ జంతువులు విరివిగా దొరుకుతాయనీ, మూడు నాలుగు నెలలపాటు వాటిని వేటాడడం జరుగుతుందనీ వివరించాడు కెప్టెన్.

జాన్సన్ ముఖం విచారంతో నిండిపోయింది. "ఆ దుర్మార్గుడు నన్ను త్వరగా చంపేస్తే బాగుండును, ఈ హింసకన్న!" అనుకున్నాడు పైకే.

అతడిపట్ల నారాయణరావుకి సానుభూతి ఎక్కువైంది. నిజంగానే సముద్రజలాలపై తేలియాడే ఈ దుర్భర నరకం కన్న చావే నయమేమో! జీవితానికి విలువ లేదు. ప్రాణాలంటే లక్ష్యం లేదు. అడుగడుగునా దారుణ శిక్షలు. ప్రతి చిన్న తప్పుకు అతి క్రూరంగా హింసాకాండ! అటువంటి జీవితం ఎంత త్వరగా ముగిస్తే అంత మంచిదేమో!

## 14

పగటిపూట నౌకకు కట్టి ఉన్న పడవల్ని నీళ్ళమీదకు దించేవారు. ప్రతి పడవలో తెడ్లువేసే కళాసీలు ఇద్దరు, ఒక నావికుడు, ఇద్దరూ వేటగాళ్ళూ వెడతారు, సీల్ జంతువుల్ని వేటాడేందుకు.

ఇంగ్లీషులో "సీల్" అంటే సముద్రపు కుక్క అని అర్థం. ఇవి ఒక్కొక్కటీ చిన్నసైజు ఏనుగు ప్రమాణంలో ఉంటవి. అటు అత్యుష్ణమూ, ఇటు అతి శీతలమూ కాని కర్కాటక, మకర రేఖా ప్రాంతాల్లో సముద్రాల్లో జీవనం చేస్తాయి. అవి గుంపులుగుంపులుగా మసలుతూ ఉంటయ్. మానవుల్ని చూస్తే వాటికి భయంలేదు.

అందుకే పడవల్లో మనుష్యులు దగ్గరకు వచ్చినా అవి బెదరి పారిపోవు.

అలాంటి సీల్ జంతువుల్ని పాడవాటి తెడ్డుతో బలంగా మోదేసరికి అది స్పృహతప్పి పోతుంది. గాలాలు వేసి దాన్ని పడవలోకి లాక్కుంటారు.

ముంచుకొస్తున్న ప్రమాదాన్ని గుర్తించి అవి పారిపోవటానికి యత్నిస్తే, రైఫిల్‌తో వాటిని కాల్చి చంపుతారు.

సీల్ జంతువు చర్మమూ, రక్తమూ, మాంసమూ వీటికి అనేక దేశాల మార్కెట్లలో మంచి గిరాకీ ఉంది.

వేటాడేందుకు "సీ డెవిల్" నౌకకు చెందిన పడవలు ఆరు ఉన్నయ్. అవి నౌకనుంచీ ఇరవయ్ మైళ్ళ వ్యాసార్థంలో వేటాడి, దొరికిన సీల్ జంతువుల్ని నౌకలోకి చేరుస్తయ్. తిరిగీ మళ్ళీ వేటకు వెడతయ్. సాయంత్రందాకా ఈ వేట సాగుతుంది.

దొరికిన సీల్ జంతువుల దేహాల్ని ఉప్పులో నానవేస్తారు చెడిపోకుండా.

వేట సాగేటప్పుడు నౌక డెక్‌మీద కెప్టెన్ లార్సన్, థామస్, హసన్, నారాయణరావు మాత్రమే మిగిలిపోయేవారు. మిగతా సిబ్బంది అంతా వేటలో పాల్గొనేందుకు వెళ్ళేవారు.

ఆ రోజు యథాప్రకారం ఆరు పడవలూ వేటకు వెళ్ళినయ్. సముద్రం అంతా చాల ప్రశాంతంగా ఉంది.

డెక్ మీద రెయిల్స్ వెంట చుట్టి తిరుగుతున్న లార్సన్ రావ్‌ని పిలిచాడు.

"రావ్! నీవు యాక్టివ్‌గా ఉండాలి! త్వరలో తుఫాను రాబోతూన్నది. నౌక నిలిచిపోయేందుకు వీలుగా తెర చాపల్ని దించేశాం! గాలి వీచటం మొదలుకాకముందే

వాటిని విప్పాలి! లేకపోతే తుఫాను మొదలయాక వాటిని విప్పేందుకు యత్నిస్తే, గాలి ఉధృతానికి తెరచాపలు చిరిగిపోతాయి! తెరచాప స్తంభం త్రాళ్లు తెగిపోయే ప్రమాదం ఉంది!'' అన్నాడు.

తుఫానుకు ముందు ప్రశాంతత నెలకొంటుందనే విషయాన్ని అనేక రచనల్లో చదివిన గుర్తేకానీ ప్రత్యక్షంగా చూసే అవకాశం రాలేదు లోగడ, నారాయణరావుకి.

''తుఫాను మొదలయితే, మన పడవలు ఆ ధాటికి తట్టుకుని నౌకను చేరుకోగలవా?'' రావ్ అడిగాడు.

''మనమే నౌకను త్వరగా అన్ని దిక్కులకూ పరుగెత్తించి పడవల్ని దొరకబుచ్చుకోవాలి!''

కెప్టెన్ లార్సన్ అంచెనా ప్రకారం మరో అరగంటలో తుఫాను ప్రారంభమయింది.

గాలి వేగాన్ని పుంజుకోలేదు ఇంకా. అందుకే నారాయణరావు అతిత్వరగా తెరచాపల్ని విప్పగలిగాడు యీ లోపలే.

''తెరచాప స్తంభంమీదకు ఎక్కు నీవు! అక్కడ్నుంచి చూస్తే మన పడవలు ఎక్కడున్నదీ కనుపిస్తుంది.''

నారాయణరావు గుండె గుభేల్‌మంది. లోగడ తెరచాప స్తంభం ఎక్కడానికి హసన్ చేసిన హడావిడి గుర్తుకు వచ్చింది.

అయినా కెప్టెన్ తనను వదిలేయడు. నాలుగు తన్ని అయినా పైకి ఎక్కిస్తాడు. అందుకే ప్రాణాలకు తెగించి అయినా తన పరువు నిలబెట్టుకోవాలనుకున్నాడు.

చకచక త్రాటినిచ్చెన మీదుగా ఎగబ్రాకి తెరచాప స్తంభంపైకి చేరుకున్నాడు నారాయణరావు. డైభై, ఎనభై

అడుగుల ఎత్తునుంచి చూస్తుంటే కళ్ళు తిరుగుతున్నయ్. పళ్ళు కరుచుకుపోతున్నయ్. గుండె లవిసిపోతున్నయ్.

తెరచాప స్తంభంమీద నిల్చుని ఏ పడవ ఏ దిక్కున ఉన్నదో చెబుతుంటే, నౌకను అటువేపు ఉరికిస్తున్నాడు కెప్టెన్ లార్సన్.

దూరంలో ఉన్న పడవలు చిన్న చుక్కల్లా కనుపిస్తున్నయ్. ప్రాణాల్ని అరచేతిలో పెట్టుకుని, వణుకుతూ డెభై అడుగుల ఎత్తైన తెరచాప స్తంభంమీద నిలబడి ఉన్నాడు నారాయణరావు.

కనుచూపుమేరలో నల్లని చుక్కలా కనబడుతోంది పడవ. అందులో అయిదుగురున్నారు. పడవలోకి ఎగసి పడుతున్న నీళ్ళను బయటికి తోడివేస్తున్నారు అందులోని వాళ్ళు.

ఆరు పడవలూ ఏయే దిక్కుల్లో ఉన్నయ్యో గుర్తుంచుకున్నాక దిగి రమ్మన్నాడు కెప్టెన్.

నారాయణరావు డెక్ మీదకు దిగాడు. తుఫాను భీభత్సంగా తయారయింది. నౌక అటూ ఇటూ, సుడిగుండంలో చిక్కుకున్న జీవిలా అల్లల్లాడుతోంది.

పడవ చేరువలోకి రాంగానే కొంకీలుగల త్రాళ్ళను విసిరేస్తున్నారు. పడవకు కొంకీలు తగిలించంగానే, డెక్ మీది పుల్లీమీదుగా త్రాళ్ళు లాగడంతో పడవ అలవోకగా పైకి వచ్చేస్తుంది.

అలాగే మొదటి పడవను పైకిలాగారు.

మళ్ళీ నౌక మరోవేపుకి మళ్ళింది. రెండో పడవ దొరికింది. మళ్ళీ నౌక గమనం మారింది. మూడో పడవను దొరకబుచ్చుకున్నారు.

పడవలోంచి నౌకలోకి మారిన వాళ్ళంతా 'స్టీరింగ్ వీల్' దగ్గరకు వచ్చి, తమ శక్తినంతా ధారబోసి నౌకను తుఫానునుంచి రక్షించే యత్నం చేస్తున్నారు.

ప్రకృతి భీకరంలో ఆ నౌక ఏ మూలకు? ఆ నౌకను నడిపే మానవులో? సముద్రంలో నీటిబొట్టులాంటి వాళ్ళు! కానీ అంత చిన్న మానవులు ప్రకృతి చేతిలో ఆటబొమ్మలా ఉన్న నౌకను పరిరక్షించటం అత్యద్భుతమైన విషయంగా తోచింది నారాయణరావుకి.

నౌక మరో పడవకోసం అన్వేషించసాగింది. నాలుగో పడవ దృష్టిలోకి వచ్చింది. కానీ అది తిరగబడిపోయింది. అందులోని అయిదుగుర్నీ తుఫాను పొట్టన బెట్టుకుంది.

"మనుష్యులే పోంగా లేనిది పడవ మాత్రం ఎందుకులే, వదిలేయండి! దాన్ని గురించి మనం శ్రమించటం వట్టి దండుగ!" అన్నాడు హసన్.

"ఎంతమాట! ఒక మనుష్యుడు పోతే నుక్కొకరు దొరుకుతారు కానీ పడవపోతే మళ్ళీ పడవ దొరకదు!" అని అరిచాడు కెప్టెన్ లార్సన్.

మనుష్యుల ప్రాణాలకన్న చెక్కతో చేసిన పడవకు అత్యధిక ప్రాధాన్యత నివ్వడం చూసిన నారాయణరావుకి ఒళ్ళు మండిపోయింది.

అదే సమయంలో పెద్ద అల రావటంతో నౌక అల్లల్లాడుతూ అటూ ఇటూ ఉధృతంగా ఊగిపోయింది. ఆ తాకిడిలో, పరాకుగా డెక్ మీద రెయిల్స్‌కి ఆనుకుని నిలబడ్డ నారాయణరావు ఒక్క ఎగురు ఎగిరి వెళ్ళి సముద్రంలో పడ్డాడు.

సమయానికి జాన్సన్ గమనించి త్రాడు విసిరేయటం

వలన అతడు బ్రతకగలిగాడు. లేకపోతే యమసదనానికి ప్రయాణం కట్టి ఉండేవాడే!

నాలుగో పడవ పైకి లాగబడింది.

అప్పటికి తుఫాను ప్రచండంగా వీస్తున్నది. ఇక ఏ మాత్రం అన్వేషణ వీలుపడేట్టుగా లేదు. నౌకను తుఫానులో మునిగిపోకుండా కాపాడాలంటేనే అందరికీ తల ప్రాణం తోకకు వస్తున్నది.

నాలుగో పడవను రక్షించే యత్నంలో ఉండగా 'వీల్'ని కంట్రోల్ చేస్తున్న కాళీచరణ్ గూడా తనలాగే సముద్రంలో పడిపోయాడనీ, అయితే అందరూ పడవను పైకిలాగే పనిలో నిమగ్నులై అతడ్నెవరూ గమనించ లేదనీ తెలిసింది నారాయణరావుకి. అతడికి చాలా విచారం వేసింది.

తుఫాను రాబోతున్నది ముందరే తెలిసినప్పుడు, కెప్టెన్ లార్సన్ ఆ పూటకు వేటను ఆపుచేయించి ఉంటే, ఇంత మంది ప్రాణాలు పోయేవికాదు! అయినా మనుష్యుల ప్రాణాలకన్న జీవంలేని పడవలూ, ప్రాణంపోయిన సీల్ జంతువులే లార్సన్ దృష్టిలో విలువైనవి. నారాయణ రావుకి లార్సన్‌పై కోపం ముంచుకొచ్చింది.

క్యాబిన్‌లో అందరికీ కాఫీ, బ్రాందీ ఇవ్వడింది.

"ఇక అందరూ వెళ్ళి నిద్రపోండి!" లార్సన్ ఆజ్ఞ జారీ చేశాడు.

"ఆపడవ గురించి కాళీచరణ్ ప్రాణాల్ని బలిపెట్టారు!" అన్నాడు నారాయణరావు, కెప్టెన్ వెనుకే వెడుతూ.

"వాడివల్ల మనకు పెద్ద ఉపయోగం లేదులే! ఇక వెళ్ళి పడుకో!" అంటూ పెదవి విరిచాడు కెప్టెన్ లార్సన్.

ఆనాటి వేటలో తుఫాను మూలంగా ఆరుగురు మనుష్యులూ, రెండు పడవలూ నష్టపోయింది "సీ డెవిల్."

పగలంతా శ్రమచేసి ఉండడంవలన నారాయణరావుకి పడుకోంగానే గాఢమైన నిద్రపట్టింది.

# 15

మరునాడుదయానికి తుఫాను తగ్గిపోయింది. ప్రొద్దెక్కాక మిగతా పడవలకోసం అన్వేషణ సాగింది.

ఆ ప్రాంతంలో "సీ డెవిల్"లాగే మరికొన్ని నౌకలు గూడ వచ్చినయ్ సీల్ జంతువుల వేటకు. అవిగూడ రాత్రి తుఫానులో తప్పిపోయిన తమ పడవలకోసం అన్వేషిస్తున్నయ్.

"రాయల్ క్వీన్" అనే మరో నౌకలోకి చేర్చబడినయ్ "సీ డెవిల్" తాలూకు పడవలు రెండు. కెప్టెన్ లార్సన్ ఆ నౌక కెప్టెన్‌తో మాట్లాడి ఆ రెంటినీ విడిపించుకుని వచ్చాడు. ఆ పడవల్లోని కళాసీలూ, నావికులూ, వేటగాళ్ళూ ఇంకో నౌకలోకి ఎక్కి ఆ రాత్రికి తలదాచుకున్నారు. తెల్లారాక తిరిగి 'సీ డెవిల్'ని చేరుకున్నారు.

మళ్ళీ వేట మొదలయింది. నౌక ప్రస్తుతం తిరుగాడే ప్రాంతంలో అప్పుడప్పుడు అక్కడక్కడా పొగమంచు వ్యాపించి ఉంటుంది, విమానం ఆకాశంలో ప్రయాణిస్తుంటే అడ్డువచ్చే మేఘాల్లాగ.

ఆ పొగమంచులో ప్రవేశించినపుడు నౌక అదేపనిగా సైరన్ మ్రోగిస్తూ ఉంటుంది. లేకపోతే మరో నౌక ఈ నౌకను ఢీ కొట్టుకునే ప్రమాదం ఉంది. ఈ పొగమంచులోనే పడవలు ఎక్కువగా తప్పిపోతుంటయ్. వాటిని వెదికి దొరకబుచ్చుకోవాల్సిన బాధ్యత మాత్రం నౌకదే!

థామస్ వంటశాలలో తీరిక లేకుండా పని చేస్తున్నాడు. హాసన్, జాన్సన్‌లు రోజూ కెప్టెన్ చేతిలో చావుదెబ్బలు తింటూనే ఉన్నారు. మిగతా వాళ్ళు కుక్కలకన్న హీనంగా చూడబడుతూ వెట్టి చాకిరీ చేస్తూనే ఉన్నారు.

నారాయణరావుతో మాత్రం కెప్టెన్ లార్సన్ స్నేహంగానూ, అభిమానపాత్రుడుగానూ ఉంటున్నాడు. కానీ అతడ్ని చూస్తుంటే, ఎప్పుడో ఒకప్పుడు అతడ్ని తప్పకుండా చంపాల్సిందే అనిపిస్తోంది నారాయణరావుకి. మళ్ళీ లార్సన్ జీవిత సమరంలో ఎప్పుడూ పోరాడుతూ, చేతికందిన దాన్నలా ధ్వంసం చేస్తూ, మరణాన్నే జయించిన వాడిలా తోస్తుంటాడు.

మరొక రోజు గడిచిపోయింది. నౌక స్టోర్ రూమ్‌లు సీల్ జంతువుల మృతదేహాల్తో నిండిపోయినయ్.

ఆ మర్నాడు అయిదు పడవల్లో మరో పడవ అయిపు లేదు. దాంతో బాటుగా హాసన్, జాన్సన్‌లుగూడ మాయమయారు.

కెప్టెన్ లార్సన్ కోపంతో తాండవం చేస్తున్నాడు. ఆదరాబాదరాగా వచ్చి స్టీరింగ్ వీల్‌ని తనే హ్యాండిల్ చేయసాగాడు. బహుశా ఆ ఇద్దరూ ఏ దిక్కుగా వెళ్ళి ఉంటారో అతడికి తెలుసేమో!

వాళ్ళిద్దరూ పారిపోవటానికి నారాయణరావు సాయపడ్డాడేమో అని కెప్టెన్ లార్సన్‌కి అనుమానం లేకపోలేదు. అందుకే కాబోలు తెరచాప స్తంభం మీదకు మరొకర్ని ఎక్కించాడు.

నౌక ఒక రోజంతా అన్వేషణ జరిపాక, స్తంభంపైన టెలిస్కోప్‌తో చూస్తున్న నావికుడికి ఒక పడవ కంట బడింది.

అందరూ డెక్ రెయిల్స్ దగ్గరకు పరుగెత్తారు. కెప్టెన్ లార్సన్ రైఫిల్ పుచ్చుకుని నిలబడ్డాడు. అతడి ముఖాన చిరునవ్వు వెలిసింది, ఎన్నడూ లేంది. హసన్, జాన్సన్‌లు దొరికారో, వాళ్ళిద్దర్నీ నిలువునా చర్మం వలిపిస్తాడు లార్సన్.

ఆ ఆలోచన రాంగానే నారాయణరావు క్యాబిన్‌లోకి పరుగెత్తి, కెప్టెన్ రూమ్‌లోంచి మరో రైఫిల్ తెచ్చాడు. హసన్, జాన్సన్‌ల వంటిమీద కెప్టెన్ చెయ్యేసిన మరు క్షణంలోనే నారాయణరావు చేతిలో రైఫిల్ పేలటం ఖాయం, కెప్టెన్ తల మూడు పుచ్చెలుగా చీలటం ఖాయం అనుకున్నాడు నారాయణరావు.

అంతలో తెరచాప స్తంభంమీదనుంచి నావికుడు అరిచాడు. "ఆ పడవలో అయిదుగురున్నారోచ్!" అంటూ.

తను అనవసరంగా తొందరపడినందుకు లజ్జపడ్డాడు నారాయణరావు. ఖర్మకాలి తను రైఫిల్‌ని తీసుకురావటం ఎవరూ చూడలేదు. లేకపోతే ఎంత రభస అయేదో!

నౌక క్రమేపీ ఆ పడవను చేరువయింది. ఆ పడవలో వాళ్ళు తెల్లని గుడ్డను ఊపుతూ, తమను పికప్ చేసుకోవలసిందిగా అరుస్తున్నారు.

నౌక పడవకు బాగా దగ్గర కాగానే, నౌకలోని వాళ్ళల్లో కొందరు విరగబడి నవ్వసాగారు, హిస్టీరియా ఫిట్ వచ్చినవాళ్ళలా.

నారాయణరావు అయోమయంగా చూశాడు. "ఎందుకు నవ్వుతున్నారు?" అని ఒక వ్యక్తిని అడిగాడు.

"ఆ పడవలో ఒక యువతి కనుపించటంలా?"

ఈ నౌకలోని వాళ్ళందరికీ ఆడదాని ముఖం చూసి ఎన్నో నెలలయింది. అందుకే గాబోలు ఈ సంతోషం! ఆ

యువతి ఎవరో ఈ దుర్భర, దుస్సహమైన నరకంలోకి అడుగు పెట్టబోతోంది. ఇక్కడి కామాగ్నిజ్వాలల్లో ఆమె దగ్ధమైపోవటం ఖాయం అనుకున్నాడు నారాయణరావు. ఇంతకన్న పడవ బోల్తాకొట్టి ఆమె చనిపోయివుంటే బాగుండేదేమో!

ఆమె డెక్ మీదకు రాంగానే, తనని తినేసేలా చూస్తున్న వ్యక్తుల ఆకలిని గుర్తించనిదానిలా, నిర్మలంగా చిరునవ్వు నవ్వింది.

కెప్టెన్ లార్సన్ ఆమెను నఖశిఖ పర్యంతం చూశాడు ఎగాదిగా. ఆతర్వాత "రావ్! ఈమెను కేబిన్ లోకి తీసుకువెళ్ళి, ఆమెకేం కావాలో చూడు!" అంటూ ఆమె బాధ్యతను నారాయణరావుకి అప్పగించాడు.

ఆతర్వాత అతడు ఆమెతో బాటు వచ్చిన వ్యక్తుల్ని ప్రశ్నించసాగాడు.

ఆ యువతితో దారితీశాడు కేబిన్ లోకి నారాయణ రావు. ఆమె ఎర్రగా వుంది. పుష్టిగా, యవ్వనంలో వుంది. అవివాహితలా తోచింది.

"నాలుగురోజుల తుఫానులో మేం ప్రయాణిస్తున్న నౌక మునిగిపోయింది. అందరూ పడవల్లోకి మారి ప్రాణాలు దక్కించుకున్నాం! రేపుదయానికైనా మన నౌక ఏదైనా హార్బరు చేరుతుంది కదూ?" ఆమె అమాయికంగా అడిగింది.

అటువంటి స్త్రీకి ఈ నౌక పరిస్థితిని తను ఏమని వివరించగలడు? "ఇది ప్యాసింజర్ నౌక అయితే నీవు చెప్పినట్టే జరిగేది. కానీ ఈ కెప్టెన్ నరరూపరాక్షసుడు. ఈ నౌక ప్రత్యక్ష నరకం! మీరు ఇందులోకి రాకుండా

ఉండాల్సింది. ఇక తీరా వచ్చేశారు గనుక ఎటువంటి దుర్భరపరిస్థితికైనా తల ఒగ్గేందుకు సిద్ధపడడం మంచిది!" అన్నాడు నారాయణరావు.

"మీరనేదేమిటో నాకు బోధపడడం లేదు!" అంది ఆమె, కళ్ళు పెద్దవిచేసి చూస్తూ.

"నేనన్న మాటల్ని మరోసారి మననం చేసుకోండి! అంతకన్న నేనింకేం చెప్పలేను."

ఆమె మళ్ళీ మాట్లాడలేదు. మౌనంగా అతడ్ని కేబిన్ రూమ్‌లోకి అనుసరించింది.

ఆ యువతి వేడినీళ్ళతో స్నానం చేసింది. ఆకలిమీద ఉందేమో ఆవురావురుమంటూ భోజనం చేసింది. ఆ తర్వాత బెడ్ మీద వాలిపోయి క్షణాల్లోనే గురక పెట్ట సాగింది.

ఆమె నేదో అడుగుదామనుకుంటూండగానే, డెక్ మీద కలకలం వినిపించింది. గది తలుపు దగ్గరకులాగి డెక్ మీదకు పరుగెత్తాడు నారాయణరావు.

# 16

నారాయణరావు డెక్ మీదకు చేరుకున్నాడు. అందరూ గుమిగూడినవేపుకు తనూ వెళ్ళాడు. దూరంగా మరో పడవ కనుపిస్తున్నది. అందులో తెడ్లు వేస్తూ, పడవను నడుపుతూ ఇద్దరు వ్యక్తులు కనుపిస్తున్నారు.

"సందేహం లేదు! వాళ్ళిద్దరూ హాసన్, జాన్సన్ లే!" అన్నారెవరో!

"నేను చెప్పలా? మనల్ని తప్పించుకుని ఆట్టే దూరం పోలేరని!" మరొకరు వంత పాడారు.

"వాళ్ళు దొరక్కుండాపోయినా బాగుండేది! లేదా పడవ బోల్తాపడి చనిపోయినా బాగుండేది, మళ్ళీ ఈ

రాక్షసుడి చేతిలో చిక్కేకన్న!'' పెద్దగానే అనేశాడు నారాయణరావు.

అంతలో అతని భుజాన ఎవరిదో చెయ్యి పడింది. గిరుక్కున వెనుదిరిగి చూశాడు నారాయణరావు.

కెప్టెన్ లార్సన్ చిరునవ్వుతూ నిలబడి వున్నాడు. అతడి చేతిలో రైఫిల్ వుంది ఇంకా.

''రావ్! ఆమె పేరూ, ఊరూ కనుక్కున్నావా?''

''లేదు! ఆమె చాలా అలిసిపోయినట్టుగా కనుపించింది. భోజనం చేయటం ముగిస్తూనే నిద్ర కుపక్రమించింది. మొన్న తుఫానులో తమ నౌక మునిగిపోయిందని మాత్రం చెప్పింది. అంతే!''

''వాళ్ళ వివరాలన్నీ నేను కనుక్కున్నానులే ఆ మగవాళ్ళనుంచి. వాళ్ళు జపాన్ వెళ్తున్నారట వరల్డ్ ఇండస్ట్రియల్ ఎగ్జిబిషన్‌కి. వెడుతూ ఈ ప్రమాదానికి గురైనారట. అయితే ఆమె గురించిన వివరాలేం అడగలేదన్నమాట?'' అతడు చిలిపిగా నవ్వుతున్నాడు.

ఆమె గురించి కెప్టెన్ ఆ విధంగా అడగటం అసహ్యమనిపించింది నారాయణరావుకి.

''ఇంతకీ ఆ హసన్‌నీ, జాన్సన్‌నీ ఏం చేయదల్చుకున్నారు?'' మాట మారుస్తూ అడిగాడు.

''ఇంకా ఏదీ నిర్ణయించలేదు. ఇప్పుడు మనకు దొరికిన నలుగురు మనుష్యులతో మనం నష్టం మూడొంతులు పూడినట్టే! ఇంకా వెతికితే మరో ఇద్దరు దొరక్కపోరు!''

''ఈ కొత్తవాళ్ళనన్నా మనుష్యులుగా ట్రీట్ చెయ్యి మిస్టర్ లార్సన్! అలా కాకుండా వాళ్ళనుగూడా క్రూరంగా చూశావో, నిన్ను నా చేతులమీదుగాకే

చంపుతాను!" ఆవేశంగా పలికాడు నారాయణరావు.

కెప్టెన్ లార్సన్ ఒక్క క్షణం అతడివంక ఎగాదిగా చూశాడు. ఆ తర్వాత ఫక్కున నవ్వేశాడు. "నిన్ను చూస్తుంటే ఇప్పుడు నాకు పట్టరాని ఆనందం వేస్తున్నది. పిల్లిలా చేరినవాడివి పులిలా తయారయావు. ఇప్పుడు నీవు మొనగాడి వనిపించుకున్నావ్! ఈ నౌకలో ఎవరి పేరు చెబితే జనం మంచినీళ్ళుగూడ ముట్టకుండా గడగడలాడి పోతారో, ఆ వ్యక్తినే ముఖాముఖి ఎదుటపడి చంపుతానని బెదిరించగల ధైర్యవంతుడివయావ్! శెభాష్!"

"అది సరే! ఇంతకీ హసన్‌కీ, జాన్సన్‌కీ ఏం శిక్ష వేయబోతున్నావో చెప్పు. డెక్‌మీదకు వచ్చాక వాళ్ళ మీద నీవు చేయి వెయ్యటానికి వీల్లేదు తెలిసిందా!" నారాయణరావు ఇంకా గంభీరంగానే కనుపించాడు.

"మిస్టర్ రావ్! నా వాగ్దానంమీద నీకు నమ్మకం వుందా?"

"లేకేం? ఉంది!"

"అయితే నేను హసన్, జాన్సన్‌లమీద చెయ్యి వెయ్యను. సరా? మరి నీవు నన్ను చంపటానికి యత్నించనని ప్రమాణం చెయ్యి!"

అతి కర్కోటకుడు అయిన కెప్టెన్ లార్సన్ ఈ విధంగా, ఇంత తేలికగా తనకు లొంగిపోతాడని నారాయణరావు కలలోగూడ ఊహించలేదు. హసన్, జాన్సన్ల మీద లార్సన్ చెయ్యి వేయకుండా వుంటే తను యేం చేయటానికైనా సంసిద్ధుడే.

అందుకే వెంటనే ఒప్పుకున్నాడు నారాయణరావు, ఇద్దరూ కరచాలనం చేసుకున్నారు.

# 17

బైనాక్యులర్స్ తీసుకుని పడవలోకి చూశాడు కెప్టెన్. అందులో ఆహారపదార్థాలు లేవు. నీటి పీపా మాత్రమే వుంది. రెండురోజుల్నుంచి ఆహారం లేక వాళ్ళ ముఖాలు పీక్కుపోయినయ్. వాళ్ళవంక చూసి మందహాసం చేశాడు కెప్టెన్ లార్సన్.

నౌక నిదానంగా పోతూనే వుంది. క్షణాల్లో పడవ చేరువయింది. డెక్ మీదనుంచి అందరూ మౌనంగా పరీక్షిస్తున్నారు. అందరి మనస్సులోనూ భయం, ఆత్రుత, ఆందోళనా గూడుకట్టుకుని వున్నయ్. తీరా వాళ్ళు డెక్ మీదకు వచ్చాక ఎన్ని చిత్రహింసల పాలవాలో అని ఆలోచిస్తున్నారు.

నౌక పడవ ప్రక్కకు వచ్చింది. నౌకను ఆపి, త్రాళ్ళు దింపి పడవను పైకి లాక్కోవాలి. అయితే కెప్టెన్ లార్సన్ నౌకను ఆపేందుకు ఆజ్ఞ జారీ చేయలేదు. పైపెచ్చు క్యాబిన్ రూమ్‌లోకి నడిచి, నౌక వేగాన్ని హెచ్చించమన్నాడు.

ప్రాణాలరచేతిలో పెట్టుకుని ఆశగా చూస్తున్న హాసన్, జాన్సన్‌ల పడవను దాటి నౌక ముందుకు వెళ్ళిపోతోంది. సినిమా సీన్‌లోలాగ పడవ క్రమేపీ దూరమవసాగింది. కెప్టెన్ లార్సన్ వికటంగా పెద్దగా నవ్వాడు. ఆ నవ్వు అల్సేషియన్ కుక్క మొరిగినట్టుగా వుంది.

పడవకూ, నౌకకూ రెండుమైళ్ళ ఎడం ఏర్పడింది. లార్సన్ అప్పుడు నౌకను ఆపాడు. పడవలో వ్యక్తులకు "రండి! రండి!" అంటూ చెయ్యి ఊపుతూ సంజ్ఞ చేశాడు కెప్టెన్ లార్సన్.

ఎదురుగాలిలో రెక్కలు ముక్కలయ్యేలా ఆశగా తెడ్లు వేస్తూ నౌకకి చేరువయ్యారు హాసన్, జాన్సన్‌లు తమ పడవలో.

"మీకు నిజంగా నౌకలోకి రావాలని వుందా? నాపై మళ్ళీ హత్యాప్రయత్నం చేయరు కదా?" లార్సన్ పెద్దగా అరిచాడు. "అలా అయితే మా నౌకను వెంబడించి రండి!" అంటూ మళ్ళీ నౌకను బయలుదేరదీశాడు.

నౌకకూ, పడవకూ దూరం మళ్ళీ ఎక్కువై పోసాగింది. ప్రాణాలరచేతులో పెట్టుకున్న ఆ వ్యక్తులతో కెప్టెన్ లార్సన్ చెలగాట మాడుతున్నాడు. బహుశా వాళ్ళు తనపై అత్యాచారం జరిపినందుకు ఈ రకంగా శిక్షిస్తున్నాడేమో లార్సన్, వాళ్ళకు బుద్ధివచ్చేలా చేయటానికి.

హాసన్, జాన్సన్‌లు కూర్చున్న పడవ సీ డెవిల్‌ని వెంబడిస్తూనే వుంది. వాళ్ళ ప్రాణాలు ఆకలిమంటతో గిలగిల కొట్టుకుంటున్నవి.

"ప్రాణభయం చూశావా ఎంత పని చేయిస్తున్నదో! ఈ నరకంలోంచి పారిపోవాలని యత్నించారు. ఎటు చూసినా వేలమైళ్ళకొలదీ సముద్రమే కానీ, భూభాగం చేరలేమని తెలిశాక వాళ్ళు మళ్ళీ ఈ కూపంలోకి రావాలనే యత్నిస్తున్నారు" థామస్ నారాయణరావు చెవిలో గొణిగాడు.

"కెప్టెన్ వాళ్ళకు బుద్ధివచ్చేలా చేయాలని అలా ఏడిపిస్తున్నాడు. చివరకు వాళ్ళని నౌకలోకి తీసుకుంటాడులే!" నారాయణరావు మెల్లిగా పలికాడు.

"అలానే నమ్ముకుని కూర్చోండి!" థామస్ పెదవి విరిచాడు.

నౌక పడవనుంచి దాదాపు అయిదారుమైళ్ళు వచ్చే శాక నౌకను ఆపుచేశాడు లార్సన్. అందరూ డెక్ మీద చేరి పడవ గమనాన్నే తిలకిస్తున్నారు ఆసక్తిగా. పడవ అంతకంతకూ దగ్గరకు వచ్చేస్తోంది. ఆ అయిదుమైళ్ళ దూరాన్ని అధిగమించేందుకు పడవలో వాళ్ళకు గంటన్నర టైమ్ పట్టింది.

పడవ చేరువలోకి రాగానే నౌక మళ్ళీ వేగాన్ని పుంజుకుంది. ప్రాణాలకు తెగించి, ఓపికనంతా కూడగట్టు కుని హసన్, జాన్సన్‌లు నాలుగు గంటలసేపు 'సీ డెవిల్' నౌకను వెంబడించారు తమ పడవలో.

వర్షం ప్రారంభమయింది. కప్పుకునేందుకు ఏ ఆధారమూ లేని పడవలో వ్యక్తులు ఏమైపోతారో అని అందరూ ఆతృత పడసాగారు.

వర్షంలో పడవ కనబడడంలేదు. అయినా నౌక తన గమనాన్ని సాగించింది. వాన వెలిసేసరికి వాళ్ళ పడవ జాడే లేదు. బహుశా హసన్, జాన్సన్‌ల కష్టాలు తీరిపోయి వుండాలి, వాళ్ళు పరలోకానికి ప్రయాణం కట్టి వుండాలి.

జరిగిన దారుణాన్ని ఆలోచిస్తూ ఎవరికి వారే మౌనంగా వుండిపోయారు.

నౌకలోకి కొత్తగా వచ్చిన వ్యక్తుల్లో ఒకడు, 'భగవంతుడా! ఎలాంటి నౌకలోకి వచ్చి పడ్డాంరా!' అనుకున్నాడు.

నారాయణరావు కోపంగా స్టీరింగ్ వీల్ ముందున్న కెప్టెన్ లార్సన్ దగ్గరకు నడిచాడు.

"వాళ్ళమీద చెయ్యి వేయనని నాకు ప్రమాణం చేసింది ఇందుకేనా?" అనడిగాడు కెప్టెన్‌ని.

"అవును! నేను వాళ్ళని ఏమన్నా చేశానా? వాళ్ళ ఖర్మకు వాళ్ళే పోయారు" కెప్టెన్ లార్సన్ పెద్దగా నవ్వాడు. "నా మాట నిలబెట్టుకున్నానా లేదా? నేను వాళ్ళమీద చేయి చేసుకోలేదు!"

ఈ పథకాన్ని ముందరే ఆలోచించుకునే, లార్సన్ తనకు శుష్కవాగ్దానం చేశాడన్నమాట! నారాయణ రావుకి కోపంతో మాట పెగల్లేదు.

# 18

నౌకలోకి కొత్తగా వచ్చిన వ్యక్తులుగూడ కళాసీలుగా మార్చబడ్డారు. ముందు వాళ్ళు అభ్యంతరం తెలిపినా, చివరకు అంగీకరించక తప్పలేదు. హసన్, జాన్సన్‌లకు అతడు విధించిన శిక్షను కళ్ళారా చూశాక, వాళ్ళకు కెప్టెన్ లార్సన్ అంటే ఎనలేని భయం పట్టుకుంది.

నారాయణరావు ఆ యువతి గురించి వివరాలు కను క్కున్నాడు. ఆమెగూడ భారతీయ వనితే! ఆమె పేరు అనితా ఛటర్జీ! కలకత్తాలో నివాసం! జపాన్ వెడుతోంది ఎగ్జిబిషన్ చూడ్డానికి. ఆమె తండ్రి లక్షాధికారి. పైపెచ్చు అనితా ఛటర్జీ నవలా రచయిత్రట. ఇంగ్లీషులో ఆమె వ్రాసినవి రెండు నవలలు ప్రచురితమైనవని చెప్పింది.

"ఈ నౌకలో మీరు ఉండటం క్షేమం కాదు. అదను చూసుకుని పారిపోవాలి మనం!" అన్నాడు నారాయణ రావు.

"అవును! ఆ కెప్టెన్ విపరీతచేష్టల్ని చూస్తుంటే నాకు గుండె బేజారయిపోతున్నది!" అంది అనితా.

"మీరేం భయపడకండి. మీ ప్రాణానికి నా ప్రాణం అడ్డువేస్తాను సరా?"

అనితా ఛటర్జీ కృతజ్ఞతగా చూసింది. ఆ చూపుల్తో నారాయణరావు తను ఆమెకోసం సప్తసముద్రాల్నయినా దాటాలనన్నంత ధైర్యం పుంజుకున్నాడు.

కెప్టెన్ లార్సన్‌నుంచి అనితకు కబురు వచ్చింది, "కెప్టెన్ పిలుస్తున్నాడు!"

అనిత నారాయణరావు వంక చూసింది. "ఏం భయం లేదు. వెళ్ళి రండి!" అన్నట్టుగా నారాయణరావు కళ్ళతోనే సైగచేశాడు.

అనిత భయపడుతూనే కెప్టెన్ గదిలోకి వెళ్ళింది. ఆమె వెనకనే నారాయణరావూ వెళ్ళాడు. అయితే అతడు గదిదగ్గరకు చేరేసరికి, గదితలుపు లోపల గడియ వేయబడింది.

నారాయణరావు మోకాళ్ళ మీదుగా వంగి కూర్చుని, కీ హోల్ లోంచి లోపల జరుగుతున్నదాన్ని చూడటానికి యత్నించాడు.

కెప్టెన్ లార్సన్ అనితను చిరునవ్వుతో ఆహ్వానించాడు. కాఫీ, బ్రెడ్ ఆఫర్ చేశాడు. అనిత వాటిని నిరాకరించింది.

ఆ తర్వాత లార్సన్ ఆమె కూర్చున్నచోటికి లేచి వచ్చాడు. ఆమె గడ్డంక్రింద వ్రేలు పెట్టి ముఖాన్ని పైకెత్తాడు. ఆమె పెదవులపై చుంబించబోయాడు. అనిత ముఖం త్రిప్పుకుంది.

ఈ దఫా లార్సన్ రెండుచేతుల్తో ఆమె చెక్కిళ్ళమీద నొక్కి, ఆమె ముఖంలో ముఖం పెట్టాడు.

అనిత అతడ్ని నెట్టింది. లార్సన్ వెనక్కు పడిపోయాడు. అతడిలో మృగతృష్ణ తీవ్రరూపానికి వచ్చింది. అనితను బలవంతంగా తన కాగిట్లో బంధించాడు.

బయటనుంచి చూస్తున్న నారాయణరావు కోపంతో తన ఒళ్ళే తను మరిచిపోయాడు. తలుపుమీద దబదబ బాదాడు.

అనిత పరుగెత్తుకుంటూ వచ్చి తలుపు తెరిచింది రొప్పుకుంటూ. నారాయణరావు గుహలో ప్రవేసించే పులిలా ఠీవిగా అడుగులు వేసుకుంటూ లార్సన్ నిల్చున్న చోటికి వెళ్ళాడు. అతడి చేతిలో పదునైన కత్తి ఉంది.

ఆ కత్తిని లార్సన్ టేబుల్ మీద గుచ్చాడు.

"మిస్టర్ లార్సన్! ఆమె నీ పశుకామానికి బలి అయేందుకు వీల్లేదు, నా కంఠంలో ఊపిరి ఉండగా!"

కెప్టెన్ లార్సన్ అతడివంక నిప్పులు గ్రక్కుతూ చూశాడు.

"అబ్బ! పెద్ద మొగాడు వచ్చాడు! ఈ బింకం ఎన్నాళ్లో నేనూ చూస్తాను" అన్నాడు.

అనితను వెంటబెట్టుకుని నారాయణరావు బయటకు వచ్చేశాడు కెప్టెన్ గదినుంచి.

కెప్టెన్ లార్సన్ కోపోద్రిక్తుడైనాడు. అయితే అతని కోపాన్ని ఎవరో ఒకరిమీద చూపించాలి. ఆ రోజు థామస్‌కు ఆయువు మూడింది.

భోజనాల సమయంలో లార్సన్ ఎగాదిగా చూశాడు థామస్ వంక.

"నీకు లోగడే ఆఖరు హెచ్చరిక చేశాను వంట గురించి. నీ డ్రెస్ గూడా తెల్లగా ఉండాలని చెప్పానా లేదా? నా మాటల్ని ఖాతరు చెయ్యనందుకు నీవు తగిన శిక్షని అనుభవిస్తావ్!"

థామస్ ముఖం మంచులా తెల్లబారిపోయింది. మరుక్షణమే అతడు అక్కడ్నుంచి పరుగు లంకించుకున్నాడు.

కెప్టెన్ లార్సన్ నలుగురు కళాసీల్ని పురమాయించాడు థామస్‌ని పట్టుకు రేందుకు. థామస్ ఇంజన్ రూమ్ చుట్టూ, క్యాబిన్ గదులూ అన్నీ పిచ్చికుక్కలా పరుగెత్తసాగాడు. కళాసీలు అతడి వెంటబడ్డారు తోడేళ్ళలాగ.

మిగతా వాళ్ళు ఈ సరికొత్త వినోదాన్ని చూసేందుకు వేగిర పడుతున్నారు.

థామస్ పట్టుబడ్డాడు. అతడి నోటంట రక్తం కారుతోంది. గుండెలు పగిలేలా రొప్పుతున్నాడు అతడు.

కెప్టెన్ లార్సన్ వాడి నడుముకు త్రాడుకట్టాడు. ఆ త్రాటి రెండో కొసను డెక్ మీద స్తంభానికి కట్టారు. ఇద్దరు కళాసీలు థామస్‌ని ఎత్తి సముద్రంలోకి విసిరేశారు.

థామస్ పిచ్చిగా అరుస్తున్నాడు ప్రాణభయంతో.

అయితే అతడి అరుపుల్ని ఎవరూ లక్ష్యపెట్టలేదు. పైపెచ్చు డెక్ మీద చేరిన కళాసీలూ, వేటగాళ్ళూ, నావికులూ అందరూ పొట్టచెక్కలయేలా నవ్వుతూ ఈ వినోదాన్ని ఆనందిస్తున్నారు.

అనిత, నారాయణరావు, కొత్తగా వచ్చిన నలుగురు వ్యక్తులు మాత్రం విచారంతో గమనిస్తున్నారు జరుగుతున్న దారుణాన్ని.

సముద్రం ప్రశాంతంగా ఉంది. కానీ వానవల్ల, నీళ్ళు రక్తాన్ని గడ్డకట్టించేటంత చల్లగా ఉన్నాయ్.

యాభై అరవై అడుగుల పొడవుగల త్రాడు నౌక నుంచి సముద్రంలోకి వ్రేలాడుతోంది. ఆ త్రాడు చివర నీళ్ళలో మునుగుతూ, తేలుతూ నౌకచేత లాగబడుతున్నాడు థామస్.

థామస్ పెద్దగా అరిచాడు. "అయ్యో! షార్క్ చేప వచ్చేస్తోంది! నన్ను రక్షించండి!"

"కొంగ వెధవ! అలా అరిచి దొంగ ఎత్తు వేస్తున్నాడు, పైకి తీస్తారని!" డెక్ మీద ఎవరో అన్నారు.

దూరంగా నీళ్ళు ఎవరో విరజిమ్ముతూన్నట్టుగా పైకి లేస్తున్నయ్.

"నిజంగానే షార్క్! త్వరగా త్రాడులాగండి! త్రాడు పైకిలాగండి!" కెప్టెన్ లార్సన్ గొంతు డెక్ అంతటా ప్రతిధ్వనించింది.

పదిమంది కలసి త్రాడుని జరజర పైకిలాగటం మొదలెట్టారు.

అరుస్తూ, నీళ్ళల్లో కల్లోలం సృష్టిస్తున్న థామస్ షార్క్ చూపుల్లో పడ్డాడు. షార్క్ ఇంకా వేగంగా అతడివైపుకు వచ్చేస్తోంది. అతడు లాగబడే వేగంకన్నా షార్క్ ప్రయాణ వేగమే ఎక్కువగా ఉంది.

అటు థామస్, ఇటు షార్క్ ఇద్దరూ ఒకేసారి నౌక దగ్గరకు చేరారు. కెప్టెన్ లార్సన్ తన బలాన్నంతా వినియోగించి త్రాడుని లాగాడు.

థామస్ నీళ్ళలోంచి పైకి లేచాడు. అంతకంతకూ పైకి చేరుతున్నాడు.

తన కంటబడిన ఆహారం నోటికందకుండా పోతున్నందుకు షార్క్‌కి ఆగ్రహం కలిగింది కాబోలు ఒక్క ఎగురు ఎగిరింది నీళ్ళలోంచి.

నోరు తెరిచి మళ్ళీ మూసుకుంది! తిరిగీ నీళ్ళలో పడిపోయింది షార్క్.

థామస్ పిచ్చిగా అరుస్తున్నాడు. అతడు డెక్ మీదకు లాగబడ్డాడు. అతడి శరీరంనుంచి నీళ్ళు కారుతున్నయ్. అతడి రెండు కాళ్ళూ తొడలవరకూ తెగిపోయాయి. ఆ క్రింది భాగం షార్క్ చేప నోట్లో ఉండిపోయింది. తెగి

పోయిన కాళ్ళ మొండేలనుంచి రక్తం స్రవిస్తోంది. డెక్ నేలమీద రక్తపు మడుగు ఏర్పడింది.

ఇదంతా చూస్తున్న అనిత స్పృహతప్పి పడిపోయింది.

"నా పథకంలో షార్క్ లేదు. థామస్ అదృష్టం బాగోలేదు. అందుకే అకస్మాత్తుగా రంగంలోకి షార్క్ వచ్చింది. థామస్‌ను తిరిగి సముద్రంలో పారేయండి" అని మామూలుగా, అసలేం జరగనంత సాధారణంగా అన్నాడు కెప్టెన్ లార్సన్.

## 19

"సీ డెవిల్" తిరుగాడుతున్న సముద్రప్రాంతం చాలా ప్రమాదకరమైన ప్రదేశం. అక్కడ సీల్ జంతువులు ఎక్కువగా దొరికేమాట నిజమే! కానీ సముద్రం భీభత్సంగానూ ఉంటుంది. రోజుల తరబడి మేఘావృతమై, సూర్యుడు కనబడడు.

కెప్టెన్ లార్సన్ భోజనం చేస్తుండంగా కళాసీ ఒకడు పరుగెత్తుకొచ్చాడు.

"మనల్ని మరో స్టీమర్ వెంబడిస్తోంది! బహుశా అది మీ సోదరుడిదై ఉండొచ్చనుకుంటాను!" అని చెప్పాడు.

తింటున్న భోజనం వదిలేసి కెప్టెన్ లార్సన్ డెక్ మీదకు పరుగెత్తాడు.

'సీ హాక్' స్టీమర్, స్టీమ్‌తో నడిచే అధునాతన నౌక ఆ ప్రాంతంలోకి వచ్చింది. దాని కెప్టెన్ ధాటికి మరెవరూ నిలవలేరు. సీహాక్ అక్కడ 'సీల్స్'ని వేటాడుతుంటే, మరో నౌక ఆ ప్రాంతంలో తిరుగాడలేదు.

'సీహాక్'కి పధ్నాలుగు మోటార్ బోట్లున్నయ్. కెప్టెన్ లార్సన్‌వి ఆరు పడవలు.

ఆ రోజు 'సీ డెవిల్' తాలూకు పడవలకి ఒక్క జంతువుకూడా దొరకలేదు. ఆ పడవలన్నీ ఖాళీగా తిరిగి వచ్చినయ్. అందులో వేటగాళ్ళు 'సీహాక్'ని తెగ తిట్టిపోస్తున్నారు.

సముద్రంమీద ఒకవైపున దట్టమైన పొగమంచు పట్టింది. ఆ పొగమబ్బు ఇంకా ఉత్తరంగా వ్యాపిస్తోంది.

ఆ పొగమంచులో 'సీహాక్' తాలూకు పడవలు దారి కనపడక సీడెవిల్ తిరుగుతున్న ప్రాంతంలోకి వచ్చాయి.

కెప్టెన్ లార్సన్ పర్యవేక్షణ క్రింద వేటగాళ్ళు అవతలి నౌక పడవను పట్టి తెచ్చారు. అందులోని ముగ్గురూ కెప్టెన్ లార్సన్ చేతివాటం రుచిచూచాక అక్కడే ఉండిపోవటానికి అంగీకరించారు.

ఇనుమడించిన ఉత్సాహంతో లార్సన్ మరో పడవను ఎటాక్ చేశాడు. అదీ తేలికగానే స్వాధీనమైంది. మూడో పడవలో వాళ్ళదగ్గర రైఫిల్స్ ఉన్నయ్.

ఇరుపక్షాలకూ కాల్పులు సంభవించినయ్. ఆ కాల్పుల్లో 'సీహాక్' తాలూకు ముగ్గురు వ్యక్తులూ మరణించారు.

కాల్పులు విని సీహాక్ తాలూకు పడవలన్నీ ఒకచోట చేరినయ్. విడివిడిగా వెళ్ళిపోతే శత్రువు తేలిగ్గా పట్టుకో గలడని, అవన్నీ కలిసి కట్టుగా యుద్ధానికి సిద్ధమైనయ్.

వాటికి అండగా 'సీహాక్' నౌకగూడ వచ్చి చేరింది అక్కడకు. అందులోంచి ఫిరంగులు ప్రేలినయ్. అయినా 'సీడెవిల్' వాటి రేంజ్ కి అవతలే ఉండడంవల్ల లక్ష్యాని తగలేదు అవి.

కెప్టెన్ లార్సన్ స్టీరింగ్ వీల్ గిరగిర త్రిప్పేశాడు నౌక గమనాన్ని మళ్ళించి, పొగమంచు తెరలోకి పోనిచ్చాడు నౌకను.

అరగంట ప్రయాణించి పొగమంచులోంచి బయట పడింది నౌక.

సముద్రం ప్రశాంతంగా ఉంది. ఆకాశంలో సూర్యుడు వెలుగుతున్నాడు. ప్రస్తుతానికి 'సీహాక్' ఎదుర్కొనే ప్రమాదం తప్పిపోయినట్టే.

"మనం దొరక్కుండా తప్పించుకున్నామని, నా సోదరుడు శాపనార్థాలు పెడుతుంటాడు ఈపాటికి!" అంటూ తెగనవ్వాడు కెప్టెన్.

# 20

తన తాత్కాలిక విజయాన్ని సెలిబ్రేట్ చేసుకోవటానికి కెప్టెన్ లార్సన్ నౌకలో అందరికీ బ్రాందీ, విస్కీ, రమ్ పానీయాల్ని సరఫరా చేశాడు. తనుకూడా పీకలదాకా తాగి తన గదిలో బెడ్ మీద వాలిపోయాడు.

సామాన్యంగా లార్సన్ అంత ఎక్కువగా తాగంగా నారాయణరావు చూడలేదు. ఇక కనీసం రెండుగంటల సేపన్నా లార్సన్ మత్తులో ఉంటాడు. తను ఇక్కడ్నుంచి తప్పించుకోవటానికి ఇదే అనువైన సమయం.

నారాయణరావు గబగబ వెళ్ళి అనితను లేపాడు. "మనం ఇక్కడ్నుంచి పారిపోవాలి! త్వరగా రా!" అని తొందరచేశాడు.

నౌకలో చాలా భాగం తాగి ఎక్కడివారక్కడ పడిపోయారు. స్టీరింగ్ వీల్ దగ్గర మాత్రం ముగ్గురు కళాసీలు కనిపెట్టుకుని ఉన్నారు.

ఒక పడవలోకి దుప్పట్లూ, టార్పాలిన్, చలికోట్లు, బోపీల్ని, నీరూ, ఆహారం టిన్నుల్నీ చేర్చాడు. కేబిన్ రూమ్‌లోకి వెళ్ళి రైఫిల్ ఒకటి, తూటాల బెల్ట్‌నీ తీసుకొచ్చాడు.

ఓడ వెనుకభాగంలోంచి, కళాసీల కంటబడకుండా పడవను నీళ్ళల్లోకి దించాడు. అనితను తీసుకుని దాంట్లోకి దిగజారాడు.

కత్తితీసి పడవకు కట్టిఉన్న నౌక త్రాళ్ళను కోసి వేశాడు నారాయణరావు.

నౌకనుంచి పడవ వేరయింది. నౌక వెళ్ళిపోతోంది. నిశ్చలంగా ఉన్న పడవకు క్రమేపీ దూరం కాసాగింది.

"మనం ఎక్కడున్నాం?" అనిత అడిగింది.

"అదేమో తెలీదు. కానీ ఈ దిక్కుగా పోతే జపాన్ తీరం చేర్తాం. అక్కడ భారత రాయబారకార్యాలయానికి వెళ్ళి రిపోర్ట్ ఇవ్వాలి మనం!"

"కానీ మీరు దుస్సాహసం చేస్తున్నారేమో నా గురించి! మీ ధైర్యాన్ని మెచ్చుకోకుండా ఉండలేను" అనిత మెచ్చుకుంది అతడ్ని.

"ఆ ఘనత మీకు దక్కుతుంది. మీ గురించే నేను ఆ నరకంలోంచి బయటకు వచ్చేస్తున్నాను. అదే మీరు తటస్థ పడకుండా ఉంటే నేనింకా అక్కడే మ్రగ్గుతూండే వాడ్ని!"

చీకట్లు అలముకుంటున్న అనంత సాగరంలో మామూలు పడవలో ఒక పురుషుడూ, ఒక స్త్రీ ముందుకు సాగిపోతున్నారు.

ఆ పడవలో వారిద్దరూ చాలా కష్టాల్ని ఎదుర్కోవలసి వచ్చింది. పగలంతా గాలి ఉధృతంగా వీచేది. రాత్రిళ్ళు విపరీతమైన చలి. దిక్కు తెన్నూ తోచకుండా పడవ సాగిపోతోంది. ముందుకే పోతున్నదో, వెనక్కి పోతున్నదో తెలియటంలేదు.

నాలుగు రోజుల ప్రయాణం తర్వాత వారు ప్రశాంత ప్రదేశానికి చేరుకోగలిగారు. పైగా కన్నుచూపు మేరలో చిన్న ద్వీపం కనుపించింది.

సముద్రంమీద తుఫాను ఎక్కడ వస్తుందో అని ప్రాణాలు బిగబట్టుకున్న నారాయణరావుకి ప్రాణం లేచి వచ్చింది.

పడవను ద్వీపంవేపుకు మళ్ళించాడు.

పడవను ఒడ్డుకు పట్టించి ఇసుకలోకి లాగాడు నారాయణరావు. అనిత పడవలోంచి భూమ్మీదకు దూకింది చిన్నపిల్లలా.

నేలమీది ఇసుకను గుప్పిట్లోకి తీసుకుని కళ్ళకద్దుకుంది. "భూమాతను స్పృశించి ఎన్నాళ్ళయిందో!" అంటూ ఇసుకలో కూలబడింది ఆమె.

"ఈ ద్వీపంలో నరసంచారం వున్నదేమో చూసి వస్తాను!" అన్నాడు నారాయణరావు.

"అమ్మో! నాకు భయం! నేను ఒంటరిగా వుండలేను. అయినా ఇప్పుడేం తొందరని? హాయిగా విశ్రాంతి తీసుకుని తర్వాత తీరిగ్గా శోధించవచ్చు!" అంది అనిత.

నారాయణరావు టార్పాలిన్‌తో టెంట్ వేశాడు. అందులోకి తమ సామాన్లను చేర వేశాడు. స్టౌవ్ వెలిగించి వేడివేడి కాఫీ పెట్టుకుని త్రాగారు. తమ కష్టాలన్నిటినీ మరిచి, పిక్‌నిక్‌కి వచ్చిన నూతన దంపతుల్లా ఉల్లాసంగా గడిపారిద్దరూ ఆ రోజంతా.

మర్నాడు ద్వీపం అంతా కలయదిరిగారిద్దరూ. అది చాల చిన్నద్వీపం. ఎక్కడా నరసంచారం లేదు. దుబ్బులూ, పొదలూ తప్పిస్తే ఆట్టే చెట్లుగూడ లేవు.

తీరం వెంబడే సీల్ జంతువులు సముద్రంలోంచి ఇసుకలోకి వచ్చి పొర్లాడుతున్నయ్.

మధ్యమధ్యలో ఒక జంతువు నోట్లో చేపను కరుచుకుని వస్తుంది. మిగతా జంతువులు ఆ చేపకోసం దాంతో కలబడతయ్.

నారాయణరావు రైఫిల్ తో నాలుగైదు జంతువుల్ని కాల్చి చంపాడు. వాటి కొవ్వుతీసి, దాంతో రాత్రిపూట దీపం వెలిగించుకున్నారు.

ఆ సాయంకాలం గాలి ఝుంఝూమారుతంగా వీయ సాగింది.

"తుఫాను వచ్చేలాగుంది!" అన్నాడు నారాయణరావు.

టార్పాలిన్ పెగ్స్ గాలికి లేచిపోకుండా మరింత కట్టుదిట్టం చేశాడు. ఆతర్వాత దుప్పట్లు కప్పుకుని వెచ్చగా పడుకున్నారు తీయని కలలు గనటానికి యత్నిస్తూ.

ఆ రాత్రంతా తుఫాను వీచింది. మర్నాడు తెల్లవారు జాముకి తిరిగీ వాతావరణం శాంతించింది.

నారాయణరావుకన్న ముందుగా ఆనితే లేచింది. టెంట్ బయటకువచ్చి సముద్రంమీదకు చూసింది. ఆమె కళ్ళను ఆమే నమ్మలేకపోయింది.

గబగబ వెళ్ళి నారాయణరావుని లేపింది. ఇద్దరూ సముద్రపు అలల దగ్గరకువచ్చి మరీ చూశారు.

తీరానికి దగ్గరలో "సీ డెవిల్" గాలికి నీళ్ళల్లో ఊగు తోంది. దాని తెరచాప స్తంభం త్రాళ్ళు తెగిపోయి వున్నయ్.

"ఆశ్చర్యంగా వుందే! సీ డెవిల్ ఇక్కడి కెలా రాగలిగిందబ్బా?" నారాయణరావు నోరు తెరిచి చూస్తుండిపోయాడు.

"పోనీ వచ్చిందే అనుకోండి! అందులో మనుష్యులు ఒక్కరూ కనబడరేం?" అనిత అడిగింది.

"అదీ నిజమే సుమా! పద వెళ్ళి లోపల చూద్దాం!" అంటూ ఇద్దరూ టెంట్ దగ్గర కొచ్చారు.

అనిత లోడ్ చేసివున్న రైఫిల్ ని తీసుకుంది. పడవలో ఎక్కి దిక్కులేకుండా పడివున్న "సీ డెవిల్" ని చేరుకున్నారు.

త్రాటినిచ్చెన మీదుగా పైకి ఎక్కారు.

"ఏమిటీ వింత? ఎవరూ లేరే లోపల!" అంది అనిత డెక్ మీద కలయజూస్తూ.

"అదే నాకూ అంతు పట్టటంలేదు!" అన్నాడు నారాయణరావు.

మరుక్షణంలో కాబిన్ గదుల్లోంచి గుండె లవిసి పోయేలా కేక వినవచ్చింది.

"ఎవరది? త్వరగా రండి! నన్ను రక్షించండి!" ఆ కంఠం కెప్టెన్ లార్సన్ దని నారాయణరావు ఇట్టే పోల్చుకున్నాడు.

అనిత రైఫిల్ ని గురిపెట్టి, నారాయణరావు వెనుకనే నడిచింది.

క్యాబిన్ గదిలో అన్ని వేపులా తడుముకుంటూ తచ్చాడుతూ కలయ దిరుగుతున్నాడు కెప్టెన్ లార్సన్.

"కెప్టెన్ లార్సన్! ఏం జరిగింది?" అంటూ అడిగాడు నారాయణరావు.

ఆ శబ్దం వచ్చినవేపుకు తిరిగాడు లార్సన్.

అనిత భయంతో కెవ్వున కేక వేసింది.

కెప్టెన్ లార్సన్ రెండుకళ్ళనూ దారుణంగా పొడిచేశా

రెవరో! "సీ డెవిల్" కెప్టెన్‌గా అరివీర భయంకరుడని పేరుబడ్డ లార్సన్‌పై ఈ అఘాయిత్యాన్ని ఎవరు తల పెట్టారు? నారాయణరావు అదే అడిగాడు.

"నా సోదరుడినుంచి తప్పించుకో గలిగానన్న గర్వంతో నేను తెగ త్రాగి పడిపోయాను. అప్పుడే మీ ఇద్దరూ తప్పించుకుని వచ్చారట. ఆ విషయం తర్వాత తెలిసింది. మర్నాడుదయం నా నౌకను నా సోదరుడు మళ్ళీ ఆటకాయించాడు. నాతో విరోధం వున్న వ్యక్తులు గభాల్న అతడి పక్షం చేరిపోయారు.

"నా సోదరుడు నా కళ్ళు రెండూ పొడిపించేశాడు. నన్నొక్కడ్నే సీ డెవిల్‌లో వదిలేసి, నా జనాన్నంతా తన స్టీమర్‌లోకి మార్చాడు. సముద్రపు గాలుల దయా దాక్షిణ్యాలకు నన్ను వదిలేసి వెళ్ళిపోయాడు. గత రెండు రోజులుగా వీచిన తుఫానులో నౌక మునిగిపోతుందనే అనుకున్నాను. కానీ నా కింకా భూమ్మీద ఆయుష్షు ఉన్నట్టుంది. నేను బ్రతికే వున్నాను, నౌక మునిగి పోలేదు."

తన విషాదగాథను ఏకరువు పెట్టాడు లార్సన్.

తాము తెచ్చుకున్న ఆహారంలోంచి లార్సన్‌కి భోజనం పెట్టాడు నారాయణరావు.

"మిస్టర్ లార్సన్! తెరచాప స్తంభం ఎక్కి త్రాళ్ళు సరిగా బిగిస్తే, మనం ఈ నౌకలో సుఖంగా ప్రయాణించ వచ్చు! ఏమంటావ్?" నారాయణరావు అడిగాడు.

"ఈ నౌకకు కెప్టెన్‌ని నేను! ఇది నా స్వంతం. దీన్ని ఉపయోగించే అధికారం నీ కెవరిచ్చారు?" కెప్టెన్ లార్సన్‌లో చింత చచ్చినా, పులుపు చచ్చినట్టు లేదు.

నారాయణరావు దిక్కులు పిక్కటిల్లేలా నవ్వాడు.

"నీదని దీనిమీద రాసిపెట్టి వుందా లార్సన్? నేను ఈ నౌకలోకి వచ్చినప్పుడు అయిదువందల రూపాయలు పోగొట్టుకున్నాను. దాన్ని థామస్ కాజేస్తే, అతడ్నించి పేకాటలో నీవు గెల్చుకున్నావ్! ఆ డబ్బు నాదేనంటే నీవానాడు ఏమన్నావో గుర్తుందా? నీదని ఎక్కడైనా రాసి వుందా అన్నావ్! పైగా బలం గలవాడిదే అధికారం అని బుకాయించావు. ఇప్పుడు, యిక్కడ నేను బలవంతుడ్ని. అధికారం నాది! దీన్ని ఒకరు ఇవ్వక్కర్లేదు. నాకై నేనే ఆ అధికారాన్ని హస్తగతం చేసుకుంటున్నాను!"

నారాయణరావు గబగబ తెరచాప స్తంభంమీదకు ఎగబ్రాకాడు. ఒక గంటసేపు పైన తిప్పలుపడి క్రిందకు దిగివచ్చాడు.

డెక్ మీద తెరచాప స్తంభం మొదట్లో క్కెప్టెన్ లార్సన్ చేతిలో కత్తిపట్టుకుని చేతికందిన తాడునల్లా కోసేస్తున్నాడు.

కళ్ళు పోయినా అతడి పాడుబుద్ధి రవంత మారలేదు.

"ఇదా నీ పన్నాగం! నీ రోగం నేను కుదురుస్తానులే!" అంటూ నారాయణరావు క్కెప్టెన్ లార్సన్ కాళ్ళు చేతులు బంధించాడు. తర్వాత భుజాన వేసుకుని అతడ్ని కెంట్ లోకి చేర్చాడు.

"నేను నౌకరిపేర్లు ముగించుకు వచ్చేదాకా ఇక్కడే పడి వుండు!" అంటూ తిరిగి నౌకలోకి చేరుకున్నాడు నారాయణరావు, అనితతో సహా.

మరో రెండుగంటలు కష్టపడ్డాక నౌక తెరచాపలు బాగయినయ్.

"మనం జపాన్ చేరగలిగితే చాలు. అక్కడ భారత రాయబార కార్యాలయంలో మా నాన్న స్నేహితు డున్నాడు. అతడి సాయంతో మనం జపాన్ చూడొచ్చు. తిరిగి ఏ ఇబ్బందీ లేకుండా ఇండియా చేరతాం!" అంది అనిత ఉషారుగా.

ఇద్దరూ తిరిగి ఒడ్డుకు వచ్చారు.

టెంట్‌లో కెప్టెన్ లార్సన్ లేడు. అతడేమైనాడా అని చుట్టూ కలయజూశాడు నారాయణరావు.

లార్సన్ కోపంతో తనున్న చోటునుంచి ఇసుకలో దొర్లుకుంటూ పోయాడు, కాళ్ళూ, చేతులూ బంధింపబడి ఉండటంవలన.

అయితే అతడికి దృష్టి లేకపోవటంవల్ల అతడు ఎక్కడికి పోతున్నదీగూడ తెలియకుండా దొర్లుకుపోయాడు.

ఇసుకలో సీల్ జంతువుల గుంపు చెర్లాటలాడుకుంటు న్నయ్. ఆ గుంపులోకి దొర్లుకుపోయాడు లార్సన్.

అతడి కళ్ళల్లోంచి ఇంకా కారుతున్న రక్తపు వాసనను అవి పసిగట్టినయ్. ఒకదాన్నొకటి త్రోసుకుంటూ వచ్చి, అతడి మీదపడి, తీర్గా అతడ్ని ఆరగించసాగినయ్.

నారాయణరావు తిరిగి వచ్చేసరికి కెప్టెన్ లార్సన్ అస్థిపంజరం మాత్రమే మిగిలి ఉంది.

జరిగిన సంఘటనకు ఇద్దరూ నిశ్చేష్టులై పోయారు.

ఏ సముద్రపు కుక్కలనయితే వేటాడుతూ మృగ ప్రాయంగా దయాదాక్షిణ్యాలు లేని రాయిగా గడిపాడో

కెప్టెన్ లార్సన్, అదే సముద్రపు కుక్కలచేత నిర్దాక్షిణ్యంగా చంపబడ్డాడు.

"అసలు అతగాడికి నా చేతిలో చావు రాసిపెట్టి ఉందనుకున్నాను. కానీ తన అమానుషత్వానికి తనే బలయిపోయాడు," నారాయణరావు కళ్ళనించీ కన్నీటి బొట్లు రాలలేదు.

టెంట్ ఎత్తేసి తమ సామానంతా 'సీడెవిల్'లోకి చేర్చారు అనిత, నారాయణరావులు. మరో అరగంటలో 'సీడెవిల్' జపాన్ వైపు పయనం సాగించింది.

—: ఐపోయింది :—

# నిప్పును మూటగట్టకు!

డాక్టర్ పెందుర్తి మాస్టర్జీ

చలి, చిక్కని చలి.

చిరిగిపోయిన వులెన్ మఫ్లెర్ తలకు చుట్టుకొని, జేబులో రెండు చేతులు దూర్చుకొని, నల్లని తారురోడ్డు మీద ఒంటరిగా నడుస్తున్నాడు, రామక్రిష్ణ. నగరందాటి నాలుగు ఫర్లాంగులు వచ్చాడు. అయినా నగరం తాలూకు భవంతులు కొన్ని అక్కడక్కడ వున్నాయి.

రామక్రిష్ణకు కావలసింది అలాంటివే. వాటిల్లోనే దొంగతనం చెయ్యటానికి అవకాశం వుంటుంది. రామక్రిష్ణకు ఇది మొదటి దొంగతనం కాకపోయినా గుండెల్లో భయంగానే వుంది.

అప్పుడప్పుడు టాక్సీనో, లారీనో ఆ రోడ్డుమీద

దూసుకుపోతున్నాయి. అలా దూసుకుపోతున్నప్పుడు తన నెవరయినా గుర్తిస్తారేమో అన్న ఆందోళన లేకపోలేదు.

చుక్కలు మిణుకు మిణుకు మంటున్నాయి. మంచు లాంటి చలిగాలి వీస్తూనే వుంది. మిణుగురులు గోడ్లమీద కారాడుతున్నాయి.

హఠాత్తుగా ఓ భవంతిముందు ఆగాడు.

రెండస్తుల మేడ మబ్బురంగులో వుంది. ఆధునికంగా అతి రమణీయంగా కట్టబడి వుంది. మేడచుట్టూ కంఠ హారంలా ప్రహరి. ప్రహరికి భవంతికి మధ్య గార్డెన్. పగలయితే రంగురంగుల మొక్కలు కనిపించేవేమో! రాత్రి కాబట్టి అన్ని నల్లగానే వున్నాయి.

రెండువైపులా చూసి ప్రహరి ఎక్కి లోపలకు దిగాడు. మెల్లిగా ఎలుకను పట్టే పిల్లిలా అడుగులో అడుగువేసు కుంటూ భవంతి కిటికీ దగ్గరకు నడిచాడు. అద్దం కిటికీలో నుండి లోపలకు చూశాడు.

అంతా చీకటిగా వుంది.

అందరు గాఢనిద్రలోవున్నారు అనుకున్నాడు. దగ్గరలో వున్న జామచెట్టుమీదగా పైకెక్కాడు. గుండెల్లో వణకు, అరిచేతులకు చెమటలు, గొంతు తడారిపోతూంది. చెట్టు మీదుగా పైభాగంలో వున్న లాన్ లోపలకు దిగాడు. సోఫాసెట్టు వుంది. మెల్లగా గుమ్మం దగ్గరకు నడిచాడు. అద్దం తలుపు చిన్న ఇనుపచువ్వతో తీశాడు. లోపలంతా చీకటిగా వుంది.

ఎవరు ఏ గదిలో పడుకున్నారో తెలియటంలేదు. తను అలాగే ఎవ్వరికి కనిపించనని తృప్తిపడ్డాడు. మెల్లగా ఒకొక్క గదిలోనికి నడిచాడు.

డ్రెస్సింగ్ రూము అది. మెల్లగా అగ్గిపుల్ల వెలిగించాడు.

పెద్ద నిలువుటద్దం, టాయ్‌లెట్ సెట్, చిన్న బీరువా వగైరాలు వున్నాయి. గదంతా కలయచూశాడు.

కళ్ళు జిగేల్‌మన్నాయి. ఎదురుగా బల్లమీద రత్నాల హారం.

గబాలున అందుకొని జేబులో కుక్కుకున్నాడు. ఇంట్లో ఎవ్వరు వున్నట్లు అలికిడి లేదే? ఏమయివుంటారు? ఆలోచిస్తూనే బెడ్‌రూములోనికి నడిచాడు. బెడ్‌రూములో మంచాలు ఖాళీగా వున్నాయి.

డ్రెసింగ్‌రూము లోనికి నడిచాడు.

ఖరీదయిన చీరెలు, జాకెట్లు వున్నాయి. గబగబ నాలుగు చీరెలు కొన్ని రవికలు మూటకట్టుకున్నాడు. ఇంతకీ ఇనుప బీరువా ఏమయినట్లు అనుకుంటూనే ఇంకో గదిలోనికి వెళ్ళాడు. ఆ గది బయటనుండి క్రింది భాగానికి మెట్లున్నాయి. అవి మెట్లుకాదు వీలింగ్ చైర్ నడిచేటందుకు కట్టబడ్డ అనువయిన ఎత్తుపల్లాలు.

మెల్లగా క్రిందకు దిగాడు. సందేహంలేదు ఆ భవంతిలో అందరు వూరువెళ్ళి వుంటారు. కావలసినవన్నీ పేరుపేరున దోచుకోవచ్చు. అగ్గిపుల్ల వెలిగించాడు. ఎదురుగా దృశ్యం.

కలా? నిజమా? గుండాగిపోయి నట్లయింది. శిలా ప్రతిమలా అయిపోయాడు. అగ్గిపుల్ల అయ్యేవరకు అట్లాగే వుండిపోయాడు. ఆతృతగా మరో అగ్గిపుల్ల వెలిగించాడు.

ఎదురుగా తల పగిలి రక్తంమడుగయిన స్త్రీ శవం. ఎప్పుడు చచ్చిపోయిందో తెలీదు. తల పగలటంతో ముఖమంతా రక్తసిక్తమయి వుంది. ఆమె ప్రక్కనే ప్రక్కకు పడిపోయిన వీలింగ్ చైర్. ఆ అగ్గిపుల్ల ఆరిపోయింది. మరొకటి వెలిగించలేదు.

గబాలున వెనుతిరిగి మతిపోయినవాడిలా ఆ గది యీ గది కంగారుగా తిరిగి తరువాత వచ్చినవేపే చెట్టుమీద నుండి దిగబోయాడు. ఆ ఆత్రుతతో విరిగిన కొమ్మ చివర చేయి చీరుకుపోయింది. అయినా లక్ష్యపెట్టలేదు. చేతిలో చీరెల మూట వదలలేదు.

గబాలున ప్రహరి ఎక్కి దూకబోయాడు.

ఎదురుగా టాక్సిలైట్ల వెలుగు ముఖంమీద స్పష్టంగా కనుపించింది. రామక్రిష్ణ చెయ్యి అడ్డుపెట్టుకొని లోపలకు దిగి టాక్సి వెళ్ళిపోయాక గోడదూకి బైటపడ్డాడు. పారి పోతున్న ఖైదీలా పరుగు ప్రారంభించాడు.

ఎవరో తరుముకొస్తున్నట్లు భయం వెంటాడుతోంది. చచ్చిన ఆ శవం కళ్ళముందు కదులుతూనే వుంది. యాంత్రికంగా ఇల్లు చేరాడు. మనసులో కంగారు, గుండెలలో భయం, ఆత్మలో ఆందోళన పిచ్చివాడ్ని చేస్తున్నాయి.

## 2

"నమస్కారమండి."

"నమస్కారమమ్మా ఎవరు కావాలి?" ప్రఖ్యాత డిటెక్టివ్ పి. జె. అడిగాడు.

"మీతోనే పనుండి వచ్చాను. మీ ఫోటో చాలాసార్లు పత్రికలలో చూసాను. మిమ్మల్ని ముఖాముఖిగా చూడటం ఇదే మొదటిసారి."

"నేను యీ వూరు రావటం డిటెక్టివ్ అయ్యాక మొదటిసారి."

"మీరు ఈ వూరు వచ్చారని తెలిసే నేను వచ్చాను" లైము ఒకసారి చూసుకుంది. "నా పేరు ఇందిర. మధు గార్డెన్స్ దగ్గర మా ఇల్లు. నేను మెరీస్ స్టెల్లాలో బి. ఎ.

ఫైనలియర్ చదువుతున్నాను. మా అక్క వసుంధర నిన్న చనిపోయింది" మాటల్లో తొందర కనిపిస్తుంది.

"అలాగా ఏమయినా వ్యాధా?"

"కాదండి స్పయిన్ యింజరీతో మూడు నెలలుగా వీలింగ్ చైర్ లోనే జీవితం గడుపుతోంది. నిన్న సాయంకాలం మా బావ మధురాధర్ వాసవిసంస్థ నిర్మాత మద్రాసు వెళ్ళాడు. మేము పెళ్ళికి నిడమనూరు వెళ్ళాం. ఆమె ఒకత్తె ఇంటి నౌకరు వున్నారు. ఆమె ఆత్మహత్య చేసుకుంది, అని అనుకుంటున్నారు."

"ఆత్మహత్య అయితే నేను చేయగలిగిందేముంది?"

"అది ఆత్మహత్య కాదని నా అభిప్రాయం."

"ఎలా అనుకుంటున్నారు?"

"ఫలానా కారణం అని చెప్పలేను. మా అక్కయ్య మనసు నాకు బాగా తెలుసు. ఇది ఆత్మహత్య అనటానికి ప్రత్యేకమయిన కారణంకూడా లేదు. పోలీసు రిపోర్టు యివ్వటం జరిగింది. పోలీసులు యీ పాటికి వచ్చేవుంటారు. మీరు త్వరగా రండి."

"పోలీసులు వస్తే వాళ్ళే చూసుకుంటారు గదా."

"అలా కాదు, దయచేసి మీరు రండి. పోలీసులు అసమర్థులు అని నేను అనటంలేదు. ఈ కేసులో నిగూఢమయిన కొన్ని విషయాలున్నాయి. ఇవి వాళ్ళకు అంతు పట్టక పోవచ్చు. ప్లీజ్ దయచేసి రండి" ఆతృతగా అనటంతో పి. జె. కదిలాడు.

"మీ బావ రాలేదా?"

"రాలేదు. మద్రాస్ స్వరూప్ హోటల్ కి ఫోన్ చేస్తే ఎక్స్ ప్రెస్ లో వస్తున్నట్లు చెప్పారు. ఈ పాటికి రావచ్చు."

"మీ యింట్లో యెందరు వున్నారు?"

"నేను, మా అమ్మ, మా బావ మధురాధర్, నౌకరు వుంటాం."

కారు రోడ్డుమీద హంసగమనంలా పదినిమిషాలు సాగింది. ఇందిర చెప్పిన డైరెక్షన్స్ ప్రకారం యింటి ముందు కారాపాడు. అప్పటికే పోలీసు వాను, ఇతర సిబ్బంది సిద్ధంగా వున్నారు.

రెండంతస్తుల భవంతి. చుట్టూ గార్డెన్‌లో రంగు రంగుల పూల మొక్కలు ఉన్నాయి. గార్డెన్ దాటి లోపలకు నడిచాడు పి. జె.

సబ్ ఇన్‌స్పెక్టర్ సెల్యూట్ చేసి "లోపలకు వెళ్ళండి" అన్నాడు.

అది విశాలమయిన హాలు. నేలమీద తివాసీ ఎరుపు రంగులో వుంది. ఖరీదయిన రోజ్‌వుడ్ సోఫాలు, ప్లాస్టర్ ఆఫ్ పారిస్ బొమ్మలు, గోడలకు మోడరన్ ఆర్ట్ ఫిగర్స్ వున్నాయి. ఒకమూల రేడియోగ్రాము, మరొకవైపు ఫోను వున్నాయి. హాలులోనుండి రెండువైపుల పైభాగానికి మెట్లు వున్నాయి. మెట్లు మొదటిభాగంలో ఐదడుగుల గోడ, ఆ గోడకు చంద్రశేఖరంగారి ఫొటో వుంది. ఆ ఫొటోకి పూలదండ వేసివుంది.

"మా నాన్నగారు" అంది ఇందిర.

తల ఊపాడు పి. జె. జేబులోనుండి గోల్డ్‌ఫ్లాక్ సిగరెట్ తీసి వెలిగించాడు. తల తిప్పి ఆ ఫొటో యెదురుగా వున్న హతురాలి శవాన్ని చూశాడు. అప్పుడే ఫొటోగ్రాఫర్ ఫొటోలు తీయటం ముగించాడు.

అన్నిగదులు కలయచూసి వస్తున్న క్రైమ్ బ్రాంచి ఇనస్పెక్టర్ విజయ్, పి. జె. ను చూసి "హల్లో! ఊరక

రాకు మహాత్ములు, దివ్యదృష్టితో చూసి వచ్చారను కుంటాను'' అన్నాడు.

''నేను మహాత్ముడ్ని కాదండి, మనిషిని'' పి. జె. నవ్వాడు.

''మీ రాకకు కారణం?''

''నిజం చెప్పమంటారా? అబద్ధం చెప్పమంటారా?''

''మీరు అబద్ధం చెప్పినా, అందంగా చెపుతారు. బైదిబై రిగర్ మార్టిస్ గుర్తులు లేవు. పైగా శవం బిగుసుకు పోయింది. తలలోనుండి కారిన రక్తం గడ్డకట్టి పోయింది. కాబట్టి యీమె మరణం నిన్న జరిగివుండాలని నా అభి ప్రాయం.''

''ఐ. సి.'' పి. జె. అన్నాడు.

శవాన్ని చూశాడు. నుదురు పగిలి రక్తం కారి ముఖ మంతా వికృతంగా వుంది. అందమయిన అమ్మాయి సందేహంలేదు. సన్నగా, పొడవుగా, వొంపులు వుండ వలసినచోట్ల వంపులు వున్నాయి. ఎత్తయిన రొమ్ములు, నల్లని సాఫీజుట్టు, ఎర్రని పెదవులు కలవారి ఇంటి పడు చులా వుంది. వయసు పాతిక సంవత్సరాలు వుంటాయి. నీలంరంగు చీరె, అదేరంగు రవిక ధరించి వుంది. ప్రక్కకు పడటంచేత వాచి పగిలిపోయి వుంది. ఆ వాచీలో టైము ఐదు ముప్పైఐదు నిమిషాలయింది. ప్రక్కనే వీలింగ్ చైర్.

''ఇనస్పెక్టర్! ఇది హత్యా, లేక ఆత్మహత్యా?''

''వెరి సింపుల్ ఇది ఆత్మహత్య'' ఇనస్పెక్టర్ విజయ్ అన్నాడు.

''అయితే మీకు శ్రమ తగ్గిందన్నమాట'' పి. జె. అన్నాడు. క్షణం ఆగి విజయ్ ముఖంలోనికి చూసి ''ఇది ఆత్మహత్య అని ఎలా నిర్ణయించారు?''

"నిన్నటిరోజున హతురాలు వసుంధర చెల్లెలు, తల్లి నిడమానూరు పెళ్ళికి వెళ్ళారు. భర్త మద్రాసు వెళ్ళాడు. ఇంటిలో ఒంటరిగా ఉన్న యీమె స్పయిన్ ఇంజరీ పేషంటు, వీలింగ్ చెయిర్ మీదే యీమె జీవితం. ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్‌తో ఆత్మహత్య చేసుకుంది. .38 కాలిబర్ రివాల్వర్ ఆమె చేతిలోనే ఉంది. లోపల గడియవేసి ఉంది. ఈ ఆధారాలు చాలనుకుంటాను ఆత్మహత్య అనుకోటానికి."

డాక్టర్ శవాన్ని చూసి పోస్టుమార్టమ్‌కు సిద్ధం చేశాడు.

"ఇందులో హేతువాదం ఏమీ లేదా?"

"నో. ఆలోచిస్తే అనుమానాలు పెనుభూతాలవుతాయి."

పి. జె. ఒక్కొక్క గది వెదకసాగాడు. ప్రక్కనే వున్న డ్రాయింగ్ రూములో పెద్ద గడియారం వుంది. గడియారం క్రింద టీపాయిమీద ఒక చిన్న డైరిలాంటి పుస్తకం వుంది. చేతిరుమాలుతో పుస్తకం అందుకొని వేలిముద్రలు పోకుండా జాగ్రత్తగా పేజీలు తిప్పాడు. లోపల పేజీలో 4231 నెంబరు వుంది. ప్రత్యేకంగా వున్న ఆ నెంబరు ఏమిటి?

ఆలోచిస్తూనే మరొక గదిలోనికి నడిచాడు. అది డ్రస్సింగ్ రూము. ఆ గదిలో ఇందిర గబగబ వెదుకుతోంది. "ఏమిటమ్మా?" పి.జె. ప్రశ్న. అప్పుడే గదిలోనికి వచ్చిన ఇనస్పెక్టర్ విజయ్ దగ్గరగా వెళ్ళాడు.

"నావి నాలుగు చీరెలు ఒక నెక్లెస్ కనిపించలేదు."

"పై భాగంలో చూశావా?"

"పైన వెదకే ఇక్కడకు వచ్చాను. నేను వెళ్ళేటప్పుడు వున్నాయి, ఇప్పుడు లేవు" ఇందిర కంగారుగా అంది.

"మీ అక్క వాషింగ్‌కి వేసిందేమో" ఇనస్పెక్టర్ అన్నాడు.

"మరి నెక్లెస్?" పి. జె. ప్రశ్న. ఇనస్పెక్టర్ తల విదిలించాడు.

పి. జె. నవ్వి "ఇనస్పెక్టర్ యీ ఇంట్లో ప్రతి అంగుళం వెదకటం మంచిది" అంటూ పి. జె. పాథాలజిష్టు దగ్గరకు వచ్చి "మిస్టర్ పాణి యీ డైరీమీద, టెలిఫోన్ మీద పై భాగంలో అవసరమయినచోట్ల వేలిముద్రలు తీయండి."

"సర్! పై భాగంలో లాన్ వైపు వున్న అద్దం తలుపు తెరిచే వుంది" సబ్ ఇనస్పెక్టర్ చెప్పటంతో అందరూ అక్కడకు వెళ్ళారు. లాన్‌లో ప్లాస్టిక్ కుర్చీలు, చిన్న పిట్టగోడ, గోడకు అనుకొని జామచెట్టు.

"ఏమిటి ఆలోచిస్తున్నారు?" ఇనస్పెక్టర్ విజయ్ అడిగాడు పి. జె. ని.

"ఏంలేదు ఎదురు డోర్ వేయబడి వుంది. హంతకుడు ఇటునుండి వెళ్ళాడా? లేక ఇటునుండి వచ్చాడా?"

"అప్పుడే హత్య అని ధృవపరుస్తున్నారు."

పి. జె. నవ్వాడు. "నాకు అనుమానాలు ఎక్కువ. ఈ గదిలో చూడండి మొత్తం మూడు అగ్గిపుల్లలున్నాయి. అంటె దీపం ఆరిపోయాక యీ అగ్గిపుల్లలతో అవసరం కలిగింది అన్నమాట. దీపం ఆరిపోయింది కాబట్టే అగ్గిపుల్ల వెలిగించలేదు దీపాలు వెలగలేదు."

"దీపం లేక అని ఎందుకు అనుకోవాలి. ఏ సిగరెట్టు వెలిగించుకోవటానికి ఎందుకు కాకూడదు?"

"సిగరెట్టుకు మూడు అగ్గిపుల్లలు వేరువేరు గదుల్లో అవసరం ఏమిటి? పోనీ మీరన్నట్లు మూడు సిగరెట్లయితె మూడు గదులలో వుండాలి కదా!" పి. జె. అనటంతో చిరాకు కలిగింది.

జామచెట్టు కొమ్మను నిశితంగా చూశాడు. చెట్టు కాండముమీద రక్తపు చుక్కలున్నాయి. ఇంకా స్త పైగా చీరుకుపోయిన చిన్న చర్మం వుంది.

"ఇనొక ఆధారం హంతకుడు ఎటునుండి పైకి ఎక్కినా ఇటునుండి క్రిందకు దిగాడు."

"అదెలా" ఇనస్పెక్టర్ ప్రశ్న.

"ఇనస్పెక్టర్ కాస్త ఆలోచించండి. కొమ్మ చీరుకుపోయింది ఇక్కడ రక్తపు చుక్కలు పడింది. అక్కడ ఎక్కినపుడు చీరుకుపోయినట్లయితె ఏ పరిస్థితిలోను అక్కడ రక్తం పడదు. మరొక విషయం హంతకుడు కంగారుగా దిగివుండాలి. అందుకే చీరుకుపోయింది. అంతేగాదు హంతకుడు యీ యింటికి అపరిచితుడు, పాత నేరస్తుడయి వుండాలి."

ఇనస్పెక్టర్ ఆలోచించాడు.

డిటెక్టివ్ అసిస్టెంట్ ధర్మ అప్పుడే వచ్చాడు. "మీ ఇద్దరు వచ్చారంటే ఇది హత్యే అనుకోవలసి వస్తుంది."

"మా ఇద్దరు రావటంవల్ల హత్యకాదు ఇది. హత్య కావచ్చు అని అనుమానం మీద ఇద్దరం వచ్చాం. మరొక ముఖ్యవిషయం రివాల్వర్ ట్రిగ్గర్ చూడండి. పాధాలజిష్టు రిపోర్టు ప్రకారం రివాల్వర్ మీద వేలిముద్రలు వున్నాయి. రివాల్వర్ ట్రిగ్గర్ మీద వేలిముద్రలు లేవు. అంటె ఎవరో ప్రయత్నం పూర్వకంగా మనల్ని తప్పుదారి పట్టించటానికి వేసిన పథకం కావచ్చు."

ఇంతలో అద్దంమీద, గదిలో కొన్ని చోట్లనుండి వేలి ముద్రలు తీసుకున్న పాధాలజిష్టు అక్కడకు వచ్చాడు.

"ఇవిగో సార్ వేలిముద్రలు" పాధాలజిష్టు అందించాడు.

"ఇవి ఈ ఇంట్లో ఎవరి ముద్రలయినా కావచ్చేమో అందరి వేలిముద్రలు తీసుకోవటం అవసరం" ఇనస్పెక్టర్ అన్నాడు.

పి. జె. నవ్వి "అయితే ఇది హత్య అంటారా?" ప్రశ్నించాడు.

"ఆలోచించాలి. మనం మొదట్లోనే వున్నాం."

పి. జె. మెట్లుదిగి ఆఖరు మెట్టు దగ్గర ఆగాడు. కాలిన దారం వుంది. మెల్లగా వంగి కాగితంలో కాలిన దారం బూడిదను వేసి పాట్లాంగట్టి జేబులో వేసుకున్నాడు. మెయిన్ డోర్ దగ్గరకు వచ్చాడు. గొళ్ళెం పగలగొట్టి వుంది.

"ఇనస్పెక్టర్ ఈ గొళ్ళెం మీరే పగలకొట్టారా?"

"అవును మేమే విరగగొట్టాం."

పి. జె. ఆ తలుపు ద్వారంచుట్టూ చూశాడు. తలుపు మడతలో చచ్చిన బల్లి వుంది. చీమలు పడుతున్నాయి.

"ఇనస్పెక్టర్ తలుపు తీశాక వేయటం జరిగిందా?"

"లేదు."

"ఈ బల్లి చూడండి. ఇది చచ్చి గంట అయివుండాలి."

"అయితే ఏమిటంటారు?"

"ఈ బల్లిని మార్చురీ చేయాలి. ఈ బల్లి ఇక్కడ చచ్చిందంటే తలుపు ఎవరో తీసి వేసివుండాలి. వేసినప్పుడు ఈ బల్లి తలుపు సందులో పడి చచ్చిపోయింది. ఆ తలుపు తీసిన టైము ఎంతయివుంటుంది? ఎవరు తీసి

వుంటారు? లోపల గడియ ఎలా పడింది? ప్రశ్నలు..." అంటూ చచ్చిన బల్లిని అద్దం ముక్కమీద వేసి "డాక్టర్ ఇది ఎంత సేపటి క్రితం చనిపోయి వుంటుంది?"

"శవం మార్చురీ బాగుంది. బల్లి మార్చురీ ఏమిటండి?"

"శవం ఎప్పుడు చచ్చింది కరెక్ట్‌గా చెప్పకపోయినా, బల్లి ఎప్పుడు చచ్చిందో చెప్పినట్లయితే ఈ కేసులో ఒక 'క్లూ' దొరికినట్లే."

డాక్టర్ బల్లిని పరీక్షగా చూసి "ఒక గంట క్రితం చనిపోయి వుంటుంది."

"థాంక్స్" అన్నాడు పి. జె. "మిస్టర్ పి. జె. నా కంతా అయోమయంగా వుంది. పైభాగంలో డోర్ తీసింది ఎవరు? ఈ తలుపు తీయటమేమిటి? ఈ రెండు ఇలా వుండగా ఇది హత్యా? ఆత్మహత్యా తేలకపోవటం? అంతా చిక్కు సమస్యలా వుంది" ఇనస్పెక్టర్ విజయ్ అన్నాడు

పి. జె. నవ్వాడు. "ఫస్ట్ డిగ్రీ మర్డర్ అయినపుడు. సమస్యలు ఇలాగే వుంటాయి. ఇందిరను పిలవండి."

"ఎందుకు?"

"ఈవేళ ఉదయం తలుపు ఎవరయినా తీశారేమో తెలుసుకోవాలి. అది ముఖ్యం."

ఇందిర వచ్చింది. ప్రక్కనే వాళ్ళమ్మ దుర్గకూడా వుంది.

"నిన్నటినుండి నిడమానూరులోనే వున్నాం. లాంఛనాలు అయాక మధ్యాహ్నం బయలుదేరవచ్చనుకున్నాం. రెండుసార్లు ఫోన్ చేస్తే ఎవరు పలకలేదు. మా అక్కయ్య స్పయిన్ ఇంజరీ పేషంటు, ఎక్కడికీ వెళ్ళదు. తీరా యింటికి వచ్చాక తలుపు వేసేవుంది. అనుమానంమీద పోలీస్ రిపోర్టు యిచ్చాం" ఇందిర అంది.

"మీ యింట్లో ఎందరున్నారు?"

"నేను, మా అమ్మ, మా బావ, నౌకరు రామయ్య."

"మరి రామయ్య ఏడీ?"

"రామయ్య నమ్మకస్తుడు. చాలాకాలంనుండి యింటి వ్యవహారాలు చూస్తున్నాడు. ఇప్పుడు ఎక్కడకు వెళ్లాడో తెలియటంలేదు."

అప్పుడే రామయ్య ఆత్రుతగా లోపలకు వచ్చాడు. "ఏమయింది? అమ్మగారు! ఆం ఏమిటిది? ఎవరు చేశారు? అమ్మగారు..." రోదించసాగాడు.

"నిన్నటినుండి ఎక్కడికెళ్ళావు?" ఇనస్పెక్టర్ కటువుగా అన్నాడు.

"దిక్కుమాలినవాడ్ని త్రాగి పడుకున్నాను. ఏమిటిది?"

"హత్య. నమ్మకస్తుడవని అప్పగించి వెళ్ళితే హత్య చేస్తావా?" ఇనస్పెక్టర్ హోదాలో అన్నాడు. రామయ్య తోకత్రొక్కిన త్రాచులా లేచాడు. ముఖం రంగు మారింది. "అయ్యగారూ, కూటికి పేదనికాని నీతికి పేదను కాదండి. ఎంత డబ్బు కావలిస్తే అంత యిస్తారుగాని యిలాంటి బతుకు తక్కువపనులు చేస్తానా?" కోపంగా అన్నాడు.

పి. జె. రామయ్య భుజంపై చెయ్యివేశాడు, "చూడు రామయ్యా, నిన్నటినుండి నీవు రాలేదని అలా అన్నారు. ఎంత డబ్బు కావలిస్తే అంత వసుంధర నీకు ఎందుకిచ్చేది?"

రామయ్య అవాక్కు అయిపోయాడు.

బయట జీపు ఆగిన చప్పుడు, అందరి దృష్టి అటు మళ్ళింది.

చేతులను తాళ్ళతో కట్టిన రామకృష్ణను స్థానిక ఇనస్పెక్టర్ మెడపట్టి లోపలకు తోశాడు. క్రైమ్‌బ్రాంచి ఇన

స్పెక్టర్ విజయ్‌కు సెల్యూట్ చేసి, రామకృష్ణను చూపాడు. "సర్ ఇతను యీ నెక్లెస్ అమ్ముతుంటే అనుమానంమీద అరెస్టుచేసి, వివరాలడిగితే యీ యింట్లో దొంగతనం చేశానని చెప్పాడు." విజయ్, రామకృష్ణ కళ్ళలోనికి చూశాడు.

పాధాలజిస్టు వేలిముద్రలు పరీక్షించి "ఆ గదిలో పై భాగంలో దొరికిన వేలిముద్రలు, రామకృష్ణ వేలిముద్రలు ఒక్కటే" అన్నాడు.

"అరెస్టు చెయ్యండి" అన్నాడు గంభీరంగా.

"నాకేం తెలీదు. నేనీ నేరం చేయలేదు" అరుస్తున్నాడు రామకృష్ణ. పి. జె. ఆలోచిస్తూ నిలుచుండి పోయాడు. కొన్నిక్షణాలు తరువాత పి. జె. అడిగాడు. "ఇనస్పెక్టర్ మీకు అభ్యంతరం లేకపోతే రామకృష్ణను నాలుగుమాట లడగవచ్చా?"

"వై నాట్. అడగండి" అన్నాడు ఇనస్పెక్టర్ విజయ్.

పి. జె. రామకృష్ణ భుజంమీద చేయివేసి ప్రక్క గదిలోనికి తీసుకువెళ్ళాడు. "నీ పేరు" అడిగాడు.

"రామకృష్ణ."

"నన్ను డిటెక్టివ్ పి. జె. అంటారు" తనను పరిచయం చేసుకున్నాడు. రామకృష్ణ గభాలున కాళ్ళు పట్టుకున్నాడు. "మీ గురించి నాకు తెలుసు. కాని నేను హంతకుడ్ని కాదు. నేను చంపలేదు. ఉద్యోగం కొరకు తిరిగి తిరిగి వేసారి దొంగతనం చేయటానికి దిగాను" కళ్ళలో ధారలుగా నీళ్ళు కారుతున్నాయి."

"నీవు యీ యింట్లో దొంగతనానికి ఎన్ని గంటలకు వచ్చావ్?"

"మధ్యరాత్రి షుమారు పన్నెండవుతుంది. ఇంట్లో అలికిడి లేదని జామచెట్టుమీదుగా లోపలకు ప్రవేశించాను. అగ్గిపుల్ల గీచాను. ఆ వెలుగులో శవం. అది జ్ఞాపకంవస్తే యిప్పటికి భయమేస్తుంది."

పి. జె. ఆలోచించాడు. అతను హత్య చేయటానికి బలమయిన కారణం ఏం లేదు. కాని విట్నెసులు అతన్ని నిందితుడ్ని చేశాయి. విధి వంచితుడు అనుకున్నాడు. "చూడు రామకృష్ణా! నీవు నిజంగా హత్య చేయకపోతే కాయశక్తులా నిన్ను కాపాడతాను. అధైర్యపడక" అంటూ భుజం తట్టాడు.

అంతలో బయట టాక్సీ ఆగింది. టాక్సీలోనుండి మధురాధర్ దిగాడు. "ఏమిటి? ఏమయింది?" అత్రుతగా అడిగాడు.

"ఐయామ్ సారి, మీ భార్య వసుంధర హత్య చేయ బడింది."

"హత్య, నా భార్య హత్య చేయబడిందా? అబద్ధం నా భార్య దేవతలాంటిది. ఆమెను ఏ రాక్షసుడు చంపాడు. వసుంధర, నా వసు" బిగ్గరగా ఏడ్చాడు. కొన్నిక్షణాలు అందరు నిశ్శబ్దంగా వున్నారు. ఇనస్పెక్టర్ విజయ్ భుజం తట్టాడు.

"ఎప్పుడు జరిగింది యీ హత్య?"

"నిన్న రాత్రి జరిగింది. మేము ఇప్పుడే తెలుసు కున్నాం. హంతకుడ్ని కూడా పట్టుకున్నాం. ఇతనే."

మధురాధర్ క్రౌర్యంగా చూశాడు. అక్కడ ఎవరూ లేకుండా రామకృష్ణ ఒక్కడే వున్నట్లయితే అతన్ని ముక్కలు చేసేవాడు. కాని, ఎందరో వుండటంవల్ల ఏమీ అనలేక చూపులతో తినివేశాడు.

కొన్ని నిమిషాల తరువాత రామకృష్ణతో పోలీస్ సిబ్బంది వెళ్ళిపోయారు.

# 3

కోర్టు గడియారం పదిగంటలు కొట్టింది. న్యాయమూర్తి హరిశ్చంద్రరావు న్యాయసింహాసనం అధిష్టించాడు. ప్రాసిక్యూషన్ కేసు ప్రారంభించేటందుకు సిద్ధమవుతున్నారు.

డాక్‌లో ముద్దాయి రామకృష్ణ, ప్రేక్షకులలో ఇందిర, ఆమె తల్లి, మధురాధర్, రామకృష్ణ చెల్లెలు వాసవి వున్నారు.

"యువర్ ఆనర్! ది జంటిల్‌మన్ ఆఫ్ ద జ్యూరి! పరిస్థితుల ప్రాబల్యంవల్ల నేరాలు చేయటం సహజం, అయితే ఇది నేరంకాదు. దానికంటె బలమయింది, హృదయవిదారకమయింది. వసుంధర, కాళ్ళు వుండి నడవలేని అమ్మాయి ఐమీన్ ఇంజరీ పేషెంటు. ఆమెను నిర్దయగా డాక్‌లో నిలబడ్డ ముద్దాయి రామకృష్ణ చంపాడని ప్రాసిక్యూషన్ చెపుతుంది. ఇతనే ఈ హత్యచేశాడని ఎన్నతగిన ఋజువులు, సాక్ష్యాలు ప్రాసిక్యూషన్ ప్రవేశపెడుతుంది కాబట్టి కోర్టువారు అనుమతించవలసిందిగా కోర్టువారిని కోరుతున్నాం."

"మిస్టర్ రామకృష్ణ నీ తరఫున వాదించటానికి లాయరెవరయినా వున్నారా?" న్యాయమూర్తి అడిగాడు.

రామకృష్ణ విషాదంగా నవ్వాడు. "కూటికే గతిలేని నాకు లాయరు ఎలా వస్తాడు న్యాయమూర్తిగారు."

"ఐ మె బి పర్‌మిటెడ్ టు డిఫెండ్ ద ఎక్యూస్‌డ్ యువర్ ఆనర్" ప్రఖ్యాత డిటెక్టివ్ లాయరు పి. జె. గొంతు ఖంగుమని వినిపించటంతో అందరి దృష్టి అటు

మళ్ళింది. ముఖాలు ఆశ్చర్యంతో రంగుమారాయి. రామ కృష్ణ కళ్ళు కృతజ్ఞతతో మెరిశాయి.

"ప్రాసిక్యూషన్ వారు కేసు ప్రారంభించవచ్చు" న్యాయమూర్తి అన్నాడు.

పి. పి. గొంతు సవరించుకొని "ఇది అన్ని కేసులలా సామాన్యమయింది. రామకృష్ణ ఒక దొంగ, అని తనే అంగీకరించాడు. నవంబరు 21వ తేది రాత్రి ఇతను ఆ ఇంట్లో వెనుకభాగంనుండి ప్రవేశించి నెక్లెస్, కొన్ని చీరెలు దొంగిలించాడు. అది వసుంధర చూసిందా? లేక మరేదయినా కారణం వుందా అన్నది నిర్వివాదాంశం. రివాల్వర్‌తో చంపటం ఖాయం. అయితే రివాల్వర్ మీద తన వేలిముద్రలు పడకుండా తుడిచి ఆత్మహత్య అనుకోవడానికి వీలుగా అది హతురాలి చేతిలో వుంచాడు.

వాటిజ్ మోటివ్ ఆఫ్ ద మర్డర్. బహుశా మర్డర్ ఇంటెన్షన్‌తో రామకృష్ణ వెళ్ళి వుండకపోవచ్చు. వసుంధర బెదిరించటమో, లేక ముద్దాయిని చూడటమో జరిగింది కాబట్టి హత్యచేశాడు. సో ఈ కేసు దర్యాప్తు చేసిన విజయ్‌ని కోర్టువారి అనుమతితో పిలుస్తున్నాను," అన్నాడు గాగుల్సు తుడుచుకుంటూ.

ఇనస్పెక్టర్ విజయ్ విట్నెస్ బాక్స్‌లో నిలబడి ఉద్యోగార్హతల్ని తెలియచేసి ప్రమాణం స్వీకరించాడు.

"ఇనస్పెక్టర్ విజయ్ నవంబరు 21వ తేది వసుంధర అనే అమ్మాయి హత్యచేయబడిందని కంట్రోల్‌నుండి మీకు ఫోను వచ్చాక మీరేం చేశారు? రామకృష్ణను ఎలా అరెష్టు చేశారు?"

"కంట్రోల్‌నుండి ఫోను వచ్చాక హత్య జరిగిన

ఇంటికి వెళ్ళాం. అయితే ఆ ఇంట్లో హత్య జరిగింది అని ముందే తెలిసింది. ఇందిర అనే వసుంధర చెల్లెలు అనుమానం మీద రిపోర్టు యివ్వటంతో తలుపు బద్దలకొట్టాం. లోపల వసుంధర శవం వుంది. నుదురులో బుల్లెట్ దిగి తల పగిలి చనిపోయింది. తలలో .38 కాలిబర్ బుల్లెట్ వుంది. అది ఎక్సిబిట్ 'ఏ'గా ప్రవేశపెట్టాం."

"ఇది హంతకుడు వెంట తెచ్చాడా? అది ఎవరిది?"

"అది ఆ యింట్లోనే వసుంధర భర్త మధురాధర్ రివాల్వర్. ఈ రివాల్వర్‌తో వసుంధర బెదిరించి వుండాలి. రామకృష్ణ యుక్తిగా ఆ రివాల్వర్ చేత చిక్కించుకుని హత్య చేశాడు."

"అప్పుడు టైము ఎంతయి వుంటుంది."

"షుమారు సాయంకాలం 5 నుండి రాత్రి 8 గం॥ల లోపు ఈ హత్య జరిగివుండాలి. మరొక విషయం హతురాలి చేతికి పగిలివున్న వాచినిబట్టి 5-35 నిమిషాలకు ఈ హత్య జరిగివుండవచ్చు. అది ఎక్సిబిట్ 'డి'గా ప్రవేశపెట్టాం."

"హంతకుడి ఉద్దేశం ఏమిటి?"

"దొంగతనం. రామకృష్ణ ఆ యింట్లో దొంగతనం చేయాలని జామచెట్టు మీదుగా బాల్కనీలోనికి ఎక్కి లోపల ప్రవేశించాడు. అతడు దొంగిలించిన నెక్లెస్, చీరెలు అమ్మకానికి ప్రయత్నిస్తుండగా అరెష్టు చేశాం. అవి ఎక్సిబిట్ 'బి', 'సి' లుగా ప్రవేశపెట్టాం."

"అవి యివేనా?"

"యస్. ఇవే అని వీటిపై గుర్తులు పెట్టాను."

"ఆ యింట్లో మరెవరయినా వున్నారా?"

"లేరు. ఇందిర తల్లితో కలిసి నిడమానూరు పెళ్ళికి వెళ్ళింది. మధురాధర్ క్రొత్త సినిమా తీయటం కోసం మద్రాసు వెళ్ళాడు. నౌకరు కాగా త్రాగి నిద్రపోయాడు. అందుకే వసుంధర ఆ యింట్లో ఒకర్తె వుంది. ఆ విషయం హంతకుడికి తెలిసివుండాలి."

"క్రాసు చేసుకోవచ్చు" అన్నాడు పి. పి. లాయరు.

పి. జె. లేచి గొంతు సవరించుకొని విజయ్ ముఖంలోనికి చూసి పలకరింపుగా నవ్వాడు.

"హత్య ఎన్నిగంటలకు జరిగిందన్నారు."

"ఐదు – ఎనిమిది గంటల మధ్య."

"రామకృష్ణ ఎన్నిగంటలకు లోపలకు వెళ్ళివుండాలి."

"షుమారు ఐదుగంటలు కావచ్చు."

"మీరు ఎన్నో చోరీకేసులు దర్యాప్తు చేశారు కదా. చోరీ సహజంగా ఎప్పుడు జరుగుతూ వుంటుంది."

"రాత్రి సమయంలో."

"మరి రామకృష్ణ పగలు దొంగతనం చేశాడనటం సమంజసమా?"

"అబజక్షన్ యువర్ ఆనర్! దొంగతనం పూర్వకాలంలో రాత్రులు జరిగేది. ఇప్పుడు పట్టపగలు పదిమంది మధ్య జరుగుతూంది. రామకృష్ణ ఉద్దేశాన్ని సాక్షిని చెప్పమనటం హాస్యాస్పదం."

"అభ్యంతరం అంగీకరిస్తున్నాను."

పి. జె. సన్నగా నవ్వాడు. "అయితే ముద్దాయి పగలే లోపల ప్రవేశించాడంటున్నారు. అయితే పైభాగంలో కాలిన అగ్గిపుల్లలు మూడు కనిపించాయి, వాటిని ముద్దాయి ఎప్పుడు గీసి వుండాలి."

"అదే రాత్రి గీసి వుండాలి."

"గుడ్. ఆ అవసరం ఏమిటో చెప్పగలరా? మిస్టర్ ఇనస్పెక్టర్ ముద్దాయి పగలు ప్రవేశించాడంటున్నారు. పగలు అగ్గిపుల్ల గీయవలసిన అవసరం ముద్దాయికి లేదు. ఇంట్లో వస్తువులు స్పష్టంగా కనిపిస్తాయి. మరో విషయం ముద్దాయికి వసుంధర ఒకర్తె యింట్లో వుందని తెలుసు. అలాంటప్పుడు తలుపు తట్టి ఏదో నెపంమీద లోపలకి ప్రవేశించవచ్చు. బాల్కనీలో నుండి ఎక్కవలసిన అవసరం ఏమిటి? ఇలా ఎక్కినప్పుడు వసుంధర చూడటానికి అవకాశం వుంది. ఏమంటారు?"

"నేను 5-8 లోపు అన్నాను కాస్త ప్రొద్దుపోయాక వుండవచ్చు."

"గుడ్ అలాంటప్పుడు వసుంధర యింట్లో లైట్లు వెలిగాయా?"

"లేదు. వెలగలేదు."

"దీపాలు వెలగలేదంటే, వసుంధర వెలిగించలేదన్న మాట, వెలిగించలేదంటే వసుంధర అప్పటికే చచ్చిపోయింది. దీనినిబట్టి హత్య జరిగింది పగలు అని నిర్ణయించాలి."

ప్రాసిక్యూటర్ గబాలున లేచి "ఇనస్పెక్టర్ ఐదు గంటలకు వచ్చిన మనిషి, ఎనిమిది గంటలవరకు యింట్లోనే ఉండివుండొచ్చు కదా! తను యింట్లోనుండి బయటకు వెళ్ళేటందుకు అవకాశం లేక, లేదా మరెవరయినా చూస్తారేమోనన్న భయంతో ఆగి వుండచ్చు కదా!"

"అఁ అలా జరిగి ఉండవచ్చు."

"అంటె మూడుగంటలు ఆ ఇంట్లో నే ఉండి, చీకటిలో కూడా బయటకు వెళ్ళలేని ముద్దాయి అన్నమాట."

"అవును."

"అలాంటి వ్యక్తి పగలు ఎలా రాగలిగి వుంటాడు."

ఇనస్పెక్టర్ తటపటాయించాడు. "హత్య జరిగాక అభిప్రాయం మారివుండొచ్చు."

"హంతకుడు ఎన్నిగంటలకు లోపలకు వెళ్ళానని చెప్పాడు."

"పదకొండు గంటలయిన తరువాత. అది యధార్థం కాదు ఒకరకమయిన కట్టు కథ" ఇనస్పెక్టర్ కోపంగా అన్నాడు. "గదిలో అన్నిచోట్ల వేలిముద్రలు స్వీకరించారు కదా!" పి. జె. ప్రశ్న.

"అవును."

"పైభాగంలో క్రిందభాగంలో ముద్దాయి వేలిముద్రలున్నాయా?"

"పైభాగంలో ఉన్నాయి. క్రిందభాగంలో లేవు. కాని అతడు వెలిగించిన అగ్గిపుల్ల ఉంది. అంటె క్రింద భాగంలో వేలిముద్రలు పడకుండా జాగ్రత్తపడ్డాడు అని చెప్పవచ్చు."

"గుడ్. ఆ యింట్లో రివాల్వర్ ఎక్కడుంది?"

"మధురాధర్ గదిలో సొరుగులో ఉండేదట."

"ఆ గది పైభాగంలో ఉంది కదూ!"

"అవును."

"పైభాగంలో ఉన్న రివాల్వర్ వసుంధర తీసుకుందా? లేక ముద్దాయి తీసుకొని వుండాలా?" పి. జె. ప్రశ్న.

"సారీ చెప్పలేను."

"ఏది ఏమయినా వసుంధర దగ్గరలో ఉండే అవకాశం లేదు. కాబట్టి, ముద్దాయి రివాల్వర్ తీసుకువచ్చి ఉండాలి."

"అవును."

"ఎక్కడనుండి?" పి. జె. ప్రశ్న.

"అడగలేదు. అడిగినా చెపుతాడనే నమ్మకంలేదు కాబట్టి అడగలేదు."

"అందుకే రివాల్వర్ పూర్వాపరాలు దర్యాప్తు చెయ్యలేదు."

ఇనస్పెక్టర్ మౌనంగా వున్నాడు.

"చివరసారిగా ఒక ప్రశ్న. రివాల్వర్ కాల్చటానికి గురి అవసరమా?" పి. జె. కు తెలిసి ప్రశ్న అడిగినందుకు చిరాకు కలిగింది.

"అవసరమే."

"ఎవరయినా రివాల్వర్ ఎదురు ఉంచి కాల్చబోతుంటే ఏంచేస్తారు?"

"పారిపోతారు. లేదా అరుస్తారు."

"గుడ్ వసుంధర దగ్గరనుండి రామకృష్ణ మాయో పాయంగా రివాల్వర్ కాజేశాడనుకుందాం. ఆ రివాల్వర్ తో వసుంధరను కాల్చ ప్రయత్నించాడు. అప్పుడు వసుంధర వీలింగ్ చైర్ తో పారిపోతుంది. తప్పించుకోటానికి ప్రయత్నిస్తుంది. కాని కాల్చు అన్నట్లు ముద్దాయికి ఎదురుగా ఉండదు కద."

పి. పి. చివాలున లేచి "పారిపోయే అక్కడ ఆగి ఉండొచ్చు."

"హత్య జరిగింది హాలు మధ్య. వసుంధర పారిపోటాని ప్రక్కనే గది ఉంది. పోతే ముద్దాయి రివాల్వర్ కాల్చే టప్పుడు వసుంధర ఎదురుగా ఉండటానికి అవకాశంలేదు. పోని దూరంనుండి కాల్చాడా? అంటె అంత గురి ముద్దాయికి ఉందా అన్నది ప్రశ్న. చెప్పండి ఎలా కాల్చి ఉంటాడు?"

"రివాల్వర్‌తో కాల్చి ఉంటాడు. అంతకంటె చెప్ప లేను" విసుగ్గా అన్నాడు.

పి. జె. నవ్వి "దట్సాల్ యువర్ ఆనర్," అన్నాడు.

ప్రాసిక్యూషన్ తరువాత సాక్షిగా పాథాలజిష్టు విట్నెస్ బాక్సులో నిలబడి ప్రమాణం స్వీకరించాడు. వసుంధర హత్య చేయబడి గదిలో వేలిముద్రలు పరీక్షించా నని, అవి రామకృష్ణ వేలిముద్రలని, హతురాలి శవం తలలో కాలిబర్ బుల్లెట్ పేల్చబడిందని, అది .38 అని, అది ఆమె చేతిలోనున్న రివాల్వర్ నుండి కాల్చబడిందని, వివరించి చెప్పాడు.

"క్రాసు చేసుకోవచ్చు."

పి. జె. నిలబడి పాథాలజిష్టు దగ్గరకు నడిచాడు. "చూడండి. రివాల్వర్ పేలిన శబ్దం ఎంతదూరం వినిపించ వచ్చు."

"అది ప్రాంతాన్ని బట్టి, గది వైశాల్యాన్ని బట్టి ఉంటుంది. ఆ ఇంట్లో ఓ వందగజాల దూరం వినిపించే అవకాశం ఉంది."

"రివాల్వర్ కాల్చిన మనిషి గురి తెలిసినవాడయి వుండాలా?"

"అవును. మరి ఐదు, ఆరు అడుగులదూరంలో తప్ప దూరంనుండి కాల్చినప్పుడు గురి తప్పక అవసరం."

"నో క్వశ్చన్ యువర్ ఆనర్" అన్నాడు పి. జె.

ప్రాసిక్యూషన్ తరువాత సాక్షిగా శవాన్ని మార్చురి చేసిన డాక్టర్ విట్నెస్ బాక్సులో నిలబడి ప్రమాణం స్వీకరించి, ఉద్యోగార్హతల్ని తెలియచేశాడు. "డాక్టర్ వసుంధర శవాన్ని పరీక్షించారు కదా వివరాలు తెలియ చేయగలరా?"

"వసుంధర అనే అమ్మాయి తలలో రివాల్వర్ బుల్లెట్ ఉంది. అంటె రివాల్వర్ గుండు దెబ్బ తగలటంతోనే ప్రాణంపోయి ఉండాలి. పుర్రె చిట్లి మెదడులో దూరి పోయింది. ఆమె అరవటానికి అవకాశం లేదు."

"డాక్టర్! ఆమె స్పయిన్ ఇంజరీ పేషంటా?"

"అవును. ఆమె స్పైనల్ కార్డ్ దెబ్బతింది. అందుకే నడవలేదు."

"మీరు శవాన్ని చూసినపుడు శవం ఎలా ఉంది?"

"వీలింగ్ చైర్ నుండి క్రిందపడి ఉంది. అంటె రివాల్వర్ దెబ్బకు మనిషి పూర్తిగా ప్రక్కకు వాలిపోయినపుడు కుర్చీ ప్రక్కకు పడిపోయి ఉండాలి. అంతకు తప్ప వివరాలు తెలియవు."

"క్రాసు చేసుకోవచ్చు" పి. జె. లేచి డాక్టర్ దగ్గరకు నడిచి డాక్టర్ని చూస్తూ, "డాక్టర్! ఆమె పేషంటు హత్యకు ముందు ఆమె భోజనం తీసుకొని వుంటుందా?"

"లేదు బిస్కెట్స్, టి తీసుకుంది. అప్పుడు సమయం 4 గంటలు అయివుండవచ్చు."

"దీనినిబట్టి ఆమె హత్య ఐదు, ఆరు మధ్య జరగటానికి అవకాశం ఏమయినా ఉందా?"

"అలాగే జరిగి ఉండాలి."

"రివాల్వర్ దగ్గరనుండి కాల్చి ఉంటాడా? దూరం నుండి కాల్చాడా?"

"తగిలిన గాయాన్నిబట్టి దగ్గరనుండే కాల్చాడు."

"కాల్చిన తరువాత రివాల్వింగ్ చైర్‌లోనుండి హతురాలు క్రింద పడిపోటానికి అవకాశం వుందా?"

"అంటే హతురాలు కాస్త బలంగల మనిషి కాబట్టి

పూర్తిగా ఒక ప్రక్కకు ఒరిగిపోతే క్రింద పడిపోయే అవకాశం ఉంది, అది హాతురాలు ప్రాణం పోయినపుడే జరిగి ఉండాలి.''

''చివరసారిగా ఆమెను ముద్దాయి బలాత్కరించినట్లు, లేదా కలయబడ్డట్లు సూచనలేమయినా ఉన్నాయా?''

''లేవు. అలాంటి ప్రయత్నాలుకూడా జరగలేదు.''

''దట్సాల్ యువర్ ఆనర్.''

కేసు మరునాటికి వాయిదా పడింది.

## 4

మధురాధర్ ఒంటరిగా కూర్చుని ఒక్కొక్క పెగ్ బ్రాంది త్రాగుతూ చిప్స్ చప్పరిస్తున్నాడు. అంతలో టాక్సీ దిగి దగ్గరకు వచ్చాడు పి. జె.

''హల్లో! మీ వాదన వింటుంటే విస్తుపోయాను. హంతకుల్నికూడా నిర్దోషులుగా నిరూపించే శక్తి, సామర్థ్యాలు మీకున్నాయి.''

పి. జె. నవ్వాడు. ''ఉన్నా అలాంటి పని భారతదేశంలో పుట్టిన నీతిమంతుడయిన మానవుడు చేయడు. మీతో ఒక విషయం మాట్లాడాలని వచ్చాను. కాని...'' సందేహించాడు. ''ఫరవాలేదు మిస్టర్ పి. జె. త్రాగినంత మాత్రంలో తారుమారుగా సమాధానం చెప్పను.''

మధురాధర్‌కు ముప్పైఐదేళ్ళు వుంటాయి. అందంగా, హుందాగా వున్న యువకుడు. విలాసపురుషుడు, ఆగర్భ శ్రీమంతుడు కాకపోయినా నడమంత్రపు సిరితో వెలిగిపోతున్న మనిషి. అతని అందం చూసే వసుంధర ప్రేమించి పెళ్ళి చేసుకుంది అనుకున్నాడు.

''మీరు మద్రాసు ఎప్పుడు వెళ్ళారు?''

"నవంబరు 20 తేది రాత్రి మెయిల్‌కు వెళ్ళాను. తిరిగి 22 తేది ఉదయం 8-30 గంటలకు సర్కార్‌లో వచ్చేశాను. అప్పటికే యిల్లంతా కోలాహలంగా వుంది.",

"మీరు మద్రాసులో ఎక్కడ వున్నారు?"

"ఎలిబికోసమా? డిఫెన్స్ విట్నెసులు దొరకలేదేమో" హేళనగా నవ్వి "స్వరూప్ హోటల్ రూం నెంబరు 36. పోతే ఆ రోజు రాత్రి 5 గంటలకు మా సంస్థ టెక్నిషియన్లకు పార్టీ చేశాను. పార్టీ ముగిసేసరికి 9 గంటలయింది. ఆ తరువాత సర్కార్‌లో బయలుదేరాను."

"మీరు వెళ్ళేముందు మీకు, మీ భార్యకు అభిప్రాయ భేదాలు ఏమన్నా వున్నాయా?"

"అవును. వెళ్ళేముందు నిడమానూరు పెళ్ళికి వెళ్దామంది. కాని నేను అంగీకరించలేదు. గోరంతను కొండంతగా చేసి మాట్లాడింది. అయినా ఆ మాటలు లక్ష్య పెట్టుకోకుండా వెళ్ళిపోయాను."

"మీరు అంత అర్జంటుగా మద్రాసు వెళ్ళిన కారణం?"

"పెళ్ళికి వెళ్ళకూడదనే అభిప్రాయంతోనే. దానికి కారణం చెప్పమంటారా? నో అది మా కుటుంబ విషయం" సిగరెట్టు వెలిగించి ఒకటి పి. జె. కి అందించాడు. "నో. థాంక్స్." క్షణం ఆగి "మీ యింట్లో నౌకరు రామయ్య ఎలాంటివాడో తెలుసా?"

"తెలుసు. వాడికి త్రాగుడొకటి తప్ప, అన్నీ మంచి లక్షణాలే. అందుకే వాడిని నౌకరుగా యిన్నాళ్ళు వుంచగలిగాము."

పి. జె. ఆలోచించాడు. "ఓ. కె. వస్తాను. అన్నట్లు ఇందిర ఎక్కడ వుంది?" అడిగాడు.

"బహుశా పైన చదువుకుంటుందేమో."

గదిలో ఇందిర ఒంటరిగా కూర్చొని వసుంధర ఫోటోను చూస్తూ ఆలోచిస్తూంది. పి. జె. ను చూశాక "మీరా... రండి" అంది. పి. జె. కూర్చున్నాడు.

"ఒక ముఖ్యమయిన విషయం నీవు చెప్పాలి?"

"ఏమిటది? అడగండి."

"హంతకుడు రామకృష్ణ కాకపోతే మరెవరో కావాలి. ఆ అవకాశం మీ నలుగురికే వుంది. ఆ నలుగురు మధురాధర్, నీవు, మీ అమ్మ, నౌకరు రామయ్య. మీ అమ్మ పెళ్ళిలోనే వున్నట్లు నీకు తెలుసా?"

"ముహూర్తం రాత్రి 8-40 నిమిషాలకు. సాయంకాలం 4 గంటలనుండి మా అమ్మ దుర్గ కనిపించలేదు. ఎక్కడకు వెళ్ళిందో కూడా తెలీదు. నేను అడగలేదు."

"మీ అమ్మ వసుంధరపై ప్రేమగా వుంటుందా?"

"నాకా నమ్మకంలేదు. ప్రేమగా వున్నట్లు నటిస్తుంది."

పి. జె. నిట్టూర్చాడు. నౌకరు రామయ్య గురించి మీ అభిప్రాయం."

"వాడొక త్రాగుబోతు. అయినా మా యింట్లో ఎప్పుడూ తప్పుడు పనులు చేయలేదు. నమ్మకమయిన మనిషి."

"మీ అమ్మగారు ఎక్కడ వుంది?"

"గార్డెన్ లో వుంది" అంది. పి. జె. ఆమె దగ్గరనుండి బయలుదేరి గార్డెన్ లోనికి వెళ్ళాడు. దుర్గ ఒంటరిగా కూర్చొని భగవద్గీత చదువుతూంది. పి. జె. ను చూసి నమస్కరించింది.

"మీరు అనవసరంగా శ్రమ పడుతున్నారు. రామకృష్ణ హంతకుడు."

పి. జె. నవ్వాడు. "మీరు చూశారా?"

ఫొటో చూశాడు. అది న్యూడ్ ఫొటో. నిశితంగా చూస్తే తప్ప ఆకారం పోల్చలేము. అది ఇందిర ఫొటో.

పి. జె. సిగరెట్ వెలిగించాడు. ఫొటోనే చూస్తూ అన్నాడు. "ఇది ఇందిరకు తెలియకుండా తీసిన ఫొటో. తెలుస్తూనే వుంది. ఇది మినియేచర్ కెమెరాతో తీసింది."

"అవును, రామయ్యకు ఎలా వచ్చింది?"

"ఏది ఏమయినా మిస్టర్ ధర్మ. ప్రతి మనిషికి ఎలిబీ వుంది. వీళ్లు ఎలిబీలు సృష్టించుకున్నారా? లేక వాస్తవమా అన్నది పరిశోధించాలి."

"అలాగే సర్."

"మద్రాసు హోటల్ స్వరూప్‌లో మధురాధర్ వుండటం, దుర్గ పెళ్ళికి వెళ్ళి 5 గంటలనుండి 8 గంటల వరకు ఎక్కడికి వెళ్ళింది. ఇందిర ఎక్కడ వుంది? రామయ్య పూర్వాపరాలేమిటి నిశితంగా ఆలోచించాలి. డిఫెన్స్‌లో ప్రత్యేకమయిన సాక్ష్యాలు మనకు లేవు. సాధ్యమైనంత తొందరలో యీ విషయాలు పరిశోధించాలి."

"ఓ. కె. సర్" అసిస్టెంట్ ధర్మ అన్నాడు. "ఇప్పుడే మద్రాసు బయలుదేరుతాను" అన్నాడు.

మర్నాడు సాయంత్రం ధర్మ మద్రాసునుండి ఫోన్ చేసి చెప్పాడు. హత్య జరిగిన రోజంతా మధురాధర్ మద్రాసులోనే వున్నట్లు గట్టి ఎలిబీ వుందని, పైగా హత్యాసమయంలో ఒక పార్టీలో ఎందరో ప్రముఖుల మధ్యన వున్నాడని చెప్పాడు ధర్మ. పి. జె. ఏవో మరి కొన్ని ఆదేశాలిచ్చి ఫోన్ పెట్టేశాడు.

# 6

ప్రాసిక్యూషన్ తరువాత సాక్షిగా మధురాధర్ విట్నెస్ బాక్స్‌లో నిలబడి ప్రమాణం చేశాడు. "మిస్టర్ మధురా

ధర్ మీరు మీ భార్యను ఎప్పుడు చూశారు?"

"నవంబరు 20 తేది మద్రాసు వెళ్ళేముందు చూశాను" అన్నాడు మధురాధర్.

"మీ యిద్దరికి మనస్పర్ధలున్నాయా?"

"ఉన్నాయి. కాని అవి సహజం. ఆత్మహత్యకు దారి తీసేటంత విచిత్రమయినవి కావు. చాలా కుటుంబాలలో సామాన్యంగా వుండేవి."

"ఈ పిస్తోలు చూడండి. ఇది ఎవరిది?"

"నాదే. అక్టోబరు 16 తేదీన నా చేతికి రావటం జరిగింది."

"ఈ పిస్తోలు మీ యింట్లో ఎక్కడ వుంటుంది?"

"పై భాగంలో నా గదిలో వుంటుంది."

"క్రాసు చేసుకోవచ్చు" పి. పి. అన్నాడు.

పి. జె. లేచి "మిస్టర్ మధురాధర్ మీకు శత్రువు లున్నారా?"

"లేరు."

"మరి మీకు రివాల్వర్ అవసరం ఏమిటి?"

"ఆదో సరదా!"

"మిస్టర్ మధురాధర్! మీ ఆస్తి యావత్తు వసుంధర పేర ఉంది. మీ దగ్గర డబ్బు వుండదు. మీకు శత్రువులు లేరు. పిట్టలు కొట్టటానికి గన్స్ అందుబాటులో వుండగా రివాల్వర్ ఎందుకు తెప్పించారు?"

"అబ్జక్షన్ యువర్ ఆనర్! సాక్షికి రివాల్వర్ అవసరం ఏమిటి? ఎందుకు? అన్నది ప్రశ్న కాదు. వసుంధర కోరి ఉండొచ్చు."

"నో యువర్ ఆనర్! వసుంధర, రివాల్వర్ వద్దనటం దానివల్ల యింట్లో వాగ్వాదం జరగటంకూడా జరిగింది.

కాబట్టి ఎలాంటి దృక్పథంతో రివాల్వర్ తెప్పించాడన్నది ప్రశ్న?"

"చెప్పండి, మిస్టర్ మధురాధర్?" జడ్జి ప్రశ్న.

"ఆత్మరక్షణార్థం తెప్పించాను. మా బంగళా ఊరుకు చివరలో వుంది. దొంగల, హంతకుల బారినుండి రక్షించుకోనేందుకు వీలుగా ఉంటుందని తీసుకున్నాను."

న్యాయమూర్తి వ్రాసుకున్నాడు. "ఈ రామకృష్ణను మీరు యిదివరలో యెప్పుడయినా, యెక్కడయినా చూశారా?"

"లేదు."

"దట్సాల్ యువర్ ఆనర్!" అన్నాడు పి. జె.

ప్రాసిక్యూషన్ తరువాత సాక్షిగా ఇందిర విట్నెస్ బాక్సులో నిలబడి ప్రమాణం చేసింది.

"చూడమ్మా, మీ యింట్లో హత్య జరిగింది. హత్యకు ముందు మీ అక్క వసుంధరను ఎప్పుడు చూశావు?"

"పెళ్ళికి వెళ్ళేముందు నవంబరు 21 ఉదయం తొమ్మిది గంటలకు మా అక్క సాగనంపింది."

"మీ అమ్మ, నీవు యిద్దరు వెళ్ళారా?"

"అవును."

"తిరిగి యెప్పుడు వచ్చారు?"

"నవంబరు 22 తేది ఉదయం వచ్చాం. మా అక్క ఎంతకూ తలుపు తీయకపోవటంతో రిపోర్టు యిచ్చాం."

"క్రాసు చేసుకోవచ్చు" పి. పి. అనటంతో పి. జె. నిలబడి ఇందిరను "చూడమ్మా, మీ అక్క తలుపు తియ్యలేదు. కారణం నీకు తెలీదు. కాని నీవు హత్య జరిగిందని ఫోన్ చేశావు? అది యెలా ఊహించావు?"

"దానికి కారణాలు రెండు. ఒకటి పెళ్ళికి ముందు మా అమ్మకు, అక్కకు డబ్బు విషయంలో సంఘర్షణ జరగటం, మా అమ్మవల్ల మా అక్క మనసు చికాకుపడటం జరిగింది."

"సంఘర్షణ అంటే యెలాంటిది?"

"పెళ్ళి ఖర్చుల నిమిత్తం మా అమ్మ రెండువేలు కావాలంది. అంతేకాకుండా మా అమ్మ అవి, ఇవి అని చాలా డబ్బు వాడటం జరిగింది. ఆ దృష్ట్యా అక్క డబ్బు ఇవ్వనంది. దానితో యిద్దరిమధ్య ఘర్షణ జరిగి, మా అమ్మ చనిపోయిన మా నాన్నను తిట్టిపోసింది."

"ఎందుకు?"

"ఆస్తి యావత్తూ వసుంధర పేర పెట్టినందుకు."

"రెండో కారణం ఏమిటి?"

"మా బావకు, మా అక్కకు భేదాభిప్రాయాలు చాలా వున్నాయి.మా అక్కయ్య బావ ఎవరెవరితోనో సంబంధం పెట్టుకున్నాడని బాధ పడుతుంది. అంతేకాకుండా బావ డబ్బుకావాలి అని ప్రతిసారి అడగటంతో మనసు వికలమై ఆత్మహత్య చేసుకుందేమో అనుకున్నాను."

"ఆ అభిప్రాయంతోనే ఫోన్ చేశారా?"

"అవును" అంది ఇందిర.

"దట్సాల్ యువర్ ఆనర్."

ప్రాసిక్యూషన్ తరువాతసాక్షిగా రామయ్యను కోర్టువారి అనుమతితో పిలుస్తున్నాను, అనటంతో రామయ్య విట్నెస్ బాక్స్‌లో నిలబడి ప్రమాణం స్వీకరించాడు.

"రామయ్యా, చివరసారిగా మీ అమ్మగార్ని ఎప్పుడు చూశావు?" అడిగాడు పి. పి.

"నాలుగు గంటలకు ఇంటికి వెళ్ళుతూ చూశానండి. అమ్మగారు స్నేహితురాలు మంజులత వచ్చింది. ఆ రాత్రి

ఆమె అక్కడ వుంటానంది. సరే అని చెప్పి నేను వెళ్ళి పోయాను."

"నీవు వెళ్ళేటప్పుడు మీ అమ్మగారేం చేస్తున్నారు?"

"మంజులత అమ్మగారితో మాట్లాడుతున్నారు."

"క్లాసు చేసుకోవచ్చు."

పి. జె. ఆలోచించాడు మంజులత ఎవరు? ఏ ఒక్కరు ఆమెగురించి యిప్పటివరకు చెప్పలేదు.

"రామయ్యా మీ అమ్మగారయిన వసుంధర గురించి ఏమయినా చేస్తావు కదూ?"

"ఏమైనా చేస్తాను."

"ఏమయినా చేసేవాడివి మంజులత అనే అమ్మాయి గురించి యిప్పటివరకు నీవు చెప్పక పోవటంలో నీ అభి ప్రాయం."

"చెప్పవద్దని బ్రతిమిలాడింది. అందుకే చెప్పలేదు. యిప్పుడు ప్రమాణం చేశానుకదా, అబద్ధం [redacted]కూడ దని."

"రామయ్యా నీకు జీతం ఎంత? ఎప్పుడిస్తారు?"

"ఎప్పుడు అమ్మగారు కరక్టు 1వ తారీకు యిస్తారు. నెలకు నూట పాతికరూపాయలు, భోజనం."

"హత్య జరిగిన సమయంలో నీవు ఎక్కడ వున్నావు?"

"ప్రసాద్ సారా కొట్లో త్రాగి వున్నానండి."

"ప్రమాణం చేసి అబద్ధం చెపుతున్నావు, నిజం చెప్పు."

రామయ్య కంగారుపడ్డాడు "లేదు నిజం."

"కాదు అబద్ధం. 1వ తేది నీకు జీతాలు. 21వ తేదీ నీవు తాగింది. అప్పటివరకు నీ దగ్గర డబ్బు లున్నాయా?

పైగా ఆ రోజు నీవు ప్రసాద్ కొట్లో లేవు. ఎక్కడ వున్నావో చెప్పు?"

"తప్పు చెప్పాను. తాగి యింట్లో పడుకున్నానండి."

"అబ్జక్షన్ యువర్ ఆనర్! సాక్షిని అనవసరమైన ప్రశ్నలతో విసిగించటం అసమంజసంగా వుంది."

"నో యువర్ ఆనర్! సాక్షి ఎలిబి కరెక్టు కాదు. ఎవిడెన్స్ సరైన విధంగా లేదు. కాబట్టి యితనితో యథార్థమే చెప్పిస్తున్నాను. కాని హంతకుడని అనుమానించింది కాదు. మంజులత గురించి యధార్థం చెప్పిన యీ సాక్షి తన గురించి యధార్థం ఎందుకు చెప్పడు."

"అభ్యంతరం త్రోసిపుచ్చుతున్నాను."

"చెప్పు రామయ్యా యింట్లో నే ఏం తాగావు?"

"బ్రాంది."

"ఎక్కడిది?"

"మధురాధర్ బాబు యిచ్చాడు."

"ఎందుకు?"

"మిగిలిపోయింది తీసుకు వెళ్ళమన్నాడు."

"ఇదివరలో ఎప్పుడైనా అలా యిచ్చాడా?"

"లేదు."

"యిప్పుడు నీవు అడిగావా?"

"లేదు."

"ఇప్పుడు ప్రత్యేకించి యివ్వటంలో అతని ఉద్దేశం ఏమయి వుంటుందో వూహించి చెప్పగలవా?"

"తెలీదు." బిక్కముఖం వేశాడు.

"దాట్సాల్ యువర్ ఆనర్."

కేసు వాయిదాపడింది.

పి. జె. కోర్టులోనుండి బయటకు వస్తూనే మంజులత గురించి ఆలోచించాడు. యీమె యిప్పటివరకు తెర మరుగున ఉన్న మనిషి. యీమె ద్వారా డిఫెన్స్ విట్నెస్ నడపవచ్చు.

"నమస్కారమండి" అంటూ ఒకతను వచ్చాడు.

అతడి వయసు నలభైకి పైగా వుంటాయి. ఖద్దరు లాల్చి పంచె రిమ్‌లెస్ కళ్ళద్దాలు. చూపులకు శ్రీమంతుడులా వున్నాడు.

"నమస్తే" కారు ఎక్కబోయి ఆగాడు.

"మీకోసం యిప్పటివరకు వేచి ఉన్నాను."

"ఏం కావాలో చెప్పండి."

"మా అమ్మాయి మంజులత రాత్రి మొదటి ఆట సినిమాకి వెళ్ళింది. ఇంతవరకు రాలేదు. ఎవరయినా స్నేహితురాలి యింటికి వెళ్ళిందేమో అనుకున్నాను. ఎక్కడా లేదు. నాకు ఒక్కటే భయంగా వుంది. నా కూతుర్ని కాపాడండి."

పి. జె. "చూడండి మీరేమి ఆందోళన పడవద్దు. మీ అమ్మాయిని వెదికి అప్పగించే బాధ్యత నాది." భుజం తట్టాడు.

"చూడండి, వసుంధర అనే అమ్మాయి దగ్గరకు మీ అమ్మాయి తరచు వెళ్ళేదా?"

"వెళ్ళేదండి. మా అమ్మాయికి సినిమాల్లో చేరాలనే ఉబలాటం చాలా ఎక్కువ. వసుంధర ద్వారా సినిమాల్లో చేరాలని తాపత్రయపడేది. వసుంధర మా అమ్మాయి విషయంలో శ్రద్ధగా వుండేది. ఫస్ట్ క్లాసులో పాసవమని అలా పాసయితే వేషం యిస్తాననేది. ఆ మాటలు నమ్మి మా అమ్మాయి చాలా శ్రద్ధగా చదివేది."

"ఆమె హత్య తరువాత ఆమె గురించి ఏమయినా చెప్పిందా?"

"లేదండి. కాని మనిషి అదోలా వుండేది. అప్పుడప్పుడు ఉలిక్కిపడుతూ ఉండేది. నేనంతగా పట్టించుకోలేదు."

"సరే మీరు ధైర్యంగా ఉండండి. నా శాయశక్తులా ప్రయత్నిస్తాను."

అతను గబగబ జేబులోనుండి డబ్బు తీశాడు.

"ప్రస్తుతం వద్దండి. ఇప్పుడు వాదిస్తున్న కేసులో ఆమె సాక్ష్యం అవసరం కావచ్చు. ప్రయత్నిస్తాను."

పి. జె. కారులో బయలుదేరాడు. ఇప్పటికి ధర్మ వచ్చి ఉండాలి. డిఫెన్స్ సాక్ష్యంగా ఏమయినా సంపాదించాలేమో ఆలోచిస్తూ సిగరెట్టు వెలిగించాడు. అనుమానితులు ఒక్కొక్కరే గుర్తుకు వస్తున్నారు. దుర్గ, రామయ్య, మధురాధర్ బాబు, ఇందిర, మంజులత, వీరిలో హంతకు డెవరు?

ఇంటి ముందు పోర్టికోలో కారాగింది.

## 7

"నమస్తే" పి. జె. తలెత్తి చూసాడు.

నలభై ఐదేళ్ళ పల్లెటూరి రైతులా ఉన్నాడు. క్రొత్త ముఖం అతన్నెప్పుడు పి. జె. చూడలేదు. "మిమ్మల్ని యిదివరలో చూడలేదు. ఇదే మిమ్మల్ని చూడటం. మీరు నమ్ముతానంటే ఒక నిజం చెపుతాను."

"కూర్చోండి. ఏమిటది?"

"దుర్గ, వసుంధర తల్లిగురించి చెప్పటానికి వచ్చాను."

"ఏమిటది?" కుతూహలంగా అడిగాడు.

"దుర్గ భర్త చనిపోకముందు నా ప్రేమికురాలు. భర్త చనిపోయాక ఎప్పుడో అరుదుగా ఆమె నాకు తటస్థ పడటం ఏకాంతంగా కొన్ని గంటలు గడపటం జరుగు తుంది. అదృష్టవశాత్తు ఆమె పెళ్ళికి రావటంతో ఇద్దరిలో కోర్కె పెరిగిం దనటంలో సందేహం లేదు. అందుకే ఆమెను తీసుకొని ఇందిరకు తెలియకుండా మా కొబ్బరి తోటలో గడపటం జరిగింది. ఈ విషయం చెపుతున్నం దుకు సిగ్గుపడుతున్నాను."

పి. జె. నవ్వాడు "ఫర్వాలేదు చెప్పండి."

"ఇలా నాతో గడిపిన విషయం ఏ ఒక్కరికి తెలియక పోవటం, వసుంధర అదే సమయంలో చనిపోవటం, మీరు ఆమెను అనుమానించటంతో దుర్గ కంగారుపడుతుంది. మీరు డిఫెన్స్ సాక్షిగా ఆమెను వివరాలడిగితే ఏం చెపు తుంది."

పి. జె. తలూపాడు.

"న్యాయం గురించి, చట్టం గురించి నాకు తెలుసు. మీ గురించి నాకు తెలియక పోయినా దుర్గ మీ గురించి చెప్పినదాన్నిబట్టి చాలా సమర్థు లనుకున్నాను. మీరు పూనుకుంటే నిజం బ్రద్దలవుతుంది. నేను చెప్పినందువల్ల నాకు లాభించేది ఏమీ లేదు. నష్టంకూడా లేదు. ఈ నష్టం దుర్గది కాబట్టి మీరు ఆలోచించి చేయండి. నేను చెప్పేది యధార్థం, యధార్థం అని ఋజువు చేయలేను. ఆపై మీ యిష్టం" గంభీరంగా, హుందాగా అన్నాడు.

పి. జె. కొన్ని క్షణాలు ఆలోచించాడు. "అలాగే మీ మాటలు నమ్ముతున్నాను. వెళ్ళిరండి."

"చాలా సంతోషం. వస్తాను. అవసరమయితే మళ్ళీ కలుస్తాను" అంటూ లేచాడు.

"ఒక్క మాట. మీరు మధురాధర్ బాబుకి తెలుసా?" పి. జె. ప్రశ్న.

"అతను నాకు తెలుసుగాని. నేను అతనికి తెలీదు." తర్వాత అతను వెళ్ళిపోయాడు.

# 8

"హల్లో పి. జె. రండి రండి, ధర్మకూడా వచ్చారే. మిమ్మల్ని చూస్తుంటే జాలేస్తుంది" క్రైంబ్రాంచి ఇనస్పెక్టర్ విజయ్ అన్నాడు.

పి. జె. ఎదురుగా కూర్చొని సిగరెట్టు వెలిగించి "ఎందుకో" అన్నాడు.

"మీకు యింతవరకు అపజయం లేదు. కాని ఒక అనామకుడి కేసు తీసుకొని అపజయం పాలవుతున్నారు."

"అలాగే అనుకోండి. మంజులత గురించి దర్యాప్తు చేస్తున్నారా?"

"ప్రయత్నిస్తున్నాను. వాళ్ళ నాన్న రిపోర్టు వ్రాసి యిచ్చాడు."

"ఆమె ఎక్కడుందో తెలుసుకోవటం అవసరం."

"అంటే యీ కేసు ఉపసంహరించుకున్నారా?"

"లేదు. ఆమె లేకపోతే కేసు వాయిదాపడుతుంది" పి. జె. అనటంతో వింతగా చూశాడు. "అవును. ఆమెను యీ కేసులో డిఫెన్స్ సాక్షిగా కావాలని ఖచ్చితంగా మీరు ప్రవేశపెట్టాలి. ఆ విషయం గుర్తుంచుకొని దర్యాప్తు చేయండి. ఎందువల్లనంటే ముద్దాయికి ముందు హతురాల్ని చివరసారిగా చూసింది ఆమె అని విట్నెస్ వుంది కాబట్టి."

"అంటే ఆమె హత్య చేసిందనా?"

"నో. హత్య చేసిన మనిషే ఆమెను మాయం చేశారు. అంటే హత్య గురించి ఆమెకు తెలిసి వుండాలి. ఆమెకు తెలుసు కాబట్టి కోర్టుకు వచ్చే అవకాశం యివ్వలేదు."

"యిప్పుడు నన్నేం చెయ్యమంటారు?"

"హంతకుడ్ని అనుసరించాలి."

"ఎవరు? మీకు తెలిస్తే చెప్పండి కేసు నేనే ఉప సంహరించుకుంటాను." అన్నాడు ఇనస్పెక్టర్ విజయ్.

పి. జె. నవ్వాడు. "నేను చెపితే మీరు నమ్ము తారా?"

"తప్పనిసరిగా నమ్ముతాను. చెప్పండి ఎవరు?"

"మధురాధర్." ఇనస్పెక్టర్ విస్తుపోయాడు. "అతను మద్రాసులో వున్నట్లు ఎలిబీ వుంది. అది అబద్ధమా?"

"అది నిజమే. అతను మద్రాసులో వున్నాడు."

"మద్రాసులో ఉన్న మనిషి విజయవాడలో ఎలా హత్య చేశాడు. ఎవరి చేతనయినా చేయించాడా?"

"లేదు. తనే చేసి వుండాలి."

"నాకు మతిపోతూంది. ఏమిటి మీరనేది?"

"ముందు మంజులతను పట్టుకోడానికి ప్రయత్నించండి. తరువాత వివరిస్తాను. యీ రాత్రికే ఏర్పాటు" పి. జె. కదిలాడు.

## 9

చలిగాలి తెరలుగా వీస్తుంది. రాత్రి పది గంటలు దాటింది. ఎవరూ వస్తున్న జాడలేదు. అందరికీ కాస్త అసహనం కలిగింది.

పోర్టికో తలుపు తెరిచాడు మధురాధర్. పోర్టికోలో నుండి కారు బయలుదేరింది.

మధురాధర్ కారు వేగంగా పోతోంది. ఇనస్పెక్టర్ విజయ్ కారు దానిని అనుసరిస్తోంది. అంతకంటె వేగంగా ధర్మ కారు పోతూంది. బందరు రోడ్ అది.

ఆంధ్ర జ్యోతి ఆఫీసు దాటింది, తమలపాకు తోట, యింకా పైగా కొంత దూరంలో బెంజ్ కంపెనీ రింగ్ రోడ్ సెంటర్ దాటుతూ వుండగా ధర్మ కారు దూసుకొని మధురాధర్ కారుకంటె ముందుకు వెళ్ళింది. పడమట లంక, ఇండస్ట్రియల్ ఎస్టేట్ దాటి ముందుకు సాగింది.

రవీస్ కాలువ ఒడ్డు వెంట కొంత దూరం వెళ్ళాక పోరంకి సమీపంలో ధర్మ ఆగాడు. వెనుక కారు లేదు, రాలేదు. విజయ్ కారు ధర్మ కారును సమీపించింది. "ఏడి" పి. జె. అడిగాడు కారు దిగుతూ.

"యిది దాటి రాలేదు" అన్నాడు ధర్మ.

"అంటే యిక్కడే ఎక్కడో ఆగిపోయి వుండాలి" అంటూ కార్లు బాక్ చేశారు. రెండు ప్రక్కల వెదక సాగారు.

పి. జె. చేతిలో టార్చి, రివాల్వర్ వుంది.

చుట్టూ పొలాలు. దూరంగా పాడుబడిపోయిన ఓ ఇల్లు కనిపిస్తూంది. సందేహంలేదు ఆ యింట్లోనే వుండివుండాలి.

లోపలనుండి ఎవరిదో ఏడుపు సన్నగా విన్పిస్తూంది.

పి. జె. క్షణంలో మెరుపులా లోపలకు దూకాడు,

ఆ వూపుకి క్రింద పడిపోయాడు మధురాధర్. క్షణంలో ధర్మ, ఇనస్పెక్టర్ చుట్టుముట్టారు,

# 10

ప్రఖ్యాత డిటెక్టివ్ పి. జె. కన్సల్టింగ్ రూములో క్రైం బ్రాంచి ఇనస్పెక్టర్ విజయ్, పోలీసు కమీషనర్,

అసిస్టెంట్ ధర్మ, ఇందిర, మంజులత, మరి కొందరు వున్నారు.

పి. జె. గొంతు సవరించుకున్నాడు.

"ఈ కేసులో మనం గుర్తుంచుకోవలసింది చచ్చిన ఒక బల్లిని! అది చావకపోయినట్లయితే, యిది ఆత్మహత్యగానో, లేదా రామకృష్ణపై హత్యా నేరంగానో మోపబడేది. ఈ కేసులో ముఖ్యమైన 'క్లూ' ఒక బల్లి, మధురాధర్‌ని నిందితుడిగా చేసింది ఒక బల్లి అంటే ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు.

"అసలేం జరిగింది. స్వార్థం మనిషిని రాక్షసుడిగా చేస్తుంది. వసుంధర తండ్రి అల్లుడు మధురాధర్ ప్రవర్తన మీద నమ్మకం లేక ఆస్తి యావత్తు వసుంధర పేర వ్రాశాడు. దురదృష్టవశాత్తు వసుంధర యాక్సిడెంట్‌లో స్పయిన్ యింజరీకి లోనయింది. డబ్బుమీద ఆపేక్ష, రోగిష్టి భార్యను వదిలించుకోవటానికి మధురాధర్ యీ హత్య చేయటానికి సంకల్పించాడు. దానికి ఒక పథకం వేశాడు.

"ఏ పరిస్థితిలోను తనపై ఎవ్వరికి అనుమానం కలగకూడదు. దానికి ఒక మిషన్ తయారుచేశాడు. ఏమిటా మిషన్? వెరిసింపుల్. వసుంధర తండ్రి ఫోటో వెనుక ఒక ఇనుప బీరువా ఉంది. ఆ బీరువాలో చిన్న స్టాండుకు రివాల్వర్ అమర్చాడు. ట్రిగర్ నుండి దారం బీరువా డోర్‌కు కట్టాడు. అంటె ఎవరయినా బీరువా గబాలున తీస్తే ట్రిగ్గర్ ఆటోమేటిక్‌గా క్లిక్ అవుతుంది. ఎవరయితే డోర్ తీశారో ఆ మనిషి చచ్చిపోతాను."

"ఇందిర, దుర్గ నిడమానూరు పెళ్ళికి వెళతారని తెలుసు. ఇకపోతే రామయ్యా. వాడికి బ్రాందీ సీసా ఇస్తే

పండుగ. అందుకే సీసా ఇచ్చాడు. మద్రాసులో స్వరూప్ హోటల్ లో పార్టీ చేశాడు. చాలామంది ప్రముఖులమధ్య ఉండటం బ్రహ్మాండమయిన ఎలిబీ. అందుకే పార్టీ చేసి ఎలిబీ సృష్టించుకొని సరిగ్గా 5.30 గంటలకు ట్రంకాల్ చేశాడు. ఏదో మిష పెట్టి బీరువా తియ్యి అన్నాడు. తీసే ముందు ఎవరయినా వున్నారా? అని ప్రశ్నించాడు. అయితే అప్పటికి మంజులత ఉంది. కాని వసుంధర లేదు అని చెప్పటంతో బీరువా తీయమన్నాడు."

బీరువా తీసింది వసుంధర. తలలో గుండు దూసుకు పోయింది సరిగ్గా. ఇదంతా చూసిన మంజులతకు మతి పోయింది. ఏంచేయాలో తోచక భయపడి పారిపోయింది.

"సరిగ్గా మధ్యరాత్రిలో ప్రవేశించాడు రామకృష్ణ. దొంగతనానికి వచ్చినతను అదే గదిలో శవం ఉండటంతో ఉక్కిరి బిక్కిరయి వచ్చిన దారినే వెళ్ళిపోయాడు. అయితే రామకృష్ణ అప్పటికి ఇనుపపెట్టె అందులో రివాల్వర్ చూడలేదు."

"వీళ్ళిద్దరి విషయం మధురాధర్ కి తెలీదు. సర్కార్ లో బయలుదేరాడు. కాని సర్కార్ లో ప్రయాణం చేయలేదు. మీనంబాకం విమానాశ్రయానికి వెళ్ళి ప్లెయిన్ లో 4-30 తెల్లవారుఝామున విజయవాడ గన్నవరం వచ్చి ఎవ్వరూ చూడకుండా రివాల్వర్ తీసి అది వసుంధర చేతిలో పెట్టాడు. రివాల్వర్ కు కట్టిన దారం కాల్చివేశాడు. లోపల గడియవేసి వెంటిలేటరుగుండా-అది బాత్ రూమ్ లో వుంది. దానిలోనుండి బయటకు వచ్చేశాడు."

"అయితే ఎదురు డోర్ వేసినపుడు బల్లి తలుపుమధ్య ఇరుక్కుపోవటంతో 'క్లూ' దొరికింది. బయటకు వచ్చిన మధురాధర్ టాక్సీలో బయలుదేరి గుంటూరు వెళ్ళి తను

రిజర్వ్ చేసిన సీట్లో కూర్చొని మామూలుగా విజయవాడ చేరాడు. ఇవన్నీ ధర్మా ఇన్వెస్టిగేషన్‌లో తెలిసాయి. ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్ లిస్ట్, వారి అడ్రసులు సంపాదించి ఎంక్వయిరీ చేశాడు."

"మధురాధర్ ఎలిబీనిబట్టి ఇనస్పెక్టర్ అతన్ని అనుమానించలేదు. మధురాధర్ ఏ ఒక్కరు అనుమానించలేని రీతిగా ప్రయత్నించాడు. అయితే మంజులత ఇనుపపెట్టి, అందులో రివాల్వర్ పేలటం చూసింది. మంజులత ఆ సమయంలో ఇంట్లోనే వున్న విషయం ఎలాగో తెలుసుకున్నాడు మధురాధర్. ఈ నేరం తనపైకే వస్తుందని మధురాధర్ మంజులతను మాయం చేశాడు. ఆ అవకాశం ఒక్క మధురాధర్‌కి మాత్రం వుందని అతనిపై నిఘా వేశాను. పథకం ప్రకారం తను పోరంకి ప్రాంతంలో మంజులతను బంధించిన యింట్లోనుండి మంజులను రక్షించాము."

"ఏది ఏమయినా హంతకుడ్ని పట్టుకున్నారు" విజయ్ నవ్వుతూ అన్నాడు.

పి. జె. నవ్వాడు. "ఇందులో నేను నిమిత్తమాత్రుడ్ని అయితే నిజాన్ని దాచటం నిప్పును మూటగట్టటం లాంటిది. అందుకే మధురాధర్ ముద్దాయి అయ్యాడు. ఇందులో నా అసిస్టెంట్ ధర్మ ప్రయత్నం చాలా వుంది. అతను సహకరించి దర్యాప్తు చేయకపోతే రామకృష్ణ శిక్ష అయ్యేక దర్యాప్తు ముగిసేది."

—: ఐ పో యిం ది :—

# ఆడ పులి

## కంచర్ల రమణ

డొంకిరి మెట్ట!

రెండు కొండల పాదాలు కలిసిన వంపులో ఉన్న కొండపల్లె అది! సుంకర మెట్టకు పదిహేను మైళ్ళు, అనంత గిరికి పాతిక మైళ్ళ దూరంలో తూర్పుకనుమల్లో ఉందది!

ఊరంతా కలిసి వంద ఇళ్ళు ఉండవు. ఆ వూరి జనాభా యేనాడూ వెయ్యి దాటలేదు.

కొందరు సేద్యంమీద బ్రతికితే, మరికొందరు, ఆవుల్ని, మేకల్ని, గేదెల్ని పెంచి, బ్రతుకుతూ ఉంటారు.

డొంకరిమెట్ట ప్రజలకు కావాల్సిన నిత్యావసర వస్తువులు ఆ వూళ్ళో దొరకవు. అటు సుంకరమెట్ట సంతకో, ఇటు, అనంతగిరిలో వెలసిన యే కిరాణాకొట్టుకో పోయి తెచ్చు

కోవాల్సిందే.

ఆ ఊరికి దగ్గరలో ఉన్నది, సుంకరమెట్టే కాబట్టి, తమకు కావాల్సిన సామాను, వారానికి సరిపడేగా, విధిగా సుంకరమెట్ట సంతనుంచి తెచ్చుకుంటారు.

డొంకిరిమెట్ట ప్రజలు డబ్బు చూడ్డం అన్నది చాలా అరుదు. కర్రలు కొట్టి, మోపులు కట్టి, సంతకు మోసుకు పోయి, దానికి బదులు తమకు కావాల్సిన నూనె, ఉప్పూ వగైరా సంబారాలు తెచ్చుకుంటారు. సీజనులో చింత పండు, కుంకుడుకాయలు, పసుపు, ఆవాలు, పాలపిండి వగైరా అటవీఫలసాయం తీసుకెళ్ళి అమ్మి సామాను కొనుక్కురావడం కద్దు.

ఆ వూరికి ఓ నాయకుడున్నాడు. అతడిపేరు భీందొర. భీందొరకు అరవై యేళ్ళుంటాయి. సుమారుగా అయిదడుగుల ఆరంగుళాల పొడవుంటాడు. నల్లగా, బలిష్ఠంగా, కండలు దిరిగిన శరీరమైనా, వార్ధక్యం ముంచుకురావడంవల్ల, అతడి కండల బిగి తగ్గి, దారుఢ్యం కాస్త సడిలింది. పెద్ద కళ్ళు, బుర్రమీసాలు. తెల్లని వూలు బంతులు ఉంచినట్టుగా ఆ మీసాలు అవుపిస్తాయి బుగ్గలమీద. జానెడు గుడ్డ పైకి పింఛంలా వదిలిపెట్టి, అయిదు గజాల పంచెతో తలపాగ చుట్టాడంటే, రాజఠీవి ఉట్టిపడుతుంది అతనిలో.

అవాళ, బారెడు పొద్దెక్కాక, అతని ఇంటిముందు, ఇంచు మించు ఆ వూరి జనమంతా - పిల్లా మేకాతో సహా - గుమిగూడి ఉన్నారు.

ఇంటిముందర అరుగుమీద భీందొర కూచున్నాడు. అతని ఒడిలో తలపెట్టి ఓ పదహారేళ్ళ యువకుడు ఏక బిగిని యేడుస్తున్నాడు.

అతడిని ఓదార్చుతూ, భీందొర చెయ్యి, కుర్రాడి తల మీద ఉంది.

"తాతా!... మా మామ్మను నాకు తెచ్చిపెట్టు తాతా!... మామ్మ లేకపోతే నేను బతకను తాతా... తెచ్చిపెట్టు తాతా... లేకపోతే... ఆ పులికి నన్ను బలి ఇచ్చే తాతా" ఆ యువకుడి రోదనకు అంతులేదు.

భీందొర, అతడి తలని నిమిరి ఓదార్చగలగడం తప్ప, ఇంకేమీ చెయ్యగలిగే స్థితిలో లేడు.

ఎప్పటిదో, ఇక్ష్వాకుల కాలంనాటిదైనా, భీందొర ఇంట్లో ఓ తుపాకీ ఉంది. దాన్ని భీందొర ఉపయోగించి పదిహేనేళ్ళు కావస్తోంది.

వేటాడ్డం, ఆ కొండ నాయకుడికి కొత్తగాదు. తప్పూ అంతకన్నా కాదు. పైగా సరదా కూడాను.

అయితే ఓ రోజున ఓ ఆడలేడిని కొట్టాడు. ఇంటికొచ్చి, ఆ లేడిని కోసి చూసేసరికి, దాని కడుపులో పిండం అవు పించింది. అది కడుపుతో ఉందన్న సంగతి, భీందొర మనస్సుని కాస్త కించపరచినా, పిండాన్ని పారేసి, లేడి మాంసం యధావిధిగా వండించు తిన్నాడు.

భీందొర పెళ్ళాం కడుపుతో ఉంది. అప్పటికి ఇద్దరు పిల్లలు పుట్టి, ఆరోగ్యంగా బ్రతుకుతున్నారు కూడాను. మొదటివాడికి పదేళ్ళు నిండాయి.

లేడిని వేటాడిన మరుసటి రోజునుంచి, భీందొర జీవి తంలో ఒకటి తర్వాత ఒకటి ఎన్నో దుర్ఘటనలు జరిగాయి. ఇంకో నెల తర్వాతగాని ప్రసవం కాదనుకున్న భార్యకు హఠాత్తుగా పురిటి నొప్పులు వచ్చి, ఆమె ప్రాణంలేని ఓ మాంసఖండాన్ని కని చనిపోయింది.

వారంరోజులు ఆ తర్వాత గడవకుండానే, ఆటకోసం బయటకెళ్ళిన ఇద్దరు పిల్లల్ని ఓ యెద్దు కొమ్ములతో కుమ్మి చంపేసింది.

జీలుగు కల్లో, ఇప్పసారాయో మస్తుగా పట్టించేసి, రాత్రుళ్ళు వీధి మధ్యలో పెట్టే చలి మంట ముందు కూచుని, తన కమ్మని కంఠం యెత్తి పాటలు పాడేవాడు భీందొర.

అలాంటిది, నెలరోజుల వ్యవధిలో, తన భార్యా, ఇద్దరు పిల్లలూ హఠాత్తుగా చనిపోయేసరికి, అతని గొంతు మూగబోయింది.

కొండ దొరలు ఎంతమంది ఆడవాళ్ళనైనా ఒకేసారి పెళ్ళాడవచ్చు. కాని, భీందొర, ఒకరిని మించి పెళ్ళాడ నని వ్రతం పూనాడు. అయితే, గ్రామనాయకత్వం మాటే మిటి? తన వంశం సంగతేమిటి?

భీందొర ఇంకో పెళ్ళిచేసుకోక తప్పలేదు. కాని, మూడేళ్ళు గడిచినా ఆమెకు బిడ్డా, పాపా కలగలేదు. ఇంకో ఆమెను చేసుకొన్నాడు. ఆమె సంగతి కూడా అంతే!... తనతో తన వంశం అంతరించి పోతుందన్న భయం పట్టుకుంది భీందొరని.

ఈసారి, ఆ పిల్ల వంశంలో గొడ్రాళ్ళు యెవరూ లేరని నిర్ధారించుకున్నాకగాని, సింగి అనే చక్కని చుక్కను పెళ్ళాడలేదు.

అయితే, సింగికి కూడా సంతానంలేదు. ఆమెకు ఇప్పుడు ముప్ఫైయేళ్ళు. ఏపుగా, గుబురుగా, బలంగా, పచ్చని కొమ్మలు పెంచుకొన్న కొండ మామిడి చెట్టులా సింగి యెదిగింది కాని, ఆమె కడుపు పండలేదు.

ఆ ఆడలేడిని చంపిన పాపంవల్ల, తనింక నిర్వాం శంగా చనిపోవాల్సిందే అన్న వైరాగ్యంతో బ్రతుకీడుస్తున్నాడు భీందొర.

ఈ రోజున ఈ సమస్య వచ్చి పడింది. భీందొర మనస్సంతా అల్లకల్లోలంగా ఉంది.

ఆ కుర్రాడి పేరు ధొరమ్. ముందు రోజు ఉదయం వరకూ ఆ కుర్రాడికో మామ్మ ఉండేది. ఆ మామ్మకు ఆ కుర్రాడు, ఆ కుర్రాడికి ఆ మామ్మ తప్ప, యీ లోకంలో వాడికింకెవరూ లేరు.

డొంకిరిమెట్ట గ్రామాన్నానుకుని ఉన్న అడవుల్లో చాలా పులులున్నాయి. ఈ మధ్యనే ఓ పులి పశువుల్ని యెత్తుకుపోవడం మొదలు పెట్టింది. దాన్నెలాగైనా చంపెయ్యాలని ఆ వూరివాళ్ళు అనుకున్నారుగాని, యెలా చంపాలో వారికి తెలీలేదు. అడవి పందుల్నీ, లేళ్ళనీ, బాణాల్తో కొట్టి చంపుతారు. అలాగే పులుల్ని కూడా కొట్టడం అంటే మాటలు కాదు. గాయపడి, రెచ్చగొట్టబడ్డ పులంత ప్రమాదకరమైందేదీలేదు అడవి జంతువుల్లో. కనిపించిన ప్రతి మనిషిని కరచి చంపినా, గ్రామాలమీద బడి, దారుణంగా, పట్టపగలే దొరికినవాడ్ని దొరికినట్టే ఎత్తుకుపోయినా ఆశ్చర్యపోనక్కరలేదు.

దెబ్బ తిన్న వెంటనే జంతువు చనిపోవడం ఒక్క తుపాకీవల్లనే సాధ్యం. ఆ తుపాకీ భీందొరవద్ద ఉంది. భీందొర తుపాకీ ముట్టనంటూ భీష్మించుకు కూచున్నాడు.

తమ జీవనాధారమైన పశువుల్ని యెత్తుకుపోతుంటే, యెలాగో సహిస్తూ ఊరుకున్నారు ప్రజలు. సుమారు నెల రోజులయింది. ఆ పులి మనుషుల్ని ఎత్తుకుపోవడం ఆరంభించింది.

ధోరమ్ మామ్మ అలా పులి యెత్తుకుపోయిన మనుషుల్లో మూడవది.

ఆ రోజు ధోరమ్ అనంతగిరి వెళ్ళాడు ఏదో పనిమీద. ఈ లోపున వంటకు కావాల్సిన పుల్లలు ఇంట్లో నిండు కున్నాయి. ధోరమ్ మామ్మ ఇంకొకర్ని బదులు అడిగే రకం కాదు.

తలుపులు దగ్గరగా వేసి, కత్తి పుచ్చుకుని, అడవిలోకి వెళ్ళింది, ఎండు కర్రలు కొట్టి తేవడానికి.

అంతే! ఆమె మరి తిరిగిరాలేదు.

సాయంకాలం అవుతుండగా, ధోరమ్ అనంతగిరినుండి తిరిగి వచ్చాడు. తన మామ్మ ఇంటిదగ్గర లేదు. ధోరమ్ కడుపులో పేగులు చుట్టుకుపోతున్నాయి ఆకలితో. ఇంట్లో చూస్తే వంట అయినట్లు గుర్తులేదు. ఊరంతా తిరిగి, మామ్మ గురించి వాకబు చేసాడు.

అడవి కెళ్ళినట్టుగా చెప్పారుగాని, తిరిగివస్తే చూసి నట్టుగా ఎవరూ చెప్పలేదు.

ముసలిది, చూపు ఆనక, అడవిలో దారి తప్పినట్టుంది. తెల్లారితే, తప్పక వస్తుంది అన్న ఆశతో రాత్రంతా గడి పాడు ధోరమ్.

తూర్పు తెల్లారినా, మామ్మ రాకపోయేసరికి, ఊర్లోని నలుగుర్నీ పోగేసుకుని, అడవిలోకి పోయి వెదికాడు ధోరమ్.

అణిగిపోయిన మొక్కలు, గడ్డి దుబ్బుల్నిబట్టి, త్రోవలో కారి ఉన్న రక్తపు ముద్దల్నిబట్టి, అక్కడక్కడ దొరికిన చీర పీలికల్నిబట్టి, తన మామ్మకు యేంజరిగిందో, తెలిసింది ధోరమ్‌కు.

డొంకిరిమెట్ట వంటి కొండపల్లెల్లో, ధోరమ్‌వంటి దిక్కు లేని వాళ్ళకు ఆ పూరి నాయకుడే దిక్కు.

అందుకే భీందొర కాళ్ళమీద పడి, తన మామ్మను తనకు తెచ్చిపెట్టమని, గుండెలు పగిలేలా ఏడుస్తున్నాడు.

## 2

గంటయింది. రెండు గంటలయింది. ధోరమ్ యేడుపు మానలేదు. భీందొర ఎన్ని సానుభూతి వాక్యాలు పలికినా, ధోరమ్ దుఃఖం ఉపశమించలేదు.

"బాబూ! ధోరమ్!... ఇలా యేడ్డంవల్ల లాభంలేదు. చెప్పు! నానుంచి నీకేం సాయంకావాలో చెప్పు. నా చేత నయినంత వరకూ చేస్తాను" అన్నాడు భీందొర, ఏడ్చి, ఏడ్చి, మరి యేడవడానికి గొంతుక లేవక, మూగవాడిలా వెక్కి వెక్కి దుఃఖిస్తున్న ధోరమ్ మొహం, తన రెండు చేతుల్తో పైకెత్తి.

"నేను బ్రతకను తాతా!... మామ్మలేకుండా ఎలా బ్రతగ్గలను?... నువ్వే చెప్పు?" అన్నాడు, ధోరమ్, దుఃఖంతో పూడ్చుకుపోయినగొంతుక ఎలాగో పెగుల్చుకుని.

"చచ్చిపోయిన వాళ్ళతో మనమూ చచ్చిపోలేం గద? నువ్వు బ్రతికాలి... చెప్పు... నీకేం సాయం చెయ్యగలనో చెప్పు?"

"నాకేం పెద్ద కోరికలులేవు తాతా! మామ్మను పొట్ట బెట్టుకొన్న ఆ పులిని చంపి, నా మండే గుండెలు శాంతింప జెయ్యి" ఆవేశంగా అన్నాడు ధోరమ్.

"లేదు బాబూ! నే నా పని చెయ్యలేను. నీకు తెలియం దేముంది?" తన అశక్తతను తెలియజేశాడు భీందొర.

"ఏమిటిది తాతా! నోరులేని జీవాల్ని చంపితే తప్పు

గాని, మన పశువుల్ని, మనుషుల్ని తినేసే పులిని చంపడం దోషం కాదు.''

ఆ మాటలు వినగానే, భీందొర గుండెల్లో ములుకు గుచ్చుకొన్నట్టయింది!

అవును! నిజమే! ధొరమ్ చెప్పింది సబబే! అయినా, తను ఆ కడుపుతో ఉన్న లేడిని చంపిన దగ్గర్నుండి ఏవేవో ఘుగటనలు జరగటంతో, కొండ దేవతమీద ప్రమాణం చేశాడు, జీవితంలో ఇంకెప్పుడూ తుపాకీ పట్టనని.

''లేదు బాబూ! ఆ పులి నా ఇంటికొచ్చి నన్నెత్తుకు పోయినా, నేను తుపాకీ ముట్టను'' అన్నాడు భీందొర, విచారంగా తలొంచుకొని.

''అయితే, ఈ వూరి నాయకుడివై యుండి, ఈ వూరి మనుషుల్ని ఒకరి తరువాత ఒకర్ని బలి తీసుకుంటుంటే, చూస్తూ కూచుంటావా?'' ధొరమ్ రోషంగానే, ఎత్తి పొడుస్తున్నట్టుగానే అన్నాడు.

అతడి మాటల్ని, అక్కడ గుమిగూడిన జనంలోని కొంతమంది వెంటనే సమర్థించారు.

భీందొర ఇరకాటంలో పడ్డాడు. తను జీవితంలో మరి తుపాకీ పట్టనని వ్రతంపూనాడు. ఇంకోప్రక్క, మనుషుల్ని చంపి, యెత్తుకుపోయే పులి బారినుండి తన గ్రామస్తుల్ని రక్షించే బాధ్యత తనమీదుంది. ఏం చెయ్యడం? నిదానంగా ఆలోచించాడు ఓ క్షణం.

ఇటు తన వ్రతానికీ, అటు తన బాధ్యతకూ భంగం కలగకుండా ఉండాలంటే, మధ్యే మార్గం ఒకటే! తను పోయి, ఓ షికారీని తెచ్చి పులిని చంపించడం.

"చూడండి!" క్షణం మౌనం తర్వాత అన్నాడు భీందొర. జనం ఊపిరి బిగబట్టి, నిశ్శబ్దంగా వినసాగారు. "మీకు కావాల్సింది, ఆ పులి నాశనం కావడం. అంతే గదా?"

"అంతే!" అన్నట్టుగా తలూపారు, ధొరమ్మతో పాటుగా అక్కడున్న జనమంతా.

"ఆ బాధ్యత నాకొదిలెయ్యండి. వారం రోజుల్లో దాన్ని చంపిచేస్తాను" అన్నాడు భీందొర నిశ్చయంగా.

భీందొర మాట యిచ్చాడంటే, తప్పదని, ఆ వూరి ప్రజలకు తెలుసు. అతని మాటలతో తృప్తిపడ్డారు వాళ్లు.

# 3

"బాబూ! కలెక్టరుగారున్నారా లోపల?" అడిగాడు భీందొర, గేటు దగ్గరున్న దర్వానుతో.

నడుం మీద నీర్కావి పంచె, తలకు ఎర్రటి తలపాగా చేతిమీద, మెడలోనూ తాయెత్తులూ, వేరులుకట్టిన త్రాళ్లు, వెండి తీగలతో తయారుచేసి తగిలించుకున్నట్టుగా ఉన్న బుర్ర మీసాలతో, నల్లగా ఉన్నా, దర్జాగా, హుందాగా ఉన్న భీం దొరను చూడగానే, దర్వానుకు కాస్తంత గౌరవం మనసులో మెదిలినా, తన మామ్మూలు ధోరణిలో "ఉన్నారు గాని, వారిని యిప్పుడు ఎవరూ చూడ్డానికి వీల్లేదు" అన్నాడు, కసురుకుంటూ.

అదేసమయంలో లోపలినుంచి ఓ పధ్దెనిమిదేళ్ల యువకుడు గేటు దగ్గర కొచ్చి "ఆగు దర్వాను ఎందుకా కేకలు?" అంటూ దర్వాన్ని అదిలించడంతో, దర్వాను ఆగిపోయాడు.

"యేమండి? .... యెవరు కావాలండి?" అన్నాడు భీం దొరతో గౌరవ పూర్వకంగా.

"ఎవరు బాబూ మీరు? ...... కలెక్టర్ గారి కేమవు తారు?" అడిగాడు భీం దొర.

"నేను కలెక్టరుగారికి తమ్ముడవుతాను...... నా పేరు భూపతి" చెప్పాడు కుర్రాడు.

"దండాలు బాబూ!" అంటూ మొదలు పెట్టి, తను వచ్చిన పని సంగతి వివరంగా చెప్పాడు భీం దొర.

భీం దొర మాటలు వినగానే, భూపతి మొహం సంతోషంతో వికసించింది.

"రండి! రండి! ...... కలెక్టరుగారితో మాట్లాడదాం," అన్నాడు భూపతి లోనికి దారి తీస్తూ.

భీం దొర, భూపతిని అనుసరించాడు.

భీం దొర చెప్పిన కథ వింటూనే, కలెక్టరుగారు పకపకా నవ్వారు.

ఆ నవ్వు తాలూకు అర్థం భీం దొరకు బోధపడక పోయినా, అక్కడున్న తతిమ్మా వాళ్లందరికి తెలుసు.

భూపతికి వేటంటే చాలా యిష్టం. వారిది, రాజవంశమేమో, వేట సరగా అతని కుటుంబం రక్తంలోనే ఉంది.

"అయితే వెళ్తానంటావ్!" అన్నాడు శ్రీపతి, తమ్ముడి వైపు చిరునవ్వు మొహంతో తిరిగి.

"అవునన్నయ్యా! నా సర్దా ఆపకు" అన్నాడు భూపతి, మొహం నిండా నవ్వుతో.

"ఓకే! దెన్!" అంటూ పనివాడ్ని కేకేసి, కాయితం కలం తెప్పించి, ఓ ఆర్డరు తన చేత్తోనే రాసాడు శ్రీపతి వెంటనే.

ఆర్డరు భీం దొర చేతిలో పెట్టి "నీ పని చాలా సులువయి పోయింది...... మా తమ్ముడు మంచి షికారీ..... నీతో పాటుగా పంపిస్తున్నాను. ఎంత బాగా చూసుకుంటావో మరి," అన్నాడు.

భీం దొర ఆనందం చెప్పవలసినది గాదు. షికారీ కోసం వెతుక్కునే యిబ్బందికూడా తప్పింది తనకు. "బాబూ! ...... చక్రవర్తిని చూసినట్టు చూసుకుంటానండి, మా వూళ్ళో, ఉన్నాళ్ళూ" అంటూ వినయంగా జవాబిచ్చాడు భీం దొర.

గంటలో తన హేవర్ సేక్ లో తనకు కావల్సిన బ్రెడ్, టిండ్ ఫ్రూట్, జామ్ టిన్ను, టిండ్ మటన్ వగైరా తిండి సామానులు పడేసుకుని, రెండు రగ్గులు, రెండు దుప్పట్లు, ఓ తువ్వాలూ, రెండు జతల బట్టలు బెడ్డింగ్ రోల్ గా చుట్టి పట్టుకుని, రైఫిల్ భుజానికి తగిలించుకుని బుల్లెట్సు పాక్ జేబులో కుక్కుకుని బయలు దేరాడు భూపతి, భీం దొర వెంట.

## 4

భీం దొర నాలుగవ భార్య సింగి వుంటున్న యిల్లు' ఆ వూర్లోని యిళ్ళకన్నా, విశాలంగా, శుభ్రంగా, అన్ని సౌకర్యాలతో ఉంటుంది.

తాత్కాలికంగా సింగిని, తన రెండవభార్య యింట్లో వుండమని చెప్పి, సింగి యిల్లు భూపతికి యిప్పించాడు భీం దొర.

కలెక్టరుగారి తమ్ముడు గొప్ప షికారీ అనీ, పులిని చంపడానికి, అతన్నే భీం దొర తీసుకొచ్చాడనీ అన్న వార్త ఊరంతా పాకిపోయింది క్షణంలో.

పిన్నా, పెద్దా, ఆడా మగా అందరూ ఒక్కుమ్మడిగా భూపతి బస చేస్తున్న యింటి మీదకు వచ్చిపడ్డారు.

గంటలో యిల్లు శుభ్రం చెయ్యబడింది. భూపతి స్నానం చెయ్యడానికి వేణ్ణీళ్లు సిద్ధం చెయ్యబడ్డాయి.

తన రాక ఆ వూరిలో పెద్ద సంచలమే కలిగించిందను కున్నాడు భూపతి, హడావిడిగా తన నివాసం కోసం యేర్పాట్లు చేస్తున్న జనాన్ని చూస్తూ.

ఆకాశంలో చంద్రుడు బాగా పైకి లేచాడు. డొంకిరి మెట్ట గ్రామం, దాని చుట్టు ప్రక్కలనున్న అడవిప్రాంతం అంతా వెన్నెల్లో తడిసి, తమాషాగా అందాలు చింది స్తోంది.

వేడి వేడి వెదురుబియ్యపు అన్నం, రుచిగా వండిన జింక మాంసం, అంతకు ముందు భీందొరతో పాటుగా పోటీగా పుచ్చుకున్న యిప్పసారా- భూపతి కడుపులో పనిచేసి, అతని శరీరం, మనస్సు హాయిగా, తేలిగ్గా చేసే సాయి.

భూపతికి కేటాయించిన యింటికి దూరంగా బయలులో, పెద్ద దుంగలు ముట్టించి చలి మంట పెట్టారు. ఎర్రని మంటలు పైకి లేస్తుంటే, ఊరిలోని జనమంతా, ఆ మంట చుట్టూ చేరారు.

వెదురు కర్రలతో తయారు చేసిన స్టూలు ప్రత్యేకంగా భూపతి కోసం వేసి, అతడ్నికూడా మంటకు చేరువగా కూచోబెట్టారు.

వాతావరణం అద్భుతంగా వుందనుకున్నాడు భూపతి.

ఈ లోపున కొందరు మగాళ్లు, ఆడాళ్లు లేచి ఒకరి చేతులు ఒకరు పట్టుకుని వలయాకారంలో నిలుచున్నారు. వారిలో కొందరి కాళ్లకు గజ్జెలున్నాయి.

మెల్లగా ఎవరో ఒకరు పాట మొదలు పెట్టారు. ఆ పాటకు అనుగుణంగా, కాళ్లకు కట్టిన గజ్జెలు మోగుతున్నాయి.

ఆ వలయాకారం మధ్య సింగి చేరింది. ఆమె కూడా నాట్యం చేస్తోంది. మధ్య మధ్య ఆడవాళ్లతో వంత పాడుతూ.

అంచెలంచెలుగా తను ఆనందశిఖరాని కెగ బ్రాకుతున్నట్టుగా అనుభూతి చెందుతున్నాడు భూపతి.

ఒకే స్థాయిలో, నిదానంగా, పాట_దానితో కలిసి వినిపిస్తూ, గజ్జెల మోత_బోరుకొడుతున్నట్టుగా ఫీలయ్యాడు భూపతి.

అర్ధగంట గడిచింది. ఆగకుండా, గజ్జెల మోత విన్పిస్తూనే ఉంది. పాట సాగుతూనే ఉంది.

భూపతి కూచున్న చోటనే నిద్రపోసాగాడు.

# 5

"బాబూ! టీ తెచ్చాను!"

మూడోసారి సింగి అలా అనేసరికి, భూపతికి మెలుకువ వచ్చింది. కళ్లు తెరిచాడు. సింగివైపు జూశాడు.

సింగి యెప్పుడు నిద్ర లేచిందో యేమో, కడిగిన ముత్యంలా తళ తళ మెరుస్తోంది.

నూనె రాసుకుని నున్నగా పైకి దువ్వు కొన్న జుత్తు ఓ ప్రక్కకు బిగువుగా కొప్పు వేయబడింది. ముక్కున ముక్కర, దండలకు కడియాలు, మోకాళ్ల వరకూ మాత్రం కొండ స్త్రీల పద్ధతిలో చీర కట్టుకుని ఉంది.

చేతిలో టీ గ్లాసు, పెదాల మీద చిరునవ్వుతో నిలుచున్న సింగిని చూడగానే, రాత్రి జ్ఞాపకాలు ఒక్కసారిగా మునిరాయి భూపతి మనసులో. అప్రయత్నం

గానే, అతని కళ్ళు, ఆమె వంటి ఎత్తు పల్లాల మీద, పైకీ కిందికీ పరిగెత్తాయి.

నిజంగా సింగి అడవి మల్లే! ...... అతని గుండెలు ఉద్రేకంతో పొంగాయి.

కాని, వెంటనే నిగ్రహించుకున్నాడు.

ఓ సారి మైసూరు అడవుల్లో భూపతి స్నేహితుడొకడు వేటాడ్డానికి వెళ్ళాడు. ఆ అడవుల్లో వున్న పది రోజుల్లో, అతని కేంపుకు దగ్గరగా ఉన్న కొండజాతి పిల్లతో పరిచయమైందతడికి. ఆ అమ్మాయి కళ్ళల్లో కొట్టొచ్చినట్టు అవుపించే అమాయకత్వం, ఆరోగ్యంగా, అందంగా ఆమె అవయవాల పొంకం చూసి ఉద్రేక పడ్డాడు. ఆ అమ్మాయికి కూడా అతనంటే యిష్టం యేర్పడింది.

వేట ముగిసి, కేంప్ యెత్తి వేస్తున్న రోజున, ఆ అమ్మాయి వచ్చింది, అతన్ని చూడ్డానికి. ఆమెను అనుభవించే అవకాశం లేకపోయినా, ఆమెను కనీసం ముద్దు పెట్టుకోవాలన్న కోరికను అణుచుకోలేకపోయాడు. జాగ్రత్తగా ఆలోచించి, అదే సాకుమీద, ఆ అమ్మాయిని అడివిలోకి తీసుకెళ్ళాడు. ఓ చెట్టుబోదె నానుకుని నిల్చి, ఆమెను ముద్దు పెట్టుకోవాలని వంగేలోపల, రివ్వున ఓ బాణం వచ్చి, వాళ్ళ తలకాయలపైన, బోదెమీద గుచ్చుకుంది. అతడి గుండె భయంతో గుబ గుబలాడిపోయింది.

ఆ బాణాన్ని తన తలకాయకు గురి చేసి కొడ్తె, గురి తప్పి, చెట్టు బోదెకు గుచ్చుకుందేమో, తన అదృష్టంకొద్దీ?

ఆమెను కౌగలించుకోవాలి, ముద్దు పెట్టుకోవాలి అన్న కోరిక గాలిలోకి పిట్టలా ఎగిరిపోయింది. ఆమెను అక్కడే వదిలేసి, అదరా బాదరా కేంపుకి వచ్చిపడ్డాడు.

తన స్నేహితుడి అనుభవం గుర్తుకి రాగానే ఒక్క సారిగా ఒళ్ళు జలదరించింది భూపతికి.

లేచి, చూపులు మరల్చి, టీ గ్లాసు అందుకుని కృతజ్ఞతతో త్రాగాడు.

"లేచి మొహం కడుక్కోండి. ఫలహారం చేద్దురుగాని" అంటూ ఖాళీగ్లాసు తీసుకుని, నవ్వుతూ వెళ్లిపోయింది సింగి.

లేచి, మొహం కడుక్కుని వచ్చేసరికి, సింగి వేణ్ణీళ్ళతో సిద్ధంగా ఉంది.

"నేను పోసుకుంటానులే. నువ్వెళ్లు" అంటూ భూపతి ఎంత గొడవ పెట్టినా సింగి విన్పించుకోలేదు. భూపతికి ఒళ్లు తోమి, నీళ్లు పోసింది. ఆ తరువాత, అప్పుడే ఉడికించి తెచ్చిన ఉడుకుడుకు పెండలం దుంపలు ఫలహారంగా పెట్టి, త్రాగడానికి గేదె పాలు యిచ్చింది.

తనతో తెచ్చిన బ్రెడ్, జాం మిగిలిపోయి, పనికి రాకుండా పోనివ్వకుండా, సింగికి, భీందొరకు యిచ్చాడు భూపతి.

పట్నం తిండి ఎంతో రుచిగానూ, తమాషాగానూ, అనిపించిందేమో, బ్రెడ్ జాం తింటూ ఎంతో మెచ్చుకుంది సింగి.

ఉదయం పది గంటలవుతుంటే, ధొరమ్, మరో యిద్దరు యువకులు వచ్చారు భూపతి దగ్గరకు.

"పులిని మాటువేసి చంపడానికి రెండు పద్ధతులున్నాయి. ఒకటి, అది తరచుగా తిరిగే ప్రాంతాల్లో దూడనో, గేదె పెయ్యనో మాటుగా పెట్టి, అది దాన్ని చంపి తింటున్న సమయంలో కాల్చి చంపడం. రెండు, చంపిన జంతువుని పులి ఓ రహస్య స్థలానికి యీడ్చుకు పోతుంది. ఆ స్థలమేదో తెలుసుకుని పులి తన ఆహారం

దగ్గరకు తిరిగి వచ్చే క్షణం కోసం యెదురు చూసి, అది రాగానే కాల్చి చంపడం. ధోరమ్ మామ్మను పులి చంపేసి మూడు రోజులవుతోంది. అంటే పులి, ధోరమ్ మామ్మను పూర్తిగా తినేసి వుండాలి, యీపాటికి. అయితే, సాధారణంగా పులి తిరగాడే స్థలం గురించి తెలుసుకోవాలి కాబట్టి, ముందుగా, ధోరమ్ మామ్మ శరీరం అవశేషాలు యెక్కడ మీకవుపించాయేమో-చూడండి?" అన్నాడు భూపతి, వచ్చిన వాళ్ళతో.

"అలాగే బాబూ!...పదండి; చూపుతాం" అన్నారు యువకులు.

వారి వెంట, లోడ్ చేసిన రైఫిలు చేతిలోకి పట్టుకుని భూపతి బయలుదేరాడు. అతని వెంట భీంవార కూడా కదిలాడు అడవికి.

## 6

సామాన్యంగా పులి 30 నుంచి 40 ఏళ్ళవరకూ బ్రతుకుతుంది. ముసలితనం ముంచుకురావడంవల్లనో, ఏ వేటగాడి గుండో తగిలి అవిటిదైపోవడంవల్లనో, అడివిలో చురుగ్గా పరుగెత్తి పారిపోయే జంతువుల్ని వెంటాడి చంపగలిగే శక్తి సన్నగిల్లుతుంది పులికి.

అప్పుడే పశువుల మందమీదబడి, పశువుల్ని యెత్తుకుపోవడం, ఊర్లమీదబడి, మనుషుల్ని యెత్తుకుపోవడమో చేస్తాయి పులులు.

తన ఆహారం విషయంలో పులికి యేలాంటి నిషలూ, నియమాలూ లేవు. ఏ జంతువు మాంసాన్నైనా, ఆఖరుకు కుళ్ళి పురుగులోడుతున్నా తింటాయి. పులి కప్పల్ని, కోతుల్ని, ఎలుగుబంటుల్ని - చివరకు తమ జాతి వాటిని కూడా తిన్నట్టు రికార్డుల్లో ఉంది.

పులి జంతువు మెడదగ్గర కొరికి చంపుతుంది. చంపిన జంతువు వెనకభాగం నించి తినడం ఆరంభించుతుంది. చిరుతపులుల్లాగు, అవి ముందునుంచి తమ జంతువుల్ని తినవు. తరుచుగా తోక కొరికి, దూరంగా విసిరేస్తుంది. ఒక్కోసారి, చెవుల్ని కూడా కొరికి పారివేయడం కద్దు. జంతువు చర్మాన్ని, దాని వంట్లోని చిన్న ఎముకల్ని కూడా వదిలేయకుండా అరగిస్తుంది పులి.

మనుషుల్లో కొంతమంది, వంటింట్లో భోంచేస్తుంటే, వాళ్ళ తిండి చప్పుడు వీధిలోకి విన్పిస్తుంది. పులి అలాంటి వాళ్ళకోవకే చెందుతుంది. పులి తన ఆహారాన్ని తింటుంటే, తింటున్న చప్పుడు, అడవిలో చాలాదూరం విన్పిస్తుంది.

లేళ్ళు, దుప్పులు, ఏనుగులు వగైరా కొన్ని అడివి జంతువుల్లాగు పులి మందలుగా తిరగదు. ఒకవేళ,అలాంటిది జరిగిందంటే, అవి ఒకే కుటుంబానికి చెందినవన్నమాట.

భీందొర, ధొరమ్, మరో ఇద్దరు డొంకిరిమెట్ల యువకులు వెంటరాగా, అడివిలోకి బయలుదేరిన భూపతికి, పులి గురించి, తను తెలుసుకొన్నదంతా గుర్తుకొచ్చింది.

వేటాడదల్చుకున్న పులిగురించి ఆచూకీ తీయాలంటే, అడవుల్లో చాలాదూరం తిరగాల్సి వుంటుంది. ఫ్రీగా వెళ్ళ డానికి, వీలైన సమతల ప్రదేశంగాని, రోడ్లుగాని ఉండవు కాబట్టి, కార్లు, జీపులు వగైరా ఆధునిక వాహనాలు వాడడానికి అవకాశంలేదు. కాలినడక ఒక్కటే శరణ్యం.

అయితే, కొందరు షికారీలు యేనుగుల్ని ఉపయోగించడం కద్దు. కాని, పులి సమీపంలో ఉందని వాటికి అనుమానం కలగ్గానే, బెదిరి పరుగుదీస్తాయి. చెట్లకొమ్మలకు తగిలి, షికారీలు తిన్నగా పులినోట్లో పడటం జరుగుతుంది.

ఏదియేమైనా, భూపతికి కాలినడకన పోయి, అడవిలో వేటాడ్డమంటేనే ఇష్టం.

అయినా, డొంకిరిమెట్ట ప్రాంతంలో, ఏనుగులు ఎక్కడున్నాయి?

భూపతి, తన అనుయాయులతో, సుమారు అయిదు మైళ్ళు అడవిలోకి చొచ్చుకువెళ్ళాడు. త్రోవలో అగపడ్డ నీటిపట్టులని, పులి వచ్చివెళ్ళిన పంజా గుర్తులకోసం వెదికాడు.

సాధారణంగా అడివి జంతువులు తమ దప్పిక దీర్చుకోవటం కోసం విధిగా నీటిపట్టులకు వస్తాయి.

అలా వచ్చే మృగాల్ని వెంటాడి చంపి తినడానికి, తమ దప్పిక దీర్చుకోడానికి కూడా, పులులు నీరున్న చోట్లకు వస్తాయి.

ఏవేవో జంతువుల కాలిముద్రలతో పాటుగా, పులి పాదాల ముద్రలుకూడా అగపడ్డాయిగాని, అవి మొన్నటివిలా లేవు.

ధోరమ్ మామ్మ కట్టుకొన్న చీర తాలూకు పీలికలూ, ఆమె జుత్తూ వగైరా ఆమె శరీరావశేషాలు తామెక్కడ చూసారో ఆ స్థలాన్ని వారు చూపారుగాని, వాటివల్ల ప్రస్తుతానికి పెద్ద ప్రయోజనం లేదు భూపతికి.

అవాల్టికి పులికోసం ఆరాలు తీయడం ఆపి, అలసిన శరీరంతో, సలుపుతున్న కాళ్ళతో, డొంకిరిమెట్ట తిరిగొచ్చాడు భూపతి.

## 7

సాయంకాలం ఆరున్నర కాగానే, చిక్కని చీకటి అలుముకుంది, డొంకిరిమెట్ట అరణ్య ప్రాంతంలో. ఏడు కాగానే, పిల్లలు, బాగా వయసు మీరిన వృద్ధులు ఇళ్ళల్లోకి పోయి నిద్రపోయారు.

మిగతా వాళ్ళు, ఊరిమధ్య వేసిన చలిమంట చుట్టూ

చేరారు యెప్పటిలా. స్త్రీ, పురుషులనే తేడా లేకుండా, ఇప్పసారా తెచ్చుకుని త్రాగారు.

"బాబూ! ఇప్పసారా మీకు తెచ్చేదా?" అడిగింది సింగి, భూపతివద్దకు వచ్చి.

సింగి గత రాత్రికి మల్లెనే, నీటుగా, అందంగా అలంకరించుకుని, ఆకుపచ్చ చీరలో కడిగిన ముత్యంలా మెరిసిపోతోంది. చలిమంట వెలుగులో, తమాషాగా, తట్టుకోలేనంత ఆకర్షణతో అవుపించింది సింగి.

ఒళ్ళంతా, నరాలు పురిపెడ్తూ, తీయని తీపు. ఎదురుగా వున్న సింగిని చూస్తుంటే, భూపతి మనస్సు వశం తప్పుతోంది.

"ఏం బాబూ! తెచ్చేదా?" అంది సింగి రెండోసారి, భూపతి తన మాటలు వినలేదేమోనని.

తన వూహాల్ని అప్పుడు అదుపులోకి తెచ్చుకున్నాడు భూపతి.

"వద్దు. పట్నం సారా వుంది నా దగ్గర. రుచి చూస్తారా మీరు?" అన్నాడు భూపతి.

పట్నం సారా మాట చెవిని పడగానే అప్పుడే అక్కడకు వచ్చిన భీందొర చప్పున భూపతి ప్రక్కకు వంగాడు. "పదండి. ఇంటిలోకి పోయి తాగుదాం. వీళ్ళందరూ వచ్చి పడ్డారంటే, చుక్క గూడా మిగలదు" అన్నాడు గొంతు బాగా తగ్గించి.

పట్నం సారా అంటే, ఆ ప్రజలకు అంత మోజు వుంటుందనుకోలేదు భూపతి.

"పదండి వెళ్దాం" అన్నాడు లేచి భూపతి.

"దొరగారికి నిద్దరొస్తోందట. పోయి పడుకుంటాం. రేపు కాస్త పెందరాళే బయలుదేరండి. అడవిలోకి

వెళ్దాం'' అన్నాడు భీందొర లేచి, ఆ చలిమంట చుట్టూ కూచున్న జనాన్ని చూసి.

''అలాగే దొరా'' అంటూ తలలూపారు, అప్పటికే ఇప్పసారా తలకెక్కిన జనం.

ముందు భీందొర, వెనుక భూపతి, ఆ వెనుక సింగి, ఇంట్లోకి వచ్చిపడ్డారు.

''పట్నం సరుకు రుచిచూసి చాలా రోజులైందిబాబూ!'' భీందొర నోరు చప్పరించాడు.

''అహాఁ... అలాగా!'' అంటూ ఓల్డ్‌మాంక్ రమ్ బాటిలు తెరిచాడు భూపతి.

ఈలోపున సింగి వెళ్ళి, మూడు గిన్నెలనిండా అన్నం, పైన మాంసం కూరపెట్టి తెచ్చి, తనముందఒకటి పెట్టు కుని, వారిద్దరికీ చెరో గిన్నె ఇచ్చింది.

మూడు గ్లాసులోని రమ్ ఒంపి, తర్వాత నీళ్ళతో నింపి, తలో గ్లాసు అందించాడు భూపతి.

తన గ్లాసులోని ద్రవాన్ని కాస్త పీల్చి చప్పరించి ''యెలా వుంది?'' అన్నాడు భూపతి, తన కెదురుగా కూచున్న ఆ ఇద్దరితో.

గుక్కెడు తాగి ''చాలా బావుంది బాబూ!'' అంది సింగి కృతజ్ఞత మెరిసే కళ్ళతో.

''పట్నం సరుకే సరుకు. వేరే చెప్పేలా? అమృతం'' అంటూ భీందొర, తన గ్లాసులోదంతా ఒక్క గుక్కలో పీల్చేసాడు.

ఇప్పసారా తాగినట్టు ఒకేసారి తాగెయ్యకూడదనీ, రమ్ మెల్లమెల్లగా కొద్దికొద్దిగా చప్పరిస్తూ తాగితేనే అందం, ఆనందం అని భీందొరకు చెప్పాలనుకున్నాడు భూపతి. కాని, యెందుకో మనసు మార్చుకున్నాడు.

తన ముందరున్న గిన్నెలోని అన్నం కూర గబగబా కలిపి, రెండు ముద్దలు నోట్లో పెట్టుకుని, ఖాళీ గ్లాసు నింపమన్నట్టుగా, ఖాళీ గ్లాసువైపు, భూపతి మొహంలోకి క్షణం మార్చి మార్చి చూసాడు భీందొర.

భూపతి అర్థం చేసుకొన్నాడు.

భీందొర గ్లాసులో సగం మేరకు రమ్ పోసి, మిగతా సగం నీటితో నింపడానికి, మంచినీళ్ళ చెంబు అందుకున్నాడు భూపతి. కాని, భీందొర, గ్లాసు మూతికి చెయ్యి అడ్డంగా పెట్టి "రుచి చెడిపోతుంది బాబూ!" అన్నాడు.

వేరే మార్గంలేక, నీరుపోయడం విరమించుకుని, గ్లాసులోని తతిమ్మా సగం కూడా రమ్‌తో నింపాడు భూపతి.

"చాలు బాబూ! నెలకోసారి ఇలాంటి సరుకు పుచ్చుకోవాలి" అంటూ గ్లాసు యెత్తి ఒక్క గ్రుక్కలో గ్లాసులోని ద్రవాన్ని గొంతుకలోకి పోసేసుకున్నాడు భీందొర.

రెండు క్షణాలు భీందొరవైపు చూస్తూ ఉండిపోయాడు భూపతి. ఆ మీదట, తన గ్లాసు అందుకుని, అందులోని ద్రవాన్ని మెల్లిగా త్రాగుతూ సింగివైపు చూసాడు.

ఆమె భూపతివైపే చూసి, నవ్వుతూ, తన గ్లాసులోని ద్రవాన్ని త్రాగుతోంది.

భీందొర మీద రమ్ క్షణాల్లో పనిచేసింది. అతని చూపులు మారిపోయాయి. చేష్టలు కూడా మారిపోయాయి. అన్నం మరి రెండు ముద్దలు నోట్లో పెట్టుకున్న తర్వాత, అన్నం కలుపుతూనే కూచున్నాడు "సరుకు చాలా బావుంది" అని తనలో తను గొణుక్కుంటూ.

అలా అయిదు నిమిషాలు గడిచాయి. ఆ తరువాత, గోడకు చేరబడి గురకదీయ సాగాడు భీందొర.

గురక దీస్తుంటే, అతని నోట్లోంచి వెలువడే గాలికి, అతని బుర్రమీసాలు కంగారుగా ఎగిరి పడుతుంటాయి.

నవ్వాపుకోలేక పోయాడు భూపతి.

గట్టిగా, విరగబడి నవ్వాడు. సింగి కూడా నవ్వింది గలగలా. పల్చగా సాగిన పెదాలమధ్య మల్లెమొగ్గలా తెల్లగా మెరుస్తున్నాయి ఆమె పళ్ళు.

ఆమె, తనూ ఇప్పుడు ఒంటరిగా ఉన్నారన్న ఫీలింగు కలగానే, అతని రక్తం దూకుడు ఆరంభించింది.

"ఏంచేద్దాం?" అన్నాడు వణికే గొంతుకతో.

"చెయ్యి కడిగి, అవతలి గదిలో మంచంమీద పడుకో బెట్టి వస్తానుండండి," అంది సింగి లేస్తూ.

అతని ముందరున్న కంచంలోకే భీందొర చెయిలి కడిగి, మూతి తుడిచింది సింగి. ఆ తరువాత, చంకల్లో చేతులు జొనిపి భీందొరని లేవదియ్యడానికి ప్రయత్నిం చింది. కాని, పట్టుకు దొరికికూడా జారిపోయాడు భీందొర.

"మీరు కూడా ఓ చెయ్యి వెయ్యాలి కాస్త" అంది సింగి మళ్ళా పట్టుకోసం ప్రయత్నిస్తూ.

భూపతి లేచాడు, తాగుతున్న గ్లాసు నేలమీద పెట్టి. ఇద్దరూ, చెరో ప్రక్క పట్టుకుని, భీందొరని లేవనెత్తి, ప్రక్క గదిలో మంచంమీద పడేసి వెనక్కి వచ్చి కూచున్నారు.

భూపతికి యెంతో ఇబ్బందిగా వుంది. అయినా, ఇష్టంగానే వుంది, లోలోన. ఆడవాళ్ళతో రాత్రిపూట ఒంటరిగా ఉండడం అదే మొదటిసారి భూపతికి.

పైగా సింగి చూపులు అతడ్ని ఎక్కడెక్కడో గుచ్చి కవ్విస్తున్నాయి సుతిమెత్తనగా.

బైట చలిమంటవద్ద ఎవరో పాట అందుకున్నారు. తతిమ్మా వాళ్ళు - ఆడా మగా కలిసి శృతి కలిపారు.

చెట్టా పట్టా వేసుకుని, గతరాత్రి లాగానే వాళ్ళు

నృత్యం ఆరంభించారు.

పాటతో కలిసి, కాళ్ళగజ్జెల చప్పుడు, ఆ నిశ్శబ్ద నిశీధిలో ఒకే స్థాయిలో, ఉండలోంచి దారం లాగుతున్నట్టుగా, వినబడుతుంటే, తియ్యగా ఏదో మత్తుమందు చేస్తున్నట్టుగా ఉంది భూపతికి.

"ఆ పాటకి అర్థం యేమిటి?" అన్నాడు, ఏదో అడగాలి కాబట్టి, తను పడుతున్న ఇబ్బందిని కప్పిపుచ్చుకోవడానికి.

"అర్థమా?" అంటూ ఆగిపోయింది సింగి, సగంలో, ఏదో ఆలోచిస్తున్నట్టు.

రమ్ కైపు ఆమె తలకు బాగా యెక్కిందని; ఆమె తన మనసు కేంద్రీకరించే శక్తి కోల్పోయిందని గ్రహించాడు భూపతి.

"ఊఁ చెప్పు" అన్నాడు భూపతి, రెండు క్షణాలు గడిచినా, ఆమె జవాబివ్వక పోయేసరికి.

ఆమె సన్నగా జోగుతోంది.

"అదీ! అదీ!" అంటూ కిసుక్కున నవ్వి, క్షణంసేపు భూపతి కళ్ళల్లోకి ఓ వింత చూపు చూసి "అదీ మొగుడూ పెళ్ళాల వలపు పాట" అంది.

"మొగుడు పాడ్తున్నదా? పెళ్ళాం పాడ్తున్నదా?" అడిగాడు భూపతి, ఆమె చూపులు తన వంట్లో రేపుతున్న కలవరాన్ని నొక్కి పడుతూ.

"పెళ్ళామే" జవాబిచ్చింది సింగి. ఆమె మొహంలో అదే వింత చూపు. మళ్ళా అదే తమాషా నవ్వు.

"ఏమని?" అడిగాడు, తడారిపోయిన గొంతుకతో.

"ఏమనా?" అంటూ లేచిందామె. ఆమె కళ్ళల్లో కొట్టొచ్చే తీవ్రత, ఏదో సాధించి తీరాలనే పట్టుదల.

ఆమె ప్రవర్తన వింతగానూ, గుబులు గొల్పుతున్నట్టుగా అనిపించిదతడికి.

ఆమె తిన్నగా దీపం ఉన్న గూటి దగ్గరకు కదిలింది.

ఆమెను పరిశీలిస్తున్నాడు దీక్షగా. కాని భయం భయంగానే వుంది.

గూటిలోని దీపం గుఫ్‌మంటూ ఆరింది.

బయట కురుస్తున్న వెన్నెల కాంతి కాస్త గదిలోకి వచ్చి పడుతుందేమో, ఆమె నీడ అవుపిస్తూనే ఉంది, దీపం ఆరిపోయినా.

ఆమె నీడ ఒక్క క్షణం ఆగింది. ఆగి, ఉన్న చోటనే కదలిన తీరునుబట్టి, సింగి చేస్తున్నదేమిటో తెలుసు కున్నాడు.

ఆమె తన ఒంటిమీద బట్టలు విడిచేసింది.

ఏంచెయ్యాలో పాలుపోక ఉన్న చోటనే రాయిలా ఉండిపోయాడు భూపతి.

మరుక్షణంలో ఆమె అతనిమీద విరుచుకు పడింది. ఆవేశంగా, ఆమె చేతులు అతన్ని చుట్టేసాయి. పిండి ముద్దల్లాంటి పెద్ద రొమ్ములు అతడి ఛాతీని కుమ్మసాగాయి.

అదే సమయంలో, ఇంటి వెనుక గొడ్లకొట్టంలో, ఆవు పెడుతున్న మూలుగు కాబోలు విన్పించింది.

"ఏమిటా చప్పుడు?" అడిగాడు భూపతి.

అతనిమీద ఆత్రంగా కదులుతున్న సింగి క్షణం ఆగింది.

గొడ్లకొట్టంలోని శబ్దాలు స్పష్టంగా విన్పించసాగాయి.

ఆవు మూలుగుతోంది దీనంగా ఎందుకో. ఏదో కొట్టు కుంటున్న చప్పుడు. ఇంకో క్షణం తర్వాత, ఏదో విరిగి నట్టుగా గరుగ్గా రాసుకుంటున్నట్టుగా చప్పుడు.

భూపతికి అర్థమైంది అదేమిటో. పులి వచ్చి, పాకలో ఉన్న ఆవును చంపి, నోరు కరుచుకుపోతోంది.

ఒక్క వూపుతో, తన మీదున్న సింగిని ప్రక్కకు తోసేసాడు. బట్టలు సర్దుకుని, టార్చిలైటు అందుకుని, దొడ్డి తలుపులు తెరిచి, వెలుపలికి ఉరికాడు.

భూపతి కరెక్టుగానే వూహించాడు. కొట్టంలో, ఆవు చనిపోయిన చోట నెత్తురు మండలం. అక్కడ్నుంచి, ఆవు కళేబరాన్ని పులి ఈడ్చుకెళ్ళిన త్రోవకంటా నెత్తుటి చార. పులి క్షణాల్లో తన పని పూర్తి చేసుకుని అడివిలోకి పారిపోయింది అనుకున్నాడు.

ఆ రాత్రివూట తను చెయ్యగలిగిందేమీ లేదు. చంపిన జంతువును, మళ్ళా వచ్చి, తీరిగ్గా తినడానికి, ఓ రహస్య ప్రదేశంలో ఉంచుతుంది పులి. తెల్లవారగానే పోయి, ఆ ప్రదేశాన్ని కనుక్కోవాలి.

భూపతి వెనక్కి వచ్చాడు. దీపం వెలిగించాడు. బట్టలు కట్టుకుని, చిన్నబోయిన మొహంతో, దిగాలుగా కూర్చుని ఉంది సింగి అతడి ప్రక్కమీద.

ఏంజరిగిందో చెప్పాడామెకు. ఆమె ఆరాటం చూప లేదు. ఆశ్చర్యపోయాడు. తన వాంఛలు, ఇష్టాలు తీరడం తప్ప ఇంకేమీ లక్ష్యపెట్టదా?

ఆ తెరువాత, చలిమంటవద్ద కూచున్న జనంవద్దకు వెళ్ళి, పులి వచ్చివెళ్ళిన సంగతి చెప్పాడు. జనం మొహంలో భీతావహం తొంగిచూసింది. మర్నాడు యేంచెయ్యాలో వాళ్ళకు క్లుప్తంగా చెప్పి, ఇంట్లోకి వచ్చాడు.

# 8

గడచిన రాత్రంతా నిద్రలేదు భూపతికి. భయంకరమైన కలలు అతడ్ని వెంటాడినాయి, నిద్ర తెచ్చుకోవడానికి

ప్రయత్నించినకొద్దీ.

కాసేపు, ఊరిలో జొరబడి, ఏ మనిషినో, ఏ పశువునో చంపి, ఓ పులి యెత్తుకపోతున్నట్టుగా కలవస్తే, మరి కాసేపు సింగి, ఆడపులిలా తనమీదబడి గోమ్ములతో కుమ్ముతూ, తొడలతో నొక్కేస్తూ, పళ్ళతో తన పెదాలు కొరికేస్తూ, తన రక్తవీర్యాలు పూర్తిగా పీల్చేసిందాకా వదలనట్టు కల వచ్చేది.

"బాబూ! నా ఆవుని పులి యెత్తుకపోయిందా? చూసి వ్రాయకున్నారా?" ఆవేదనతో కుమిలిపోతూ వచ్చాడు భీందొర.

భూపతి లేచి కూచున్నాడు మంచంమీద.

"అవును దొరా! అంతా క్షణాల్లో జరిగిపోయింది. నేను పోయి చూసేలోపల, అది మీ ఆవుని నోట కరుచుకుని చీకట్లో అడివిలోకి పారిపోయింది" చెప్పాడు భూపతి.

"ఎంత పని జరిగిపోయింది బాబూ! నా తల్లిని ఎంత పనిచేసింది బాబూ ఆ పులి!" దుఃఖించాడు భీందొర.

"విచారించి లాభంలేదు దొరా! అయితే ఇప్పుడు పులిని వేటాడ్డం సులువు. చంపిన జంతువును వెంటనే తినేయదు పులి. ఎవరూ తనను వెన్నాడ్డంలేదని నిర్ధారించుకునేంతవరకూ, తన ఆహారాన్ని ఓ స్థలంలో దాస్తుంది. ఆ స్థలమేదో కనుక్కొని, కాసి అది తిరిగి ఆహారానికి వచ్చేటప్పుడు కాల్చి చంపాలి," అన్నాడు భూపతి, లేచి కాలకృత్యాలు తీర్చుకోవడానికి ఉద్యమిస్తూ.

"అలాగే బాబూ! మన వాళ్ళని గంటలో తయారయి ఉండమంటాను. అడివిలోకి వెళ్దాం" అంటూ వెళ్ళిపోయాడు భీందొర.

భీందొర ఇలా అటు వెళ్ళగానే, సింగి ఇటు వచ్చింది. ఆమె ముఖంలో ఎందుకో తీక్షణత, సన్నగా రాజుకున్న కోపం అవుపిస్తున్నాయి. అయినా, భూపతి వద్దంటున్నా, ఒళ్ళు తోమి నీళ్ళు పోసింది.

ఆ తరువాత పళ్లెంతో ఫలహారం తెచ్చిపెట్టి, అతని ముందరనుంచి వెళ్ళిపోయింది.

ఫలహారం తిని చెయ్యి కడుక్కొని గదిలోకి వచ్చాడు. కట్టుకున్న లుంగీ విడిచేసి, పాంటు అందుకున్నాడు తొడుక్కోవడానికి.

కాని, భూపతి చేతిలోని పాంటు ఊడి కిందపడింది. దానికి కారణం తెలుసుకోవాలని తలెత్తి చూసాడు. పరిస్థితి గ్రహించి, తప్పుకుందామని అతడనుకునే లోపల సింగి, అతని నగ్న శరీరాన్ని, బలంగా తన గుండెలకు అదుముకుంటూ ఉద్రేకపడుతోంది.

ఆమెను ఎలాగైనా వదిలించుకోవాలన్న ఆలోచన తప్ప, ఇంకో ఆలోచన లేదతడికి ఆ క్షణంలో.

"స్నానం చేసాక మలినం కావడం బావుండదు" అన్నాడు తన మొహాన్ని వెతుకుతున్న ఆమె మొహాన్ని తప్పించుకుంటూ.

సింగి ఆగింది ఒక్క క్షణం. కాని, అతడ్ని తన కౌగిలి నించి పూర్తిగా విడిచిపెట్టలేదు.

ఆమె చేతులు అతడ్ని ఆవరించుకునే ఉన్నాయి. ఆమె స్తనాలు, అతడి ఛాతీమీద ఒత్తుతూనే ఉన్నాయి ఇంకా బలంగానే.

అంటే, ఏదో వాగ్దానం చేస్తేగాని, ఆశ పెడ్తేగాని, ఆమె ఆ క్షణంలో విడవదన్నది అర్థమైంది అతడికి.

"ఈ రాత్రికి తప్పకుండా... ఒట్టు" అన్నాడు నమ్మకంగా.

"నిజంగా... మాట తప్పవుగదా?" అంది సింగి, చిరునవ్వు తెచ్చుకుని.

"నీమీద ఒట్టు... తప్పకుండా" ఆమె తలమీద చెయ్యేసి అన్నాడు.

అప్పుడు విడిచిపెట్టి వెళ్ళిందామె అతడ్ని.

భూపతి బట్టలు వేసుకుని సిద్ధంగా కూచున్న పావు గంటకుగాని భీందొర, కుర్రాళ్ళని వెంటబెట్టుకు రాలేదు.

లోడ్ చేసిన తుపాకీ భుజానికి తగిలించుకుని, త్రోవలో ఆకలేస్తే తినడానికి నాలుగు బిస్కట్టు పాకట్లు, ఓ తువ్వాలు, రగ్గు, కాసిన్ని సిగరెట్లు హేవర్ సేక్‌లో పడేసుకుని, బయలుదేరాడు భూపతి.

# 9

అడవిలో సంచరించే విద్యలో పులివంటి మేధావి ఇంకో జంతువు లేదు. అడవిలో నిట్టనిలువుగాపడే సూర్య కిరణాలు, చెట్ల ఆకులు, కొమ్మల నీడలతో కలిసిపోయేలా దాని రంగు రూపం ఉంటే, అది నడుస్తుంటే, శబ్దం గాకుండా, దాని పాదాల క్రింద మెత్తని మాంసం దిండ్లు ఉన్నాయి. చిన్న కొడవళ్ళవంటి పంజాగోళ్ళు, అది నడుస్తూంటే, పాదాల్లోకి ముడుచుకుపోతాయి.

అన్నివిధాలా దానికన్నా ఎన్నోరెట్లు తెలివితేటలున్న మనిషిని కూడా భ్రాంతిలో ముంచేసే చాకచక్యం ఉంది పులికి.

ఓసారి ఓ షికారీ, తన మనుషుల్ని తోడుపెట్టుకుని అడివిలోకి వెళ్ళాడు వేటకోసం. ఓ ప్రదేశాన్నెన్నుకుని, అక్కడున్న ఓ చెట్టుమీద మంచె కట్టడానికి నిర్ణయించు

కున్నాడు. అతని తోటి మనుషులు మంచెకు కావాల్సిన కొమ్మలు వగైరా యేర్పాటుచేసే పనిలో మునిగిపోయి, చెట్లకొమ్మలు నరకటం వగైరా చెయ్యసాగారు. ఆ చెట్టు పైనుంచి చూస్తే, అవుపించే, చిన్న పొదలోకి పులి రావాలని ఆ షికారీ అంచనా.

తన మనుషులు మంచెకట్టే ప్రయత్నంలో ఉంటే, ఆ షికారీ యథాలాపంగా చెట్టు ఎక్కాడు. మామూల్గాలుగా, పొదలోకి చూసాడు. అతడి గుండెలు ధన్‌మన్నాయి. ఆ పొదలో పులి ఉంది, ఎప్పుడు, ఎలా వచ్చిందో ఏమిటో.

ఆ రోజున ఆ షికారీ అతని మనుషులు సుమారు ఆరు గంటల సమయం ఆ ప్రాంతంలో గడిపారు. ఎన్నోసార్లు, దగ్గరున్న చెట్లు యెక్కి, ఆ పొదలోకి చూసారు. కాని పులి కన్పడలేదు వాళ్ళకు.

అది అంతసేపూ అక్కడే వుండి, వాళ్ళ కవుపించ లేదా? లేక, వాళ్ళు, తమ పనులలో ఉంటే, గాలిలా నిశ్శబ్దంగా ఆ పొదలోకి చొరబడిందా?

రెండూ సంభవమే! అదీ పులి చాతుర్యం! నీడకన్నా నిశ్శబ్దంగా, గాలికన్నా అదృశ్యంగా పులి వచ్చి వెళ్ళిపో గలదు.

ముందు రాత్రి భీందొర దొడ్డిలోని ఆవుని కూడా అంతే చాకచక్యంగా చంపి, క్షణాల్లో యెత్తుకుపోయింది.

ఆవుకు లేశమాత్రం కూడా అనుమానం కలగకుండా యెక్కడో దాక్కుని ఒక్కసారిగా తన అయిదువందల పౌన్ల బరువుతో దానిమీదపడి ఉంటుంది. ప్రమాదం గుర్తెరిగి ఆవు అరిచేలోపల, దాని మెడకొరికి, యెముకలు విరిచేసి ఉంటుంది. ఆ తరువాత అంతా మామూల్గాలుగా జరిగిపోయింది. ఎంత బలిష్ఠంగా, బరువుగా ఉన్న జంతువు

కళేబరాన్నైనా, అవలీలగా నోట కరచుకుని, ఎత్తుకు పోగలదు పులి మైళ్ళదూరం అయినా.

భీందొర దొడ్డిలో ఆవుని చంపిన ప్రదేశంనుంచి, త్రోవలో కన్పడే రక్తం గుర్తులుబట్టి, బయలుదేరారు భూపతి, భీందొర, డొంకిరిమెట్ట యువకులు.

గడ్డిమీద, మొక్కలమీద కారిన నెత్తురుబట్టి, మట్టిలోనూ ఇసకలోనూ అవుపించే పాదాల ముద్రలుబట్టి, పులి ఆవు కళేబరాన్ని లాక్కుంటూ పోయిన మార్గం కనుక్కోగలిగారు వాళ్ళు.

ఆ తరువాత ఆ చుట్టుపట్ల యెంత వెతికినా, యేలాంటి గుర్తులు ఆగపడలేదు.

"ఇక్కడెక్కడో పులి తన ఆహారాన్ని దాచింది. జాగ్రత్తగా వెతకండి" అరిచాడు భూపతి తనవాళ్ళ నుద్దేశించి.

నలుగురూ నాలుగు వైపులకూ కదిలారు.

ఆకాశంలో యెగిరే రాబందులుగాని, అడవిలోకి తిరిగే చిరుతపులులు, సింధువులు వగైరా మాంసభక్షకులు గాని చూడ్డానికి వీల్లేకుండా, తన ఆహారాన్ని అతి రహస్య స్థలంలో దాస్తుంది పులి. ఆ రహస్య స్థలం సాధారణంగా నీరు విరివిగా దొరికే చోటుకు పాతిక మున్పై గజాల్లో ఉండేలా చూసుకుని మరీ ఎన్నుకొంటుంది.

అడవిలో రకరకాల తుప్పలు, చెట్లు, పొదలు, ఎత్తైన గడ్డి గుబుర్లు ఉండి, నేలంతా ఎగుడు దిగుడుగా, అవతల ఏముందో ఊహించడానికి కూడా వీలులేకుండా వుంటుంది. అడవిలో సంచరించే విద్యలో పులి మేధావి కాబట్టి, అడవిలోని ప్రతి ఆకుని, తుప్పని, తన అవసరాలకు బాగా ఉపయోగించుకుంటుంది.

తుప్పల్ని ప్రక్కకు నెట్టుకుంటూ, పొదల్ని కదిలించి అందులోకి దూరి చూస్తూ, పాతిక చదరపుగజాల మేరని ప్రతి అంగుళం వెదకి చూసారు. కాని ప్రయోజనం లేక పోయింది.

ఇహ అలా వెదకడంవల్ల లాభం ఉండదని, దగ్గర్లో ఉన్న చెట్లన్నీ యెక్కి, గుబురుగానూ, మధ్యలో సమతల ప్రదేశంగానూ ఉన్న జాగా కనిపిస్తే చెప్పమని, తన వాళ్ళకు ఆజ్ఞాపించాడు భూపతి.

ఒకొక్కక్కరూ ఒకోక్క చెట్టు యెక్కి, అక్కడ్నించి తాము జాగ్రత్తగా పరిశీలించిన పరిసరాల్ని గురించి, దిగువనవున్న భూపతికి చెప్పసాగారు.

అలా ఇంకో గంట గడిచింది.

భూపతికి పదిగజాల దూరంలో ఉన్న చెట్టెక్కిన ధోరమ్ చెట్టుమీంచి "దొరా!" అంటూ గట్టిగా కేక పెట్టాడు.

ధోరమ్‌కు సమీపంగా పరుగెత్తాడు.

"ఏం?...ఏమైన కనబడ్డదా?" అరిచాడు భూపతి.

చెట్టుమీంచి ధోరమ్, చేతులూపుతూ, ఓ దిక్కుకు వెళ్ళమంటూ సైగ చేసాడు.

భూపతి, తతిమ్మా మనుషుల్ని తీసుకుని, ధోరమ్ సూచించిన దిక్కుకు బయలుదేరాడు.

అక్కడో నాలుగైదు పిచ్చి తుప్పలున్నాయి. ఆ తరువాత ఓ వెదురుపొద ఉంది. చూపరులకు మామ్మూలుగా, వెదురుపొద కవతల దగ్గరగా, దట్టంగా యెదిగిన వెదుళ్ళు తప్ప యింకేమీ లేవనిపిస్తుంది. కాని, నిజానికి ఆ వెదురు పొద మధ్య సుమారు ఇరవై చదరపు అడుగుల సమతల ప్రదేశం ఉంది.

వెదురుపొద మధ్యనుంచి యెలాగో చోటుచేసుకుని, లోనికెళ్ళిన భూపతి ఆ స్థలం చూసి ఆశ్చర్యచకితుడయ్యాడు.

ఆ ప్రదేశం పులితాలూకు డిన్నర్ టేబిలులా ఉంది. ఎందుకంటే, అక్కడ అంతటా ఎముకల పోగులున్నాయి. వాటి మధ్య గతరాత్రి భీందొర పశువుల కొట్టంలోంచి యెత్తుకొచ్చిన ఆవు కళేబరంకూడా ఉంది.

ఆవు తోక, కళేబరానికి నాలుగు అడుగుల దూరంలో పడివుంది. అంటే, తన డిన్నరు సిద్ధంచేసుకుని ఉంచుకుందన్నమాట పులి. ఇహ కానివ్వడమే తరువాయి.

ఆహారం తీసుకోవడం విషయంలో పులి కొన్ని వేళలు పాటిస్తుంది. సాధారణంగా సాయంకాలం నాలుగుగంటల తర్వాత, మునిమాపువేళకు ముందుగా, తను దాచుకున్న తిండి దగ్గరకు విధిగా వస్తుంది. చాలా అరుదుగా, నాలుగు గంటలకు ముందు వస్తుంది. ఎటువంటి పరిస్థితుల్లోనూ, రాత్రి తొమ్మిది తర్వాత, తన ఆహారం దగ్గరకు రాదు.

వాచీ చూసుకున్నాడు భూపతి. రెండుంపావు ఐంది. పులి తన ఆహారందగ్గరకు వచ్చేవేళ సమీపిస్తోంది. తను తిరిగి, ఊళ్ళోకి వెళ్ళి, భోంచేసి వెనక్కు రావడానికి, కావాల్సిన టైం లేదు.

పులి వచ్చే స్థలం కనుక్కోవడం జరిగింది. ఇహ పులి కోసం యెదురుచూసి, కాల్చి చంపడమే మిగిలి ఉంది.

మంచె కట్టుకుని, దానిమీద నుంచి పులిని చంపడం ఒక పద్ధతి. అలాగాకుండా, నేల యెత్తున, పులి రాబోయే స్థలానికి యిరవైగజాల దూరంలో, నేలమీదే కూచుని మాటుకాయడం యింకో పద్ధతి. రెండోదంటేనే,

భూపతికి చాలా యిష్టం.

పులి ఆవు కళేబరాన్ని దాచుకున్న ప్రాంతమంతా సర్వే చేసాడు భూపతి. చివరకు, ఆతని అవసరాలకు, అభీష్టాల కనుగుణంగా ఓ పొద కనిపించింది.

పొద మధ్యలో తాను విశాలంగా, విశ్రాంతిగా కూచోవడానికి వీలుగా బాగా అవుపించింది. కొద్ది మార్పులతో దాన్ని తన కనువైన స్థలంగా మార్చుకోవచ్చునను కున్నాడు.

"ఓ పలవల కర్ర, ఆకులూ, రెమ్మలూ ఉన్న కొన్ని కొమ్మలు కొట్టి, ఇలా పట్రండి" తన తోడువాళ్ళకు పని పురమాయించాడు భూపతి.

థోరన్ ఓ పలవల కర్ర కొట్టి తెచ్చాడు. దాన్ని, తను కూచోబోయే స్థలంలో కుడిప్రక్కగా, భూమికి ఓ గజం యెత్తుకు వచ్చేలా పాతిపెట్టాడు భూపతి.

పులికోసం యెదురుచూస్తూ కూచున్నంత సేపూ, తుపాకీ చేతిలో పట్టుకూర్చుంటే, పులి వచ్చే సమయానికి, చేతులు పీకుతాయి, దానివల్ల తుపాకీగురి తప్పవచ్చు. అంచేత తుపాకీ ఆనించి ఉంచడానికి, చప్పున అందుకోవడానికీ వీలుగా ఉండడానికి, పలవలకర్ర 'రెస్ట్ బార్' గా పనికొస్తుంది.

ఆ తరువాత మిగతా వాళ్ళు, నరికి తెచ్చిన కొమ్మల్ని, తను కూచునే స్థలంలో తను అగపడకుండా వుండడానికి, చుట్టూ, నేలలో పాతాడు.

తనతో తెచ్చిన రగ్గు నాలుగు మడతలు పెట్టి నేలమీద పెట్టాడు. వెనుక, హేవర్ సాక్ పడేసుకున్నాడు భూపతి.

రెస్ట్ బార్ మీద, లోడ్ చేసిన తుపాకీ ఆన్చాడు.

"ఇహ, మీరు ఇళ్ళకు వెళ్ళండి" అన్నాడు తనతో వచ్చినవాళ్ళతో.

"అళ్ళని వెళ్ళనియ్యండి. నేనుంటాను బాబూ మీకు తోడుగా" అన్నాడు భీందొర.

"అడవిలో ఒంటరిగా ఉండడం నా కలవాటే దొరా!... రెండో మనిషి నాతో ఉంటే వేట సాగదు. నువ్వూ వెళ్ళిపో దొరా!"

"మీకేమైనా ప్రమాదం కలిగితే..."

"నాకేం భయంలేదు. రాత్రికి పులిని చంపి, తెల్లవారేక మీ కా సంతోషవార్త చెప్తాను ... వెళ్ళండి" నచ్చ చెప్పాడు భూపతి.

అయిష్టంగానైతేనేం, భీందొర, ధొరమ్, మిగతా డొంకిరిమెట్ట మర్రాళ్ళు ఇళ్ళకు మళ్ళారు.

నిశ్శబ్ద వాతావరణంలో, అడివిలో, భూపతి ఒక్కడూ మిగిలాడు.

# 10

ఆకుల సందుల్లోంచి,అవతల వెదురుపొదల్లో ఉన్న ఆవు కళేబరం అవుపిస్తోంది భూపతికి స్పష్టంగా.

పులి వచ్చి తన డిన్నర్ ఆరగించడం ఆరంభిస్తే, భూపతికి కనిపించక పోవడమంటూ ఉండదు.

భూపతి రిస్టువాచీ చూసుకొన్నాడు. భీందొర వగైరా తనతో వచ్చిన మనుషులు వెళ్ళిపోయి సుమారు గంట గడిచింది.

అంతవరకూ వాళ్ళు చేసిన శబ్దం అంతం కాగానే, అడవి ఒక్కసారిగా మేల్కొన్నట్టయింది.

అంతవరకూ మనుషులు చేసిన శబ్దాలు వింటూ నోరు మూసుకొన్నున్న జంతువులు, పక్షులు, పురుగులు తమ గళాలు విప్పాయి. తమ స్వతంత్రాన్ని చాటుతూ, ఏవేవో కూతలూ, అరుపులూ చెయ్యసాగాయి.

కొన్ని కోతులు కొమ్మలమీద గెంతుతూ కిచకిచలాడు తున్నాయి. మరికొన్ని నేలమీదకు దిగి, వెర్రి అల్లరి ఆరంభించాయి. ఏవో వింతపురుగులు విచిత్రమైన ధ్వనులు చేస్తున్నాయి. ఉండుండి, యెక్కడినించో అడవికోళ్ళు చేసే గోల విన్పిస్తోంది.

హఠాత్తుగా కణుచు అరుపు వినిపించింది. అది ఆనందంతో చేసిన అరుపు కాదు. భయంతో, భీతావహమై పెట్టిన కేక అది.

కణుచు ఆగలేదు. అలా అరుస్తూనే ఉంది. అంటే, దగ్గరో ప్రమాదం పొంచివుంది, జాగ్రత్తగా ఉండండోహో అంటూ మిగతా జంతువులకు తెలియచేస్తూ కణుచు ఇస్తోంది సిగ్నలు.

కణుచు అరుపు, ఓ దుప్పి అందుకుంది.

పులి తనకు దగ్గరోనే ఉందనీ, తన డిన్నరు టేబిలు వద్దకు రావడమే తరువాయి అనీ అర్థం చేసుకొన్నాడు భూపతి.

భూపతి ఊపిరి దియ్యడంకూడా నిలిపేసాడు. ఆ క్షణంలో, ఆ ప్రాంతంలో ఉన్న చెట్టూ, చేమా, రాయీ రప్పల్లో ఒక్కటిగా అయిపోయి నిశ్చలంగా కూచున్నాడు.

వాతావరణం లాగిపట్టుకున్న బాణంలా బిగువుగా ఉంది.

ఐదునిముషాలు గడిచింది. పావుగంట గడిచింది. అరగంట గడిచింది. కాని ఏ నిముషానైనా రావచ్చు ననుకున్న పులి రాలేదు.

ఎందుచేత? తను ఇక్కడున్నట్టు పసిగట్టిందా?

పులి శ్రవణశక్తి అతి సునిశితమైంది. మనబూటులో వేలు ముడిచి వదిలినా చాలు, ఆ శబ్దం దానికి వినపడు తుంది. అంతే! ఒక్క అంగుళం ముందుకు వెయ్యదు కాలు.

తాము తెచ్చి దాచుకొన్న ఆహారం వద్దకు వచ్చే టప్పుడు పులులు ఎంతో నేర్పు, ఓర్పు ప్రదర్శించు తాయి. ఒక్కోసారి, రెండువందల గజాలు చుట్టూ తిరిగి గాని, అతి జాగ్రత్తగా, ప్రతి ఆకు కదలికనూ, ప్రతి గడ్డిపోచ ఊగటాన్నీ పరిశీలించి, ఎక్కడా ఏ ప్రమా దమూ పొంచి లేదని నిర్ధారించుకున్నాక గాని, తమ డిన్న రును సమీపించవు.

ఒక్కోసారి వాటి జాగ్రత్త చూస్తుంటే, పులుల్ని పిరికి జంతువులుగా పరిగణించాల్సి వస్తుందేమోనని అని పిస్తుంది.

చీకటి పడింది. వెన్నెల వచ్చింది. వెదురుపొదలో ఉన్న ఆవు కళేబరం దగ్గరకు పులి రాలేదు.

నిముషాలు గడిచిపోతున్నాయి. ఏ క్షణాన్నైనా పులి రావచ్చుననే తపన, ఇంకా రాలేదేం అన్న ఆరాటం, ఇహ ఇవాళ్టికి రాదేమోనన్న ఆలోచన కలిగించిన నిరాశ, ఒక్కసారిగా కలిగాయి భూపతిలో.

అతని ఒంట్లోని రక్తం, తలకు ప్రాకుతున్నట్టుగా అనిపించింది.

మరుక్షణంలో పులి రావచ్చునేమో నన్న ఆలోచన, అకస్మాత్తుగా అతని చేతిని వేపులోంది, తుపాకీ అందుకో మంటూ. కాని, అలాంటి అనుభూతి, అతనికి సామాన్య మేమో, తమాయించుకున్నాడు.

అడవి నిశ్శబ్దంగా అయిపోయింది.

అదే సమయంలో, అతని తొడను ఏదో పాకుతున్నట్టు అన్పించింది.

ఐతే, అదేమిటో తక్షణం చూడాలన్న కోరిక కలిగింది గాని, నిగ్రహించుకున్నాడు భూపతి.

ఇందాకటి పాదవడం పోయింది. ఐతే, తొడమీద బరువుగా, గరుగ్గా యేదో రాసుకుంటున్నట్టుగా అనిపించింది.

తల తిప్పినా, వేలు కదిపినా, అసలు తన శరీరంలో యేమాత్రం కదలిక చూపినా, పులి రాకుండా వెళ్ళిపోవడం ఖాయం.

అందుకే, అతను చెక్కిన శిల్పంలా నిశ్చలంగా కూచుండిపోయాడు.

ఐతే, అలాగని యేమీ చెయ్యకుండా ఊరుకోలేక పోయాడు. కనుగుడ్డు, మూలకంటా త్రిప్పి చూశాడు.

క్షణంపాటు అతని గుండె లయ తప్పింది.

భూపతి చూసింది, ఓ పెద్ద పాముని. అది సుమారు పది, పన్నెండడుగులుంటుంది. అతని తొడమీంచి, ఏదో బండమీంచి ప్రాకుతున్నట్టుగా ప్రాకుతోంది.

తన శరీరంలో యేమాత్రం కదలిక చూపకుండా, ఎంత తెలివిగా తను ప్రవర్తించాడో తలుచుకుని తనను తాను అభినందించుకున్నాడు మనసులో.

నిముషాలు యుగాలుగా, మన్వంతరాలుగా గడుస్తున్నాయి. పాము ప్రాకుతోంది. ఆ ప్రాకటానికి అంతు లేనట్లుగా ఉంది. ఉండుండి, మధ్యలో ఎందుకో ఆగిపోతోంది. కాసేపు కదిలి, మళ్ళా ఆగిపోతోంది.

వెదురుపొదలోకి పులి వస్తుంది, దాన్ని కొట్టాలి. అన్న

ఆలోచన భూపతి మనసులోంచి పూర్తిగా తుడిచిపెట్టుకు పోయింది.

ఐనా, వెదురు పొదమీదే దృష్టి నిలిపాడు, చేసేదేమీ లేక. అసలు అలా చెయ్యడమే ఆ క్షణంలో శ్రేయో దాయకం గనుక.

పాము కదిలి వెళ్ళిపోయింది. తొడమీది బరువు తగ్గింది. గుండె ఒక్కసారిగా తేలికబడింది.

కాని, గట్టిగా నిట్టూర్చడానికికూడా సావకాశం లేదు. ఎందుకంటే, పాము బెదిరి, చటుక్కున వెనుదిరిగి కరవ్వొచ్చు. లేదా రావాల్సిన పులి, ఆ మాత్రం సందడికే, రాకుండా వెనుదిరిగి పోవచ్చు.

క్షణాలు దొర్లిపోతున్నాయి. మళ్ళా, అడవిజంతువులు స్వేచ్ఛాగానాలు మొదలుపెట్టాయి.

అంటే, తనను తాను బయట పెట్టేసుకున్నాడు పులికి, అనుకున్నాడు భూపతి.

ఇహ, యీ రాత్రి వృధా అయినట్టే!

నడుం కొయ్యలా బిగుసుకుపోయినట్టుగా వుంది. ఒహటే పీకుతోంది. వెచ్చని పడకకోసం, మనస్సు ఉవ్విళ్ళూరుతోంది.

వెంటనే లేచి గ్రామం వెళ్ళిపోవాలనుకున్నాడు. కాని, తనకు త్రోవ అంతగా పరిచయంలేదు కాబట్టి, తప్పవచ్చు.

భూపతి ఆలోచన సింగిమీదకు మళ్ళాయి.

మొదట, ఆ రోజు రాత్రి అందరి మధ్యలో నిలబడి, సింగి నాట్యం చేసినపుడు, నిజంగానే సింగి అందాలు తన మగతనాన్ని రెచ్చగొట్టాయి. తనలో యువకత్వాన్ని మేల్కొల్పాయి. కాని, సడెన్‌గా, సింగి అంటే ఏహ్యత,

జుగుప్స యేర్పడలేదు గాని, మొదటిలా వాంఛించలేక పోతున్నాడు.

సింగి గురించి ఆలోచనలు అంత రుచికరంగా లేవు భూపతికి.

వెన్నెల్లో వెలిగిపోతున్న ప్రకృతిసుందరిని, నిశ్శబ్దంగా ఆరాధించే పనిలో లగ్నమయ్యాడు.

# 11

రాత్రి యెప్పుడు నిద్ర ముంచుకొచ్చిందో యేమో, పూర్తిగా తెల్లవారేసరికి, ఉన్నచోటనే కూచుని జోగుతున్నాడు భూపతి.

ఒకసారి గట్టిగా జోగి, ముందుకు పడబోయి, తమాయించుకున్నప్పుడు, మెలకువ వచ్చేసింది అతడికి.

కళ్ళు మండుతున్నాయి. ఒళ్ళంతా ఒకాటే సల్పుతోంది. గట్టిగా ఆవులించి, ఒళ్ళు విరుచుకుని, లేచి నిలబడ్డాడు. వెదురుపొదవైపుకు చూసాడు.

పులి తన ఆహారాన్ని ముట్టలేదు. ఆవు కళేబరం, ముందురోజు చూసిన విధంగానే పడివుంది.

అసలు రాత్రి, పులి ఆ పరిసరాలకు వచ్చిందా అన్న అనుమానం కలిగిం దతడికి.

పులి వచ్చివెళ్ళిన గుర్తుల్ని వెదుక్కుంటూ బయలుదేరాడు.

ఎంత జాగ్రత్తగా ఉన్నా, తన ఉనికిని పులి యెలా గ్రహించిందో అర్థంగాలేదు.

పులి తన ఆహారానికి సుమారు పదిహేను గజాల దూరంవరకూ వచ్చి, ప్రమాదం ఉందని ఎలాగో నిర్ధారించుకుని, తన ఆహారాన్ని ముట్టకుండా వెళ్ళిపోయింది.

ఇంచు మించు, పులి ఓ పెద్ద ప్రదక్షిణమే చేసింది. అది మొదట భూపతి ఉన్న దిక్కునుంచే వచ్చింది. భూపతి వెనుగ్గా పాతిక గజాల దూరంలోకి వచ్చింది. కుడిప్రక్కకు మళ్ళింది. అక్కడో అరగంటకుపైగా ఆగి వుంటుంది. ఆ తరువాత తిన్నగా, అంటే, భూపతికి ఎదురుగా, తన ఆహారానికి, పదిహేను గజాల దూరంలోకి వచ్చి ఆగింది. బహుశా, అక్కడో అరగంటో, గంటో ఆగి వుంటుంది. దాని అనుమానం నివృత్తి అయ్యుండదు. మరి కాస్త ఎగువకు వెళ్ళింది. అక్కడినించి, పులి అడవి లోకి వెళ్ళిపోయినట్టు, మట్టిలో గుర్తులున్నాయి. అంటే, అక్కడే దానికి భూపతి ఉనికి గురించి రూఢిగా తెలిసి వుంటుంది.

కానయితే, పులి యెలా గుర్తు పట్టింది, తను వున్నట్టు? ఎప్పటిలా అది శేషప్రశ్న అయి కూర్చుంది భూపతికి.

"బాబూ! భూపతి బాబూ!"

భీందార కేక విన్నడ్డంతో భూపతి ఆలోచనలు ఆగి పోయాయి.

తనున్న చోటునుంచి గబగబా వెలికివచ్చి, గ్రామం నుంచి వచ్చిన భీందార వగైరా మనుషుల్ని కలుసుకున్నాడు భూపతి.

"చచ్చిందా బాబూ!...ఆ రాక్షసి...ఏదీ?" అడిగారు ఆత్రంగా అందరూ.

సిగ్గుపడి, తల వంచుకుని, "లేదు... నేను వున్నట్టు అది పసిగట్టి రాకుండా పారిపోయింది" అని చెప్పి, పులి యెలా తన అపూర్వమైన తెలివితేటలు ప్రదర్శించి తనని తప్పించుకుందో గుర్తులు చూపి వర్ణించాడు భూపతి.

గ్రామస్తుల మనస్సుల్లో నిస్పృహ ఆవరించింది. భూపతి ఎన్ని చెప్పినా, ఆ భావం తొలగిపోలేదు.

'కుర్రాడు ఇతనికేం తెలుసు పులివేట?' అన్న భావ ముద్ర కొందరి మొహాల్లో ఉంటే 'కబుర్లేగాని క్రియ శూన్యం' అన్న భావం మరి కొందరి మొహాల్లో ఉంది.

ఒక్క భీందొర మొహంలో మాత్రం, భూపతి సామర్థ్యంమీద సడలని విశ్వాసం ఉన్నట్టుగా ఫీలింగ్ ఉంది.

భూపతి బాగా అలసిపోయాడు. అప్పటికి ఉదయం ఎనిమిదిన్నరైంది.

వెంటనే గ్రామంవెళ్ళి, సుష్టుగా భోంచేసి, రెండు మూడు గంటలు నిద్రపోతేగాని, మధ్యాహ్నం మళ్ళా వేటకు రావడానికి టైం ఉండదనుకున్నాడు.

"ఇహ వెళ్దాం పదండి...బాగా అలసిపోయాను" అన్నాడు భూపతి బయల్దేరుతూ.

తతిమ్మావాళ్ళుకూడా, గ్రామంవైపు బయలుదేరారు.

# 12

పళ్లెం నిండుగా అన్నం, పైన మాంసంకూర పెట్టి, భోజనం తెచ్చింది సింగి.

అంతవరకూ చూపులతో నమిలేస్తోంది గాని, చేరువగా వచ్చే సాహసం చెయ్యలేదు. కారణం, అది పట్టపగలు అయ్యుండడమో, లేదా అదేపనిగా భీందొర వస్తూ, పోతూ ఉండడమో అయ్యుంటుంది.

ఏది ఏమైనా, భోజనం అయిపోయాక, తను పూర్తిగా విశ్రాంతి తీసుకోవాలి. అప్పుడుగాని, సాయంకాలం వేటకు వెళ్ళలేదు.

ఐతే, సింగిని దూరంగా వుంచేదెలా? భూపతి చకచకా ఆలోచించాడు.

ఏదో పనిమీద సింగి అవతలికి వెళ్ళడం జరిగితే, లోపల గడియలు పెట్టి, వీధిలో భీందొరను కాపలా పెడితే, తన ఉద్దేశం నెరవేరుతుంది.

భూపతి భోజనం ముగించాడు. సిగరెట్టు వెలిగించాడు.

నేలను కాళ్ళు అంటుకుపోయినట్టుగా, ఎదురుగానే నిలుచుని భూపతిని చూస్తోంది సింగి అంతసేపూ.

తను భోంచేసిన ప్రదేశంలో గిన్నెలు, పళ్ళేలు, గ్లాసులు, నేలమీద జల్లబడ్డ మెతుకులతో అసహ్యంగా, చీదరగా ఉంది. వాటిని చూడగానే, సింగిని యెలా బయటికి పంపాలో ఐడియా వచ్చింది భూపతికి.

"ఈ గిన్నెలవీ అసహ్యంగా ఉన్నాయి. ఎత్తేసి, శుభ్రం చేసి రారాదూ, తీరిగ్గా మాటాడుకోవచ్చు" అన్నాడు భూపతి, పెదాలమీద తెచ్చిపెట్టుకొన్న నవ్వుతో, కళ్ళల్లో కొంటెతనం కన్పరుస్తూ.

అతని మాటల్లో ఆమె అంతవరకూ ఆశించని ప్రోత్సాహం అవుపించింది.

"అలాగే బాబూ!" సంబరపడిపోతూ బయటకు కదిలింది సింగి.

సింగి అలా వెళ్ళగానే, ఇలా భీందొర వచ్చాడక్కడికి.

"దొరా! లోపల గడియలు పెట్టి పడుకుంటాను. ఎవర్నీ లేపనీకు నన్ను. గుమ్మంలో కూచో" అన్నాడు భూపతి.

"అలాగే బాబూ!...హాయిగా పడుకోండి" అంటూ భీందొర వీధిలోకి వెళ్ళి కూచున్నాడు.

గబగబా సిగరెట్టు నాలుగుదమ్ములు పీల్చి, పీకని వీధిలోకి విసిరేసాడు. వెంటనే ఇంట్లోకి వచ్చి, గడియలు

బిగించి మంచంమీద వాలిపోయాడు.

శరీరం ప్రక్కకు తగలగానే, నిద్ర ముంచేసింది భూపతిని. కలలులేని కమ్మని గాఢనిద్ర పట్టింది అతడికి.

అలా చాలాసేపు నిద్ర పోయినట్టుగా గుర్తు అతడికి. కాని, అతడికి మెలకువవచ్చే సమయానికి తననెవరో కుదుపుతున్నట్టుగా అనిపించి కళ్ళు తెరిచి చూసాడు.

వెల్లకిలా పడున్న తన మొహానికి పైన చేరువగా సింగి మొహం కన్పించగానే, ఆశ్చర్యపోయాడు.

తన ఒంటిమీద బట్టలులేవు. సింగి సరేసరి. ఒంటిమీద ఒక్క నూలుపోగులేకుండా, భూపతిని నిలువునా ఆక్రమించి ఉంది. కండల్లాంటి ఆమె రొమ్ములు అతడి ఛాతీని అదిమేస్తున్నాయి కసిగా.

చట్టున లేచి కూచున్నాడు భూపతి.

ఆమె లోనకెలా వచ్చింది?

ఆమె అతడ్ని విడవలేదు. రెచ్చుతున్న కామంతో అతడ్ని అల్లుకో జూస్తోంది.

"భీందొర యేడీ?" అడిగాడు భూపతి, మొగుడి పేరెత్తితే, ఆమె స్పృహలోకి వచ్చి, మామూలు కావచ్చునేమో అని.

"జీలుగు కల్లు తేవడానికి వెళ్ళాడు" చెప్పింది సింగి. ఆమెలో మార్పులేదు, భూపతి ఆశించినట్టుగా.

"బయట వుండమని చెప్పానే."

"ఆ సంగతి నాకు తెలుసు. అందుకే జీలుకు కల్లుకోసం అడివికి పంపాను. పడుచు పెళ్ళాన్ని ప్రక్కలో తృప్తిపరచకపోయినా, అడిగింది, తెచ్చయినా తృప్తిపరచాలి గదా!"

"లోపల గడియలు వేసానే... యెలా వచ్చావ్?"

"ఈ గడియలు ఎందుకూ పనికిరావు... కాస్త బలం ఉపయోగిస్తే."

గడియలు విరగ్గొట్టి, దొడ్డివైపునించి లోనికి వచ్చింది సింగి అన్న విషయం అర్థమై, భూపతి గుండె గుభేలు మంది.

సింగిని సున్నితంగా ప్రక్కకు తోసి, మవునంగా లేచి, బట్టలు వేసుకోసాగాడు.

"రాత్రికే... అంటూ ఆశ పెట్టావు. రాత్రికి అడవిలోనే ఉండిపోతావన్న విషయం మర్చిపోయి నమ్మాను. ఇప్పుడు అవకాశం వచ్చినా తప్పించుకుంటున్నావేం?" అంది సింగి, ఇంకా నగ్నంగా భూపతి ప్రక్కమీద కూచుని, లేచి బట్టలు వేసుకునే ప్రయత్నం చెయ్యకుండా.

"లేదు. అప్పుడే రెండు కావస్తోంది. పులి వచ్చి ఆహారం తిని వెళ్ళిపోయిందంటే, దాన్ని చంపడం ఇంకా కష్టమై పోతుంది" అంటూ మరి సింగిని పట్టించుకోకుండా, అడవికి వెళ్ళడానికి సిద్ధం కాసాగాడు.

అదే సమయంలో, వీధి తలుపుమీద టకటకమన్న చప్పుడయ్యింది.

"ఎవరదీ?" గట్టిగా అన్నాడు భూపతి.

"నేను బాబూ! దొరని. వేళయినట్టుంది. లేపుదామని" అన్నాడు భీందొర అవతలి వైపునించి.

"ఇదిగో తయారుగానే ఉన్నాను" అని అన్నాడు గాని, తలుపులు తెరిచే ప్రయత్నం చేయ్యలేదు భూపతి.

పరిస్థితి చెయ్యి దాటిందని అర్థం చేసుకుంది సింగి. మాటాడకుండా లేచి, బట్టలు కట్టుకుని, దొడ్డి దోవగుండా వెళ్ళిపోయింది.

ఇచ్చింది, తొలగిపోయినందుకు గట్టిగా నిట్టూర్చి, తలుపులు తెరిచి భీందొరను లోనికి రమ్మన్నాడు భూపతి.

# 13

భూపతి యీసారి తను మాటు కాయాల్సిన జాగా మార్చాడు.

ముందరి రోజులానే, చెట్లకొమ్మలు నరికించి తను మాటు కాసే స్థలంలో, తన చుట్టూ కొన్ని, తన తలమీద కొన్ని, తను బయటపడకుండా, నేలలో పాతించాడు. గత రోజు ఉపయోగించిన పలవల కర్ర మార్చకుండా, రెస్ట్ బార్ గా, కొత్త జాగాలో పెట్టుకున్నాడు.

అన్ని యేర్పాట్లూ చేసి, భూపతి తన మాటులో కూచున్నాక, భూపతితో వచ్చిన మనుషులు గ్రామం తిరిగి వెళ్ళిపోయారు.

భూపతి తన చూపు వెదురుపొదలో వున్న ఆవు కళేబరం మీద నిల్పాడు.

నిముషాలు దొర్లిపోతున్నాయి.

భూపతి వాచీ చూసుకొన్నాడు. అయిదుగంటలు దాటి ఇరవై నిముషాలయింది.

'చారల దొరగారు ఇంకా డిన్నరుకు రాలేదేం. నిన్న ఉపవాసం చేసారు కూడాను'' అనుకున్నాడు భూపతి.

వాతావరణం ప్రశాంతంగా ఉంది. పురుగులు రొద, పక్షులు ఉండుండి వేసే కేకలు వాతావరణాన్ని ఆహ్లాదకరంగా చేస్తున్నాయి.

క్రూరమృగాల భయం ఉన్నా, రాక్షసులు పెట్టే బాధలకూ లోనుకావాల్సిన ప్రమాదం ఉన్నా, మునులు, ఋషులు, అడవుల్నే ఆశ్రయించి వుండేవారు అందుకే.

హఠాత్తుగా, అడవి ప్రశాంతతను భగ్నం చేస్తూ, ఓ అడవి పంది పెట్టిన కేక విన్పడింది.

ఏమేమో ఆలోచిస్తున్న భూపతి మెదడు చట్టున, నిగ్రహించుకుంది, తన ఆలోచనల్ని.

అదే సమయంలో, చెట్లమీది హనుమంతులు, అటూ ఇటూ కొమ్మలమీద అవిరామంగా గెంతుతూ, తమ ఆరాటాన్ని చాటుతున్నాయి.

అంటే, అడవి రాజుగారు, రంగంలోకి ప్రవేశించారు. ఇహ, ప్రదర్శన ఇవ్వడమొక్కటే తరువాయి.

భూపతి నిశ్చలంగా కూచున్నాడు, రాతి బండల్లో రాతిబండలా, మానుల్లో మానులా.

ఊపిరి తీయడం కూడా అతి నిగ్రహంతో చేస్తున్నాడు.

ఈసారి, ఓ దుప్పి బేలగా అరవడం ఆరంభించింది.

పురుగులు, పక్షులు చేసే రొద ఆగిపోయింది.

ఒక్కసారిగా, కాలం ఆగిపోయినట్టుగా అయిపోయింది.

తుఫాను ముందరి ప్రశాంతత, ఘోరం జరిగేముందు నిశ్శబ్దం ఇలాగే ఉంటాయి కాబోలు అనుకున్నాడు భూపతి.

అతని గుండెల చప్పుడు అతనికే విచిత్రంగానూ, దుర్భరంగానూ విన్పిస్తోంది.

తన చూపు వెదురు పొదమీద నిలిపాడు.

ఏ క్షణాన్నైనా, పులి దర్శన మివ్వవచ్చు.

భూపతి నరాల్లో రక్తం ఒక్కసారిగా, అతని తలలోకి పరిగెడుతున్నట్టు అన్పించింది.

వన్యమృగాల్ని వేటాడ్డంలో చాలా పద్ధతులున్నాయి. బాజాలు మోగిస్తూ కొందరు పనివాళ్ళు, ఆయా జంతువుల స్థావరాల్లోంచి బయటకు తరిమి, షికారీకి ఎదురుగా

వచ్చేలా చేస్తారు. నేలకు ముప్ఫైఅడుగుల ఎత్తున ఓ మంచె కట్టుకుని, లేదా ఏనుగు అంబారీల్లో కూచుని, వచ్చిన జంతువుల్ని కాల్చి చంపుతారు.

చిన్నసైజు యుద్ధానికి చేసే భారీయెత్తు ఏర్పాట్లు జరుగుతాయి అలాంటి వేటలకు.

ఆ రకం వేటంటే, భూపతికి యిష్టంలేదు.

అడవి జంతువుల్ని, అవి తిరిగే ప్రదేశాల్ని కనిపెట్టి, మాటు కాసి, వాటిని కొట్టి చంపడంలో ఉన్న ఆనందం ఇంక దేనిలోనూ లేదు.

అకస్మాత్తుగా, భూపతి ఒళ్ళు మండుతున్నట్టుగా అనిపించింది.

ఏమైంది? తనను తాను ప్రశ్నించుకున్నాడు.

కారణం కనుక్కోవడానికి తనకు టైమూ, అవకాశమూ లేవు. ఆ ఫీలింగుని నిర్లక్ష్యంచేసి ఊరుకొన్నాడు.

రెండు క్షణాలు గడిచాక, మళ్ళా మండినట్టయింది, కాని, యీసారి మంట మంటలా లేదు. సూదులతో పొడుస్తున్నట్టుగా ఉంది.

కారణం కనుక్కోవాలన్న కోరిక బలంగానే కలిగింది కాని, తను యేమాత్రం కదిలినా, శబ్దంచేసినా, రంగం లోకి దిగిన చారల దొరగారు, దర్శనం ఇవ్వకుండానే వెళ్ళిపోతారు.

మంటను ఓర్చుకోవడానికి నిశ్చయించుకున్నాడు.

కాని, ఎంతోసేపు ఆ నిశ్చయం ఉండేటట్లు లేదు.

మంట క్షణక్షణానికీ యెక్కువ కాసాగింది. ఒళ్ళంతా వేలకొద్దీ సూదులు ఒకేసారి దింపినట్టుగా బాధ కలగ సాగింది.

పంటిక్రింద పెదవిని నొక్కిపట్టి, తన మనోబలం అంతా ఉపయోగించి, బాధను సహింపజూసాడు.

కాని, ఆ నొప్పి దుర్భరమైపోయింది. అప్రయత్నంగానే, అతని చేతులు కదిలి, తన బాధకు కారణమేమిటో కనుక్కోవడానికి ప్రయత్నించాయి.

ఓరి దేవుడా! ఎంత పని జరిగిపోయింది! తను తిన్నగా వచ్చి ఎర్రచీమల పుట్టమీద కూచున్నట్టుగా యిందాకే తెలుసుకుని ఉండాల్సింది!

ఏంచెయ్యడం? ఊరుకుంటే, ఎర్రచీమలు తన ఒళ్లంతా కరిచి పారేస్తాయి.

మంట, నొప్పి, క్షణక్షణానికీ దుస్సహమైపోసాగింది.

డామిట్! ఇంకో రోజు వృధా అయింది! అనుకుంటూ, తన మాటులోంచి వెలుపలికి వచ్చాడు.

తన ఒంటిమీది బట్టల్ని గబగబా ఒకటి తర్వాత ఒకటి విడిచేసాడు.

నట్టడివిలో, పులికోసం వచ్చి, బర్త్ డే సూటులో నుంచోవడం తలుచుకుని విపరీతంగా నవ్వొచ్చింది భూపతికి.

ఒంటిని కరచి పట్టుకున్న చీమల్ని, చేతులతో పట్టుకుని పీకుతున్నాడు. కాళ్ళు నేలమీద తాటిస్తూ కొన్నిటిని దులిపేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు.

'అడివిలో కథాకళి' అనుకున్నాడు భూపతి, పూర్తిగా పులి గురించి మర్చిపోయి.

అదే సమయంలో 'లక్ లక్' మంటూ పెద్దగా శబ్దం కావడం ఆరంభించింది. తలెత్తి ఆ శబ్దానికి కారణమేమిటో పరిశీలించాడు.

పులి యెప్పుడు వచ్చిందో, యేమో, తన ఆహారం ఆరగింపు ఆరంభించింది.

రాస్కెల్! ఎంత తెలివైంది! తను దాన్ని కాల్చే పరిస్థితిలో లేడని గ్రహించి సాహసించింది.

నో! నో! లాభంలేదు! ఇంతటి గొప్ప అవకాశం మరి రాదు.

నాలుగడుగుల దూరంలో ఉన్న తుపాకీమీద దూకి అందుకుని, పులిని కాల్చిపారేయాలన్న కోరిక ఆపుకోలేక పోయాడు.

కాని ఆలోచించాడు.

ఆ విధంగా తొందరపడడంవల్ల, పులికి హుషారిచ్చి, తరిమేసిన వాడవుతాడుగాని, చంపడం జరగదు.

పులి, తన ఆహారాన్ని ఇప్పుడిప్పుడే తినడం ఆరంభించింది. అంటే, కాసేపు ఉంటుంది. తను యెప్పటిలా, దాన్ని గమనించనట్టుగానే ఉండాలి.

ఒంటిమీది చీమల్ని దులుపుకుంటూనే, మెల్లగా, తుపాకీ దగ్గరకు కదిలాడు భూపతి. కదిలినప్పుడు, తన చూపులు పొదలోని పులిమీదే నిలిపాడు.

అది, తిండి తినడంలో లీనమయింది.

భూపతి, తన తుపాకీ దగ్గరగా నిలుచున్నాడు. వంగి తీయడమే ఉంది.

ఇంకా, కొన్ని చీమలు భూపతి శరీరాన్ని పట్టివున్నాయి. అవి నిర్దాక్షిణ్యంగా కరిచేస్తున్నాయి.

అయితే, వాటిని పట్టించుకునే స్థితిలో లేడు భూపతి. మెల్లగా - ఎంతో మెల్లగా - చాలా మెల్లగా - వంగాడు. తుపాకీని అందుకున్నాడు అంతే మెల్లగా.

ఎంత మెల్లగా వంగాడో, అంతే మెల్లగా - ఎంతో మెల్లగా - పులిని తన డిన్నర్‌నుంచి కంగారుపెట్టకుండా- తుపాకీ పట్టుకుని లేచి నిలుచున్నాడు.

చల్లగా తుపాకీని, పులివైపు గురిపెట్టాడు.

అవతల అవుపించిన దృశ్యం చూసి, భూపతి గుండెలు దిగులుతో బరువెక్కాయి.

పులి వెనుకభాగం తనవైపు ఉంది.

అంటే, తను కాలిస్తే, పులిని దెబ్బతీయగలడుగాని, చంపలేడు. ప్రాణాలుతోదేసే భాగాలన్నీ అటువైపే ఉన్నాయి.

చూడ్డానికి పులికి బెత్తెడు నుదురు ఉన్నట్టుగా ఉంటుంది. కాని, పులికి నుదురులేదు. దాని మెదడును కొట్టి చంపాలంటే, దానికి కళ్ళమధ్యగా గురిచూసి కొట్టడమే! దాని తరువాత చెప్పుకోవాల్సిన భాగాలు, పులి మెడ. మెడను భుజాన్ని కలిపే భాగం. ఈ భాగాల్లో కొడితే, పులి గుండె, ఊపిరితిత్తులు దెబ్బతిని పులి కచ్చితంగా చచ్చే అవకాశాలున్నాయి. ఇవా వెనుక వైపు కిడ్నీలు దెబ్బతినేలా కొడితే తప్ప, ఇంకెక్కడ కొట్టినా, పులికి దెబ్బ తగులుతుందిగాని చచ్చిపోదు.

తన అదృష్టం ఇలా పుచ్చిపోయిందేం? వేటలో వేటగా? సాహసం తెలివితేటలకు తోడు, కాస్త అదృష్టం కూడా వుండాలన్న విషయం పేరుమోసిన షికారీలు కూడా ఒప్పుకుంటారు.

అయినా, తను ఓర్మి, సహనం చూపాలి. వేటలో కావాల్సిన ప్రధాన గుణాలవే గదా!

అయిదు నిముషాలు గడిచాయి. పులికాస్త ప్రక్కకు తిరిగింది. దాని సైడుఫోజు అవుపిస్తోంది. చక్కగా, దాని

మెడ, భుజం భాగాలు అవుపిస్తున్నాయి.

జై జగన్మాతా! తమ ఇలవేలుపును తలుచుకుంటూ, ట్రిగ్గర్ నొక్కాడు. 'ఢాం' అన్న శబ్దం అడివి నిశ్శబ్దాన్ని తునాతునకలు చేసింది.

పులి వెనక్కి యెగిరిపడింది. నేలమీదపడి కొట్టుకుంటోంది బాధతో మూలుగుతూ.

మళ్ళా ఇంకోసారి! జాగ్రత్తగా గురిచూసి కాల్చాడు. ఈసారి అది కొట్టుకోవడం ఆగిపోయింది. దాని బాధ అంతమైంది.

అయిదు నిముషాలు ఆగాడు. పులిలో చలనం లేదు.

అంటే, అది చనిపోయిందని నిర్ధారించుకున్నాడు.

మెల్లగా అడుగులేసుకుంటూ పోయి దాన్ని సమీపించాడు. తోక పట్టుకుని చూసాడు. అది ఆడపులి!

పులి చచ్చిపోయింది! తను సాధించాడు!

సక్సెస్! సక్సెస్! గట్టిగా కేకలుపెడుతూ గెంతులేసాడు భూపతి.

ఒక్కక్షణం పోయాక, తాను నగ్నంగా వున్నాడన్న విషయం గుర్తుకొచ్చింది. విప్పిపారేసిన బట్టల్ని, గట్టిగా దులిపి, తొడుక్కోసాగాడు.

"భూపతి బాబూ!" ఆ గొంతు భీందొరది.

భూపతి ఆశ్చర్యపోయాడు.

"ఇంటి కెళ్ళలేదా దొరా?" అడిగాడు భూపతి.

"లేదు బాబూ! ఇక్కడికి కాస్త దూరంలో చెట్టుక్కూర్చున్నాను. మీ వెంట ఉంటానంటే ఉండనివ్వరని అలా చేసాను. అం బాబూ! ఆ దొంగముండ చచ్చిందా" అన్నాడు భీందొర ఆత్రతగా.

"వచ్చింది దొరా! ఇదిగో" అంటూ ఆడపులి కళేబరాన్ని చూపాడు భూపతి.

"నాకు తెలుసు బాబూ! సాధిస్తారు. నాకు తెలుసు బాబూ!" అంటూ చెమర్చేకళ్ళతో, భూపతిని గట్టిగా కౌగలించుకున్నాడు భీందొర.

"ఒళ్ళంతా ఎర్రచీమలు కరిచేసాయి దొరా! ఒళ్ళంతా ఒకటే మంటగా వుంది" చెప్పాడు తన పరిస్థితి గురించి.

"పద బాబూ! విశ్రాంతి తీసుకుందురుగాని. పసరొకటి ఉంది రాస్తాను. తెల్లవారేసరికి అంతా పోతుంది"అన్నాడు భీందొర.

తన సామాన్లన్నీ భీందొరకు అందించి, భీందొర వెంట బయలుదేరాడు భూపతి.

వాళ్ళు డొంకిరిమెట్ట చేరుకునేసరికి, రాత్రి తొమ్మిది గంటలయింది. వెన్నెల పుచ్చపువ్వులా కాస్తుండడంవల్ల, అడవిలో నడక కష్టం కాలేదు వారికి.

## 14

"ఒరేయ్! రండర్రోయ్! మన భూపతి బాబు పులిని కొట్టేసి నాడర్రోయ్!" అంటూ కేకలుపెట్టాడు భీందొర, ఊర్లోకి వస్తూనే.

డొంకిరిమెట్ట జనం, భూపతి చుట్టూ చేరారు.

"మా ప్రాణాల్ని కాపాడారు బాబూ!"

"మా పశువుల్ని రక్షించారు బాబూ!"

"ఈ పుణ్యం మిమ్మల్ని కలకాలం కాపాడతాది బాబూ!"

అలా రకరకాలుగా కొందరు భూపతికి కృతజ్ఞతలు చెప్పుకుంటుంటే, మరికొందరు అతన్ని ఆశీర్వదించారు.

పులి చచ్చిన వార్త తెచ్చిన సందడి తగ్గడానికి, జనం ఇళ్ళకు వారు మళ్ళడానికి ఓ గంటపట్టింది.

అప్పటికి రాత్రి పదిగంటలు దాటి పదినిముషాలయ్యింది. భూపతి శరీరం అంతా దద్దుర్లు యెక్కిపోయి, యెర్రగా వాచింది.

అతడి బట్టలన్నీ విప్పించేసి, గాలీ వానా ఆకు పసరు తెచ్చి, ఒళ్ళంతా రుద్దాడు భీందొర తన చేతులతో.

పావుగంట గడిచేసరికి, ఒంటి నొప్పులు తగ్గాయి. సుఖంగా నిద్రపట్టింది భూపతికి.

భూపతి ఉదయం నిద్రలేచేసరికి, పదిమంది మనుషుల్ని తీసుకెళ్ళి పెద్దపులి కళేబరాన్ని ఊర్లోకి తీసుకొచ్చాడు భీందొర.

తమ బంధువుల్ని, పశువుల్ని పొట్టబెట్టుకున్న ఆ పులి చచ్చినందుకు ఆ ఊరి ప్రజలు దాని కళేబరం చుట్టూ గెంతులేస్తూ నాట్యం చేసాడు.

తను చంపిన పెద్దపులిని ఒక్కసారి పగటి వెల్తురులో చూడాలనిపించింది భూపతికి.

జనం మధ్యలో పడివున్న పులి కళేబరం దగ్గరకు వెళ్ళి చూసాడు.

తను కాల్చిన గుళ్ళు రెండూ మెడలో నాలుగంగుళాల దూరంలో తగిలాయి పులికి.

తలకాయనుంచి, తోకవరకూ మూరతో కొలిచాడు. ఆరుమూరలుంది సుమారుగా. అంటే, తొమ్మిదడుగుల పొడవుందన్న మాట. బరువు తక్కువలో తక్కువ 400 పౌను లుండవచ్చు.

పులి బాగా ముసలిదై పోయింది. కండరాల్లో జవ తగ్గడంవల్లనే, చురుగ్గా, చలాకీగా పరుగెత్తే అడవి

జంతువుల్ని వేటాడే శక్తి లేక, పశువుల్ని, మనుషుల్ని తినడం మరిగింది.

దాని చర్మం అమ్మితే బజార్లో రెండువేలు సుమారు ధర పలుకుతుంది.

"దొరా!... నేను వచ్చినపని ఐపోయింది... దీని చర్మం తీసి నువ్వు బజార్లో అమ్ముకో. పెర్మిషన్ యిస్తున్నాను. పోయిన నీ ఆవుకు బదులు ఓ మంచి ఆవు కొనుక్కో..." అన్నాడు భూపతి, భీందొరను సమీపించి.

"అదేమిటి బాబూ! అలాగంటున్నారు మీరు?... మాకీ సాయం చేసినందుకు మీకే మేం సాయం చేయాలి" అన్నాడు భీందొర.

"లేదు దొరా!...మీ ఆతిథ్యం నాకెంతో ఆనందం కలిగించింది. ఈ రెండురోజులూ మీ రెంతో ప్రేమగా చూసుకొన్నారు నన్ను" అంటూ ఇంట్లోకి కదిలాడు, తిరుగు ప్రయాణానికి సిద్ధం కావడానికి.

"ఈ ఒక్కరోజు ఉండండి బాబూ! రేపు తెల్లారగానే బయలుదేరి వెళ్ళిపోదురుగాని" అన్నాడు భీందొర.

"లేదు దొరా! నేను వెళ్ళిపోవాలి. పట్నంలో నాకు చాలా పనులున్నాయి" అన్నాడు భూపతి.

"పనులకేముంది బాబూ! ఉంటూనే వుంటాయి. ఈ ఒక్కరాత్రి ఉండండి. రేపు వెళ్ళిపోదురుగాని" అన్నాడు భీందొర.

"లేదు దొరా! ఇక్కడ ఒక్కక్షణం ఆగడం పడదు" చెప్పేసాడు నిశ్చయంగా.

ఇహ భీందొర మాట్లాడలేకపోయాడు. "మీ ఇష్టం" అంటూ ఊరుకొన్నాడు.

# 15

డొంకిరిమెట్ట వచ్చిన క్షణంనుంచీ, ఏదో పని కల్పించుకుని తన యెదురుగా తిరుగాడిన సింగి, గడచిన రాత్రి నుండీ తనదగ్గరకు రాకపోవడం చాలా ఆశ్చర్యం కలిగించింది భూపతికి.

తనకి కావాల్సిన స్నానానికి నీళ్ళు తేవడం, ఫలహారం ఇవ్వడం వగైరా పనులన్నీ భీందొరే స్వయంగా చేసాడు.

ఒకటి రెండుసార్లు కిటికీలోంచి చూసిమాత్రం వెళ్ళిపోయింది సింగి.

తనకు ఎన్నో సేవలు చేసినందుకు కృతజ్ఞతలు చెప్పుకోవాలనుకున్నాడు. గాని, ఆమె అగపడలేదు.

ఆఖరుకు భూపతి బయలుదేరే సమయం ఆసన్నమైంది. సింగితో మాట్లాడనందుకు కాస్త వెలితిగా ఫీలయ్యాడు భూపతి.

అనంతగిరివరకూ తోడువచ్చి, అక్కడ బస్సు ఎక్కించడానికి, తనూ వస్తానన్నాడు భీందొర. తనకు త్రోవ తెలీదు. పైగా తనకు తోడు కావాలి.

భీందొర రాకను ఆనందంగా అంగీకరించాడు భూపతి.

ఎందుకో దిగులు. ఏదో వెలితి. వచ్చిన రోజునాటి ఉత్సాహం తనలో లేకపోయినందుకు ఆశ్చర్యపోయాడు భూపతి.

నిజానికి, విజయం పొందే వెళ్తున్నాడు. ఐనా, మనస్సెందు కిలా కల్లోలంగా ఉంది?

ధొరమ్, మరికొంతమంది డొంకిరిమెట్ట యువకులు, చాలాదూరం భూపతి వెంటవచ్చి సాగనంపారు.

భూపతి వాచి చూసుకొన్నాడు; తొమ్మిది దాటి ఇరవై నిముషాలైంది.

చెట్లకొమ్మలద్వారా తాము నడుస్తున్న త్రోవలో పడుతున్న సూర్యకాంతి, ముగ్గులు వేసినట్టుగా అవుపిస్తోంది.

భీందొర, భూపతి సామాను భుజాన్నేసుకుని నడుస్తున్నాడు. వెనకాల భూపతి హుషారుగా, తొందరగా అడుగులేస్తున్నాడు.

మధ్యాహ్నం రెండుగంటలకో బస్సు, అనంతగిరి వస్తుంది. అది పట్టుకుంటే, రాత్రికి తను విశాఖపట్నం చేరుకోగలడు.

మెల్లగా భూపతి ఆలోచనలు పట్నంలోని తనవాళ్ళ మీదకు, అక్కడి జీవితంవైపు మళ్ళాయి.

"బాబూ! భూపతి బాబూ!__" అది సింగి గొంతు. తన వెనుకనించి విన్పించింది.

తుళ్ళిపడి వెనక్కి తిరిగాడు భూపతి. భూపతి మెదడులో లెక్కలేనన్ని ప్రశ్నలు. భీందొరకూడా ఆగి వెనక్కి తిరిగాడు.

ఆమె ఇక్కడికెందుకిలా వచ్చింది? తనతో మాట్లాడదల్చుకుంటే, అక్కడే గ్రామంలోనే యెందుకు మాట్లాడ లేదు? భర్త దగ్గరలో ఉండగా, ఇంత దూరంలో, అడవిలో తనని కలుసుకోవడమా?

"ఏం సింగీ? రాత్రినించి అవుపించనేలేదు. వచ్చేటప్పుడు చెప్పాలనుకున్నాను. నువ్వు అవుపించలేదు మరి" అన్నాడు భూపతి.

"పోనీలే బాబూ! మీకీ పళ్ళిద్దామని పిలిచాను" అంటూ ఆమె భూపతికి చేరువగా వచ్చింది.

ఆమె కుడిచేతిలో పళ్ళున్నాయి.

కృతజ్ఞత మెరిసే కళ్ళతో, ఆనందంతో, ఆమె అందించిన పళ్ళు అందుకొన్నాడు.

ఆదే సమయంలో జరగ్గూడనిది, భూపతి కలలోగూడా ఆశించనిది జరిగింది.

ఆ క్షణంవరకూ అతడు గమనించలేదు గాని, ఆమె తన వెనుకగా ఉంచిన ఎడమచెయ్యి త్రాచుపాములా లేచింది. ఆ చేతిలో తళతళమని మెరుస్తూ, ఓ బాకు ఉంది.

ఐతే, సింగి చేతిలోని యీ తినకత్తి యీ తినట్టే ఉంది. "అమ్మా!" అంటూ చావుకేక పెట్టి, నేలకొరిగింది. ఆమె వెనకాల, రక్తసిక్తమైన కత్తి చేతిలో పట్టుకుని భీందొర ఉన్నాడు.

భూపతి నిశ్చేష్టుడయ్యాడు.

"ఏమిటిది? అంతా అయోమయంగా ఉంది...ఎందుకీ రక్తపాతం?"

ఐదునిముషాల తర్వాత అడిగాడు భూపతి.

"బాబూ! ఇది యిలా జరగాల్సి ఉంది...అంతే జరిగింది."

అన్నాడు భీందొర, కత్తి పారవేసి, దిగులుగా తల వంచుకుని.

"కోరివచ్చిన ఆడదాన్ని మగవాడు తిరస్కరిస్తే, అంతకన్నా పెద్ద అవమానం ఉండదు ఆడదానికి మా తెగలో. ఆ పురుషుడు ఆమెకు తన శత్రువు లందరిలోకీ పెద్ద శత్రువు. ఆమె అలాంటి పురుషుడ్ని విధిగా సంహరించి తన కసి తీర్చుకుంటుంది. మా తెగలో యీ విషయం పురుషులందరికీ తెలుసు. ఓ విధంగా చెప్పాలంటే, కోరు

మన్న పురుషుడిద్వారా కోరిక తీర్చుకునే స్వాతంత్ర్యం మా తెగలో ఉంది ఆడవాళ్ళకు. మా పాటల్లో, మా కథల్లో, మా కబుర్లలో ఇదే విషయం పదేపదే చెప్ప బడింది. మీ కీ సంగతి తెలీదు. కారణం మీ సంప్రదాయం, ఆచారం వేరు. మిమ్మల్ని పొందాలని మూడుసార్లు ప్రయ త్నించింది సింగి. కాని లాభం లేకపోయింది. ఇక మిమ్మల్ని చంప జూస్తుందని నాకు తెలుసు. అందుకే మీ వెంట వచ్చాను ఇప్పుడు. గత రాత్రినుంచి మీ కేదైనా ప్రమాదం జరుగుతుందేమోనని వెయ్యికళ్ళతో కనిపెట్టి చూస్తూనే వున్నాను'' అంటూ ముగించాడు.

''మరి, నువ్వామెను నన్ను చంపకుండా ఆపాల్సింది. ఆమెను చంపావు దేనికి?''

''బాబూ! మీకు తెలీదు. కోరికతో ఉన్న ఆడది ఆకలితో ఉన్న ఆడపులిలాంటిది అంటారు మాలో. ఇవాళ కాపోతే రేపు, రేపు కాపోతే ఎల్లుండి...ఏదో ఒక రోజున, ఎక్కడో అక్కడ, సింగి మిమ్మల్ని చంపడం ఖాయం. అంచేత, ఆమెను చంపేయడం మినహా ఇంకో మార్గం లేదు.''

భూపతి గుండె దిగులుతో బరువెక్కింది. కొన్ని క్షణాలు అలాగే నిశ్చలంగా నిల్చుండిపోయాడు.

-: ఐ పో యిం ది :-

# కార్యసాధకులు

## సంపత్

నీలాకాశంలో వెండిమబ్బులు తళతళ లాడుతున్నాయి. భాస్కరుడు ఒక ప్రక్కకి ఒరిగిపోయాడు. అతనినుంచి వచ్చే కాంతిలో సముద్ర జలాలు వెండిరంగుతో మెరుస్తున్నాయి.

"స్టేట్ ఆఫ్ హర్యానా" డెక్ మీద నిలబడి ప్రకృతిని తిలకిస్తూ ఆత్మానందాన్ని అనుభవిస్తున్నాడు ముఖర్జీ. అతడు అజానుబాహుడు. బలిష్టమైన దేహం. ఒత్తుగానున్న జుట్టు, అక్కడక్కడ తెల్లటి వెంట్రుకలు. చిన్న కళ్ళు. సన్నని మీసాలు. కొద్దిగా లావుగావున్న పెదాలు, నల్లగా ఉన్నాయి. సముద్రంమీదనుంచి వచ్చే గాలికి జుట్టు ఎగిరెగిరి పడుతోంది.

ఆ డెక్ పై అతనిలాగే చాలామంది నిలబడి మాట్లాడుకొంటున్నారు. ఎవరి ధోరణిలో వారున్నారు. నవ్వుతూ, త్రుళ్ళుతూ హుషారుగా ఉంది వాతావరణం అక్కడ. మరో ఇరవై నాలుగు గంటలలో అది పోర్ట్ బ్లెయిర్ చేరబోతూంది.

ముఖర్జీ తల తిప్పి చుట్టూ చూశాడు. కొద్ది దూరంలో మరో వ్యక్తి అతని కళ్ళబడ్డాడు. అతనుకూడా ముఖర్జీలాగే బలమైన శరీరం గలవాడు. ఐతే ముఖర్జీకంటే ఎత్తు తక్కువ. నవ్వుతూ ఉన్న కళ్ళు. ముఖర్జీ చూపు తనమీద పడగానే కళ్ళతోనే ఏదో సైగచేశాడు.

తరువాత కొద్దిసేపటికి ముఖర్జీ డెక్ పైనుంచి తన కాబిన్ లోకి నడిచాడు. మరో అయిదునిమిషాల తరువాత ఒక్కొక్కరుగా ముగ్గురు వ్యక్తులు ముఖర్జీ కాబిన్ లోకి ప్రవేశించారు. వారిలో ఇందాక ముఖర్జీ వంక చూసి సైగచేసిన వ్యక్తికూడా ఉన్నాడు.

ముగ్గురు రాగానే, ముఖర్జీ లేచి కాబిన్ తలుపు బంధించాడు. "గుడ్ మార్నింగ్!" అని చెప్పటం మొదలు పెట్టాడు ముఖర్జీ.

'ఫ్రెండ్స్! కొద్ది గంటలలో ఈ నౌక పోర్ట్ బ్లెయిర్ ని సమీపించబోతూంది. మనం గమ్యస్థానాన్ని సమీపించాము. ఇంతవరకు మనగురించి అతి రహస్యంగా ఉంచబడింది. చివరికి మనంకూడా ఒకరినొకరు ఎరగనట్లే ప్రవర్తించాము.

సరే! మరోసారి ఏం చెయ్యాలో గుర్తుకు తెచ్చుకోండి. ఈ షిప్ కెప్టెన్ కు తప్ప ఇతరులకు మనం ఎవరమో తెలియదు. ఈ రాత్రికే మనం యిక్కడనుంచి తప్పించుకోవాలి. మీ మీ సామానులు సరుకొని సిదంగా ఉండండి.

ఒక్కటి మాత్రం గుర్తుంచుకోండి. మన ధ్యేయం ఒక్కటే. ఎలాగైనా ఆ స్థావరం నాశనం కావాలి. మన ప్రాణాలు పోయినా సరే, వెనుదీయకూడదు. సందర్భాను సారం, సమయస్ఫూర్తితో వ్యవహరించండి. విష్ యు గుడ్ లక్. జైహింద్!''

అన్నాడు ముఖర్జీ. అందరూ మౌనంగా ఉండిపోయారు కొద్దిసేపు. తరవాత కొద్దిసేపు ఏమేం చేయాలో చర్చించు కున్నారు. కైలాష్, సాగర్, రాజులు వెళ్ళిపోగానే ముఖర్జీ తలుపు బిగించి జేబులోనుంచి పెన్ తీశాడు. పైనున్న కాప్ తీసి అడుగున అమర్చి పైభాగాన ఉన్న చిన్న బుడిపెను నొక్కాడు. పైభాగంలో సన్నటి ఏరి యల్ పైకి వచ్చింది.

ఎవరికో ఏదో చెప్పసాగాడు ఆ వైర్‌లెస్ ట్రాన్స్ మిటర్‌లో. అదే సమయంలో డెక్ మీద కలకలం విన్పిం చింది. చెప్పటం ముగించి, పెన్‌ని యధాప్రకారం మూసి డెక్ మీదకు నడిచాడు.

డెక్ మీద ఉన్న మనుషులు ఆందోళనగా ఆకాశంలోకి చూస్తున్నారు. ముఖర్జీ కూడా మౌనంగా అందరినోమారు పరిశీలించి, తానూ ఆకాశంవైపు చూశాడు. మిగిలినవారు కూడా చూస్తున్నారు.

దూరంగా ఉత్తరదిశనుంచి ఐదువిమానాలు దూసు కొస్తున్నాయి. వాటిని చూడగానే ముఖర్జీకి అర్థం ఐంది కలకలానికి కారణం. జనం అంతా ప్రాణాలుగ్గబట్టుకొని వాటివంకే చూస్తున్నారు తదేకంగా. విమానాలు సమీ పించాయి. జెట్ బాంబర్స్. అవి దగ్గరయ్యేకొలది షిప్ మీద సంచలనం ఎక్కువైంది. కొంతమందికి ఏదు

పాక్కటే తప్పక్కవ. మరికొంతమంది కాబిన్ లలోకి పరుగెత్తారు.

ఆ జనంలోనే కలిసిపోయి ఉన్న ముఖర్జీ అనుచరులు ఒకరివంక ఒకరు చూసుకున్నారు అయోమయంగా. ఎక్కడినుంచి ఆ విమానాలు వస్తున్నాయో అర్థంగాలేదు వారికి. వారికి అర్థం అయ్యిందల్లా ఒకటే!

ఏదో హార్బరునో, ఫ్యాక్టరీనో, మరేదో ముఖ్యమైన స్థావరాన్ని ధ్వంసంచేసి వస్తున్నాయని.

విమానాలు ఇప్పుడు షిప్ మీద ఎగురుతున్నాయి. షిప్ ని గమనించాయి కాబోలు. రెండు, మూడు రౌండ్లు షిప్ చుట్టూ తిరిగాయి. అవి తిరుగుతున్నంతసేపు ప్రాణాలుగ్గబట్టుకొని చూశారు ప్రజలు.

పదినిముషా లనంతరం అవి షిప్ ని వదిలి తూర్పుగా ఎగిరి మాయం ఐపోయాయి.

జనం అంతా హాయిగా ఊపిరి పీల్చుకున్నారు, పెద్ద గండం గడిచినట్లు. వారలా భయపడటంలో వింత ఏమీ లేదు. దానికి కారణం ఉంది.

## 2

సుమారు నెలరోజుల క్రితం కొన్ని యుద్ధవిమానాలు హఠాత్తుగా దాడిచేశాయి భారతదేశపు నౌకలమీద. రాడార్ లు వాటిని పసిగట్టి హెచ్చరించే లోపునే జరగవలసిన అనర్థం జరిగిపోయింది.

హఠాత్తుగా మెరుపులా ప్రత్యక్షం అయి, నాశనం చేసి కన్నుమూసి తెరిచేంతలో మాయం అయిపోయాయి.

ఆ విమానాలు ఎవరివో తెలియదు. ఏ గుర్తులూ దాని మీద లేవు. భారతదేశంమీద పగ ఉన్న ఇతరదేశం ఏదైనా ఈ పనికి పూనుకుందా అని ఆలోచిస్తే అదీ కాదని

తేలిపోయింది. ఇటువంటి విమానాలే సింగపూర్, మలయాల మీదుగాకూడా వెళ్ళి నాశనం చేశాయని వార్తలు వచ్చాయి. చైనాకూడా తన తీరంమీద దాడి జరిగిందని, అది భారతదేశమే చేసిందని గోలపెట్టింది. ఇటువంటి పరిస్థితులలో అయోమయంలో పడిపోయింది భారతదేశం.

ఆ విమానాలను వెంటాడుతూ వెళ్ళిన ఏ విమానము తిరిగి రాలేదు. కనీసం వారినుంచి జవాబుకూడా రాలేదు. ఏ వివరమూ తెలియని పరిస్థితిలో ఒక కొత్త వార్త చేరింది భారతదేశానికి.

అండమాన్ దీవుల సమీపంలో ఒకటి రెండు జలాంతర్గత నౌకలు సంచరిస్తున్నట్లు వార్త. ఆ నౌకలమీద కూడా ఏ విధమైన గుర్తులు లేవని తెలిసేటప్పటికి భారతదేశంకి కొంత అర్థం అయ్యింది. బహుశా ఆ సబ్ మెరీన్‌లు కూడా ఆ విమానాలు సంబంధించిన దేశానికే చెంది ఉంటాయని అభిప్రాయపడింది.

ఇది ఇలా ఉండగా దేశదేశాలకు సంబంధించిన సైంటిస్టులు ఒక్కుమ్మడిగా మాయం ఐపోసాగారు. వారినందరిని దొంగిలించి ఆ బేస్‌లోకే చేర్చారని వదంతి. కాని దానిలోని నిజానిజాలు తెలియవు.

మొత్తంమీద ఏదో ప్రమాదం రానున్నదని గ్రహించింది ఇండియా.

వెంటనే భారతదేశం రంగంలోకి దిగింది. అతి రహస్యంగా, త్వరితంగా వివరాలు సేకరించింది.

ఫలితమే మిలటరీ అధికారులయిన సాగర్, కైలాష్, రాజు, ముఖర్జీల ప్రయాణం. సర్వహంగులతో, రహస్యంగా వారి ప్రయాణం ప్రారంభమయింది.

# 3

రాత్రి పదకొండుగంటలు దాటినతర్వాత, జాగ్రత్తగా, రహస్యంగా డెక్ పైకి వచ్చారు ముఖర్జీ బృందం. అంతకు ముందే లైఫ్‌బోట్లు తీసి రెడీగా ఉంచబడి వున్నాయి. వాటిని జాగ్రత్తగా, శబ్దం కాకుండా నీటిలోకి జార విడిచారు.

అవసరమయిన సామానులన్నీ వాటర్ ప్రూఫ్ బాక్స్‌లలో ఉన్నాయి. వాటిని బోట్స్‌లోకి దించారు. "తాడు నిచ్చెన" ద్వార బోట్లలోకి దిగారు. కెప్టెన్‌కి వీడ్కోలు చెప్పి బోట్లను నడపటం ప్రారంభించారు. తాడు పైకి లాక్కొని ఏమీ ఎరగనట్లు వెళ్ళిపోయాడు కెప్టెన్.

స్టేట్ ఆఫ్ హర్యానా ముందుకు దూసుకుపోతూంది. లైఫ్‌బోట్లలో మిగిలిపోయింది ముఖర్జీ బృందం. చుట్టూ అంతులేని చీకటి. ఆకాశంలో చిన్న మబ్బు కూడా లేదు. నక్షత్రాలు స్పష్టంగా కన్పిస్తున్నాయి. దూరంగా నౌక దీపాలు.

టార్చి వెలిగించి కంపాస్ చూశాడు ముఖర్జీ. ఏ దిక్కుగా పోవాలో చెప్పాడు. తెడ్లతో బోట్లను నడపటం ప్రారంభించారు.

సముద్రం మీదనుంచి వీచే చలిగాలి వణుకు పుట్టిస్తోంది. గాలి హోరులో మాటలుకూడా విన్పించటంలేదు. పెద్దగా మాటాడుకుంటూ, వంతుల వారీగా బోట్లను నడుపుతున్నారు.

రాత్రి రెండున్నర గంటల ప్రాంతాలలో ఒక దీవి తగిలింది.

అక్కడ విశ్రాంతి తీసుకుందాం అన్నాడు కైలాష్,

మిగిలినవాళ్ళు కూడా అలసిపోయి ఉండటంవల్ల అంగీకరించి, బోట్లను దీవికేసి నడిపారు.

బోట్లను తీరంమీదికి చేర్చారు. ఆ దీవి అంతా చెట్లమయంలా ఉంది. రకరకాలైన చెట్లు దట్టంగా వున్నాయి. టార్చిలైట్లు వెల్గించి చూశారు.

"జాగ్రత్త! విషపురుగు లుంటాయి!" హెచ్చరించాడు ముఖర్జీ. అందరూ కలిసి బోట్లను చెట్లమధ్యకు లాగి ఆకులతో కప్పేశారు. "తెల్లవారవస్తున్నది. పగలు ఇక్కడే ఉండిపోదాం" అన్నాడు ముఖర్జీ. కాపలాగా సాగర్‌ను ఏర్పాటుచేసి మిగిలినవాళ్ళు మంచి చోటు చూసుకొని నిద్రకుపక్రమించారు. వెంటనే నిద్రపట్టింది వారికి.

సాగర్ కాపలాగా కూర్చున్నాడు. అతని చేతిలో చిన్న మెషిన్‌గన్, టార్చ్‌లైటు వున్నాయి. ఏ చిన్న శబ్దం అయినా పరీక్షించి చూస్తున్నాడు.

అరగంట హాయిగా గడిచింది.

చిన్నగా ఉలిక్కిపడ్డాడు సాగర్. అతని పాము చెవులు ఏదో శబ్దాన్ని పసిగట్టాయి. చెవులు రిక్కించి, మరింత జాగ్రత్తగా విన్నాడు. ఏదో శబ్దం. మోటారు బోట్‌దై వుండాలని భావించాడు. ఎటునుంచి వస్తుందో తెలియడంలేదు. లీలగా విన్పిస్తోంది. గాలిద్వారా.

'ఒకసారి చూసి వస్తే!' అనుకున్నాడు తనలో తను. కాని మిగిలినవాళ్ళను ఒంటరిగా వదిలివెళ్ళటం ఇష్టంలేదు. వారివైపు ఓసారి చూశాడు. నిశ్చింతగా నిద్రపోతున్నారు

ఏదో నిశ్చయానికి వచ్చి, మెషిన్‌గన్ పొజిషన్‌లో పట్టుకుని, టార్చ్‌లైటు వెల్గించకుండా తీరంవైపు నడిచాడు. మెత్తటి ఇసకలో కాళ్ళు కూరుకుపోతున్నాయి. హోరుమని గాలి, సముద్రపు ఘోష. ఆ గాలి వెంటే వస్తూంది

శబ్దం. ఒకసారి చుట్టూ పరికించి శబ్దం వస్తున్న వైపుగా అడుగులు వేయసాగాడు.

చలిగాలి రివ్వున కొడుతూంది. వంటినిండా ఉన్ని దుస్తులు, కాళ్ళకు సాక్స్, బూట్స్, చేతులకు గ్లవ్స్ ఉండటంవల్ల అంతగా ప్రమాదంలేదు గాలివల్ల.

తీరం వెంట పోయేకొద్ది శబ్దం ఎక్కువ కాసాగింది. ఇప్పుడా శబ్దం స్పష్టంగా విన్పిస్తోంది.

హెలికాప్టర్!

ఆశ్చర్యపోయాడు సాగర్. ఈ నిర్జన దీవిలో, రాత్రి పూట హెలికాప్టర్ ఎలా వచ్చింది? ఒకవేళ ఇదే తాము అనుకుంటున్న శత్రువుల స్థావరం కాదుగదా! ఈ ఆలోచన తట్టడంతోనే మరింత జాగ్రత్తగా ఉండాలని తీర్మా నించుకుని, చుట్టూ మరోమారు పరికించాడు. వాతా వరణంలో మార్పులేదు.

మరికొంత దూరం నడిచాడు. శబ్దం దగ్గరయింది. చటు క్కున నేలమీద బోర్లా పడుకున్నాడు. తల పైకెత్తి చూశాడు. దీవి మీదుగా ఎగురుకుంటూ వెళ్ళిపోయిందో హెలికాప్టర్. దాని అడుగున రంగురంగుల దీపాలు ఆరుతూ, వెలుగుతూ ఏవో సిగ్నల్స్ ఇస్తున్నాయ్.

దీవిమీద ఉన్న చెట్లమీదుగా ఎగురుకుంటూ వెళ్ళి పోయింది. పైకి లేచి నిలబడ్డాడు అయిదు నిమిషాల తర్వాత. వెనక్కి తిరిగి నడవటం ప్రారంభించాడు. అప్పుడు సమయం తెల్లవారుజాము నాలుగుగంటలు దాటింది.

తిరిగి వస్తుండగా ఎదురుగా ఎవరో కదులుతున్నట్లు లీలగా తోచి, మెషిన్‌గన్ ఎక్కుపెట్టాడు. లైటు వెలిగించ లేదు. ఊపిరి బిగించి రెండు నిముషాలు ఆ ఆకారం వంకే చూస్తూ నిలబడ్డాడు.

అవతలి ఆకారం కూడా ఆగిపోయింది. సాగర్ చేతి వేళ్ళు ట్రిగ్గర్ మీద బిగుసుకున్నాయి.

రెండు నిమిషాలపాటు అలానే ఉండిపోయా రిద్దరు.

"సాగర్!" అంది అవతలి ఆకారం.

గన్ దించాడు సాగర్, "కైలాష్" అంటూ వెంటనే టార్చిలైటు ఫోకస్ కైలాష్‌మీద వేసి ఆర్పేశాడు.

ఇద్దరూ దగ్గరయ్యారు.

"ఏదో శబ్దం విన్పించి లేచాము. నువ్వు లేవు. హెలికాప్టర్ ఏదో వెళ్తున్న శబ్దం విని ఆశ్చర్యపడ్డాము" చెప్పాడు కైలాష్.

"అవును" అంటూ జరిగిన విషయం అంతా చెప్పాడు సాగర్. ఇద్దరూ మౌనంగా తమ మిత్రుల దగ్గరకు బయలు దేరారు.

మిగిలిన ఇద్దరు కూడా దారిలోనే ఎదురయ్యారు గన్స్‌తో. సాగర్ చెప్పింది విని "ఇదంతా చూస్తుంటె మనం గమ్యం చేరామని అనిపిస్తోంది" అన్నాడు ముఖర్జీ.

నిద్రమత్తు వదిలిపోయింది అందరికి. కర్తవ్యాన్ని ఆలోచిస్తూ, తమ వెంట తెచ్చిన ఫుడ్ పాకెట్స్ విప్ప సాగారు.

# 4

తెల్లవారుఝాము అయిదున్నర గంటలయింది. తూర్పు అప్పుడే ఎర్రబారుతోంది. దీవిలోని చెట్లు, అస్పష్టంగా కన్పిస్తున్నాయి.

"ఒకసారి దీవి అంతా చుట్టివస్తే బాగుంటుంది!" సూచించాడు రాజు.

"చూసి రావచ్చు. కాని మనం పట్టుబడకూడదు. ఇక్కడ ఎంతమంది ఉన్నారో, వారి దగ్గరున్న ఆయుధా

లేమిటో తెలియకుండా ముందుకుపోవటం మంచిది కాదు''
తన అభిప్రాయాన్ని చెప్పాడు ముఖర్జీ.

పావుగంట తర్జన భర్జన లనంతరం ఒక నిర్ణయానికి వచ్చారు నలుగురూ. సాగర్, కైలాష్లు ఒక జట్టుగా, ముఖర్జీ, రాజులు మరో జట్టుగా బయలుదేరటానికి నిశ్చయించుకున్నారు. అందువల్ల నలుగురూ ఒకేసారి పట్టుబడే అవకాశం వుండదు.

మరో అయిదు నిమిషాల తర్వాత రాజు, ముఖర్జీలు వెళ్ళిపోయారు. చెట్లచాటున నక్కుతూ హెలికాప్టర్ వెళ్ళిన దిశగా వెళ్ళిపోయా రిద్దరూ.

సాగర్ తన చేతిలో వున్న రివాల్వర్‌తో చెట్లవైపు, ఆకులవైపు గురిచూస్తున్నాడు, ప్రేల్చకుండా. కైలాష్ తన కిట్ తెరిచి తన సామానులు సర్దుకుంటున్నాడు.

సాగర్ టైం చూసుకున్నాడు. ముఖర్జీ, రాజులు వెళ్ళి ఇరవై నిముషాలు అయ్యింది. జేబులోనుంచి అగ్గిపెట్టె సైజులో ఉన్న చిన్న వైర్‌లెస్ సెట్ తీశాడు. ఒక స్విచ్ నొక్కి, ఏదో చేశాడు. అరనిముషం తర్వాత రిప్లై వచ్చింది. అగ్గిపెట్టెమీద వెలుగుతున్న ఎర్రలైటు ఆరిపోయి, పచ్చలైటు వెల్గింది సంకేతంగా.

ముఖర్జీ మాట్లాడుతున్నాడు. తాము వారి స్థావరాన్ని సమీపించినట్లు అనుమానంగా వుందని, ఇంతవరకు శత్రువుల జాడ కన్పించలేదని చెప్పాడు.

మరో పదినిముషాల అనంతరం సాగర్, కైలాష్లు బయలుదేరారు. బాగా తెల్లవారింది. వేసవిరోజులు. మంచు పట్టుకుంది కొద్దిగా. చేతిలో రివాల్వర్, వెనక వీపున కిట్, తలపైన ఉక్కుటోపి. ఇద్దరూ ముందుకుసాగి

పోతున్నారు. ఎండిన ఆకులమీద కాలుపడి శబ్దం కాకుండా జాగ్రత్తగా నడుస్తున్నారిద్దరూ. మధ్యలో ముఖర్జీని కాంటాక్ట్ చేయటానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు సాగర్.

దాదాపు అరగంట ప్రయాణం అనంతరం ఇద్దరూ ఆగారు. కొద్దిదూరంలో ఎత్తయిన గుట్ట వుంది. గుట్ట పైభాగాన ఇద్దరు వ్యక్తులు బోర్లాగ పడుకొని అటువైపు చూస్తున్నారేదో. ఆ ఇద్దరూ ముఖర్జీ, రాజులని తెల్సిపోతోంది.

సాగర్, కైలాష్‌లు మెల్లిగా గుట్ట ఎక్కడం ప్రారంభించారు. ముఖర్జీ దగ్గరకు నడిచినప్పటికి వారిద్దరు తల తిప్పి చూడలేదు.

కైలాష్‌కు ఏదో అనుమానం వచ్చింది. వారిద్దరి దగ్గరకు నడిచాడు. అంతే!

నోటమ్మాట మాటలేకుండా నిల్చుండిపోయాడు.

గుట్టమీద బోర్లాగా వున్న ముఖర్జీ, రాజులలో ప్రాణం లేదు.

కళ్ళప్పగించి చూస్తుండిపోయారు సాగర్, కైలాష్‌లు. వారి చేతులు ఆటోమేటిక్ గా రివాల్వర్‌లమీద బిగుసుకు పోయాయి.

చెట్లచాటునుంచి పన్నెండు, పదిహేనుమంది వ్యక్తులు మెషిన్‌గన్స్‌తో చుట్టూ కమ్ముకోవటం చూసి అదిరిపడ్డారిద్దరూ. అందరూ సైనికుల దుస్తులలో ఉన్నారు. ప్రతివాడి చేతిలోని గన్ ఆవురావురుమంటూ సాగర్, కైలాష్ వైపు చూస్తున్నాయి.

సాగర్, కైలాష్‌లు రివాల్వర్‌లు క్రిందపడేసి చేతులెత్తి నిలబడ్డారు.

అది భూమిలోపల నిర్మించబడిన విశాలమైన హాలు. ఆ హాలుకి ఒక చివర బోనులువంటి సెల్స్ అయిదు వున్నాయి. రెండు సెల్స్‌లో ఎవరో ఉన్నారు. కాని స్పృహలో లేరు. వళ్ళంతా గాయాలతో మూలుగుతున్నారు.

"బోనులో చిక్కాం!" అన్నాడు కైలాష్, బోను కటకటాలు పట్టుకొని చూస్తూ. అక్కడ కాపలాగా ఎవరూ లేరు. మిలటరీ దుస్తులు ధరించి వున్న కొంతమంది మనుషులు అటూ ఇటూ తిరుగుతున్నారు. హాలులో అటు, ఇటు రెండు తలుపులు వున్నాయి. వాటిద్వారా తిరుగుతున్నారు, వారి దుస్తులను చూడగానే "కైనా" దేశస్థులని గ్రహించారు సాగర్, కైలాష్‌లు. లోపలనుంచి ఏదో మిషన్ల చప్పుడు విన్పిస్తోంది.

హాలులో వున్న సెల్స్ చూడగానే తమను వెంటనే ఎందుకు చంపలేదో గ్రహించాడు కైలాష్. పై అధికారుల నుంచి ఆర్డర్స్ రానిదే తమనేమి చేయలేరు.

ముఖర్జీ, రాజులు గుర్తుకు వచ్చారు హఠాత్తుగా. కళ్ళల్లో నీరు తిరిగింది లీలగా. మనస్సుని సమాధాన పరచుకొని, టైం చూసుకున్నాడు. తెల్లవారి ఎనిమిది గంటలవుతోంది.

ఇంతలో ఇద్దరు సైనికులు వచ్చి నిలచారు. ఒకడు హాలు గోడకు అమర్చబడి వున్న స్విచ్‌బోర్డులో ఒక స్విచ్ నొక్కాడు. బోనుకు వున్న ఒక తలుపు తెరుచుకుంది.

"చేతులు ఎత్తి నడవండి!" ఇంగ్లీషులో హెచ్చరించాడొక సైనికుడు. ఆ ఇద్దరి చేతుల్లో మెషిన్‌గన్స్ సాగర్, కైలాష్‌లకు గురిపెట్టబడి వున్నాయి. ఏమాత్రం కదిలినా

ఒళ్ళంతా తూట్లుపడటం ఖాయం. అంతకుముందే వారి దగ్గరున్న సమస్తం తనిఖీచేసి లాక్కున్నాడు.

సాగర్, కైలాష్‌లు బయలుదేరారు. హాలు రెండోవైపు వున్న ద్వారంవద్దకు నడిచారు సైనికుల ఆజ్ఞపై. ఆ గది తలుపులు తెరిచి నలుగురు లోనికి ప్రవేశించారు.

అదొక లిఫ్ట్ అని గ్రహించాడు సాగర్. మెషిన్‌గన్స్ డొక్కల్లో గుచ్చుకుంటున్నాయి. సాగర్, కైలాష్ లిద్దరూ ఎదురెదురుగా నిలబడి వున్నారు. లిఫ్ట్ క్రిందకు బయలుదేరింది. కళ్ళతోనే కైలాష్‌ని హెచ్చరించాడు సాగర్. బూటుకాలితో అడుగున టర్ టర్‌మని మూడు సార్లు కొట్టాడు. సైనికులకు అనుమానం వచ్చింది. కాని అప్పటికే సమయం మించిపోయింది.

సాగర్, కైలాష్‌లు చటుక్కున కూర్చొని, సైనికుల కాళ్ళను పట్టుకొని గుంజారు. సైనికులు క్రిందపడ్డారు. పదినిముషాల తర్వాత లిఫ్ట్ క్రిందకు దిగి ఆగిపోయింది.

లిఫ్ట్ తలుపు తెరిచి తొంగి చూశాడు సాగర్. వెడల్పుగా వుంది నడవా. ఒక చివర ఏదో తలుపు వుంది. రెండో చివర నడవా రెండు భాగాలుగా చీలిపోయింది.

బయటకు నడిచాడు సాగర్. అతనిప్పుడు 'కైనా' సైనిక దుస్తులలో ఉన్నాడు. నిజానికి ఆ డ్రస్ సాగర్‌కు ఫిట్ ఐంది. ఐనా పరీక్షగా చూస్తే తప్ప కనుగొనలేరు.

నడవా చివరకు నడిచి తలుపు తెరిచి చూశాడు. అదొక స్టోర్ రూంలా ఉంది. తాళం లేకపోవడంవల్ల బహుశా అది ఉపయోగంలో లేదేమోనని భావించాడు సాగర్. సైనికుల శవాలను ఆ రూంలోనే సామానుల మాటున పడేశారు.

బయటకు నడిచి, తలుపు మూసి బయలుదేరారు. ఇంతలో హఠాత్తుగా ప్రక్కనే ఉన్న తలుపు తెరుచుకుంది. ఉలిక్కిపడ్డారు ఇద్దరు. తలుపు తెరుచుకొని, లిఫ్టులోనుంచి ఒక సైనికుడు దిగాడు. సాగర్, కైలాష్ వంక పరీక్షగా చూడబోయాడు. అది గమనించి సాగర్ త్వరితంగా నడిచి, లిఫ్టులోకి చేరి తలుపు వేసుకున్నాడు. లిఫ్ట్ స్విచ్ నొక్కగానే పైకి లేచింది. దాన్ని మధ్యలోనే ఆపాడు. రెండు నిమిషాలు అలానే ఉండిపోయారిద్దరూ.

తరవాత మరలా క్రిందకు దిగారు. సైనికుడు లేడక్కడ. ఇద్దరు ఒకరినొకరు చూసుకొని నవ్వుకున్నారు. నడవా చీలిన చోటకు రాగానే ఎటు వెళ్ళాలన్న ప్రశ్న ఉత్పన్నమైంది. చివరకు రెండువైపులకు పోయి చూసి రావాలని తీర్మానించుకున్నారు.

ఎడమవైపుగా ఉన్న నడవా వెంట నడిచారు. తలుపు వేసి ఉంది. కొద్దిగా తెరిచిచూశాడు సాగర్. అది డైనింగ్ హాలులా ఉంది. ట్రేలలో పదార్థాలను పెట్టుకొని బట్లర్లు అటూ యిటూ తిరుగుతున్నారు. డైనింగ్ హాలులో ఎవరూ సైనికులు లేరు. రెండు నిమిషాలు అలానే చూసి, కైలాష్ వంక చూసి, నవ్వి అన్నాడు.

"ఒక చిన్న గమ్మత్తు చేస్తాను. చూడు!"

కైలాష్ వారించబోయాడు. కాని సాగర్ తలుపు తెరుచుకొని లోన జొరబడటం జరిగిపోయింది. తాను కూడా లోనికిపోయాడు కైలాష్.

సాగర్ ముందుకు నడిచి డైనింగ్ టేబుల్ వద్ద ఖాళీగా ఉన్న ఒక కుర్చీలో కూలబడ్డాడు. అతని ప్రక్కనే ఉన్నాడు కైలాష్. అతనికి లోలోపల భయంగానూ,

సాగర్ మీద కోపంగానూ ఉంది. సాగర్ ఎప్పుడూ అంతేనని అతనికి తెలుసు. ధైర్యంగా ముందుకు దూసుకు పోతాడు. తలమీద నున్న మెటల్ హెల్మెట్ ని తీయలేదు.

ఒక బట్లర్ వారివద్దకు వచ్చాడు. కైనాభాషలో ఏదో చెప్పాడు సాగర్. ఆ బృందంలో ముఖర్జీ, సాగర్ లకు మాత్రమే కైనాభాష వచ్చు.

బట్లర్ వారివైపు అనుమానంగా చూస్తూ ట్రేలో పదార్థాలు తెచ్చాడు. సాగర్ గద్దించేసరికి అతను అక్కడ నుండి తప్పుకున్నాడు. ఇద్దరూ తృప్తిగా ఫలహారాలను పూర్తి చేశారు. వేడి టీ తాగి ఇద్దరూ బయటకు నడిచారు.

"ఎలా ఉంది?" అడిగాడు సాగర్.

"నా తలకాయలా ఉంది. మనిద్దరిని గమనించారు. ఐనా నీకెంత ధైర్యం?"

"ఇందులో ఏంలేదు. ఈ బట్లర్ లని చూశావు గదా. బలవంతంగా పని చేస్తున్నట్లు వాళ్ళ మొహాలు చూస్తేనే తెలుస్తూంది. నేను అప్పుడే ఊహించాను. వీరి కిష్టంలేని పనుల్ని బలవంతంగా చేయిస్తున్నారు. అందుకే గద్దించే సరికి భయపడిపోయాడు. బహుశా కొత్తగా చేరి వుంటాడు."

ఇద్దరూ నడవా రెండోవైపు నడిచారు. నడవా చివర ఒక ఉక్కు తలుపు ఉంది. దాన్ని తెరవటానికి స్విచ్ కూడా దాపుల్లో కన్పించలేదు.

సామాన్యంగా అండర్ గ్రౌండ్స్ లో తలుపులప్రక్కనే స్విచెస్ ఉంటాయి. కాని ఈ తలుపుకి లేకపోవటంతో అనుమానం వచ్చింది సాగర్ కి. "ఈ తలుపు చాలా ముఖ్యమైంది ఐవుండాలి" అన్నాడు కైలాష్ తో. గోడప్రక్కనే

తడిమాడు. రెండు, మూడు నిమిషాల తర్వాత గోడమీద అతి చిన్న బొడిపె కన్పించింది. దాన్ని నొక్కగానే తలుపు పైభాగాన అరచేయి వెడల్పున ఉండే తలుపు తెరుచుకుంది. లోపలనుంచి ఆటోమాటిక్ గా ఏదో బయటకు వచ్చింది.

అదేమిటో గ్రహించే లోపునే జరగవలసిన అనర్థం జరిగిపోయింది. టెలివిజన్ కెమెరా లెన్స్ అది. సాగర్, కైలాష్లు టెలివిజన్ లోకి ఎక్కారు.

# 6

అండర్ గ్రౌండ్ లో ఉన్న కంట్రోలు రూంలో రకరకాల మిషన్లు, వ్యక్తులు హడావిడిగా ఉన్నారు. ఆపాదమస్తకం నల్లటి, ఎర్రటి మొదలైన రంగుల దుస్తులు ధరించిన వ్యక్తులు కంప్యూటర్ల ముందు, ఇతర పరికరాల ముందు కూర్చుని పనులలో మునిగిపోయి ఉన్నారు. వారి ముఖాలకున్న మాస్కులకు కళ్ళదగ్గర మాత్రం రెండు చిన్న కంతలున్నాయి. అందరి చేతులకు గ్లవ్స్, కాళ్ళకు రబ్బరు బూట్లున్నాయి.

ఆ హాలులో ఎన్నోరకాల మెషిన్లు, కంప్యూటర్లు ఉన్నాయి. రంగురంగుల బల్బులు వెలుగుతూ ఆరుతూ అదొక గమ్మత్తయిన లోకంలా ఉంది.

ఆ హాలులో అన్ని పరికరాలు పనిచేస్తున్నప్పటికి, మొత్తంహాలు మూడుభాగాలుగా విభజింపబడి ఉంది. ఒకభాగం దీవి బయట శత్రువుల ఉనికిని కనిపెట్టడానికి అవసరమైన టెలివిజన్ సెట్స్, ఇతర పరికరాలను కలిగి ఉంది. మరోభాగం అండర్ గ్రౌండ్ లోపల నిర్వహణను చూస్తుంది. మూడో భాగం చాలా ముఖ్యమైనది.

ప్రతివారి ముందు టెలివిజన్ సెట్స్ ఉన్నాయి. వాటి ద్వార దీవి లోపల, బయట ఏమేమి జరుగుతుందో తెలుస్తూంది.

హాలులో ఉన్న మూడో భాగం ఆధ్వర్యంలో ఒక గని తవ్వకం జరుగుతున్నట్లు టెలివిజన్ సెట్స్‌లో కన్పిస్తూంది. కొంతమంది వ్యక్తులు గనిలో ఏదో పదార్థపు లోహాన్ని తవ్వి తీసుకెళ్ళున్నట్లు కన్పిస్తున్నదానినిబట్టి గమనించవచ్చు. ఆ గనిలో తవ్విన ఖనిజాన్ని అండర్‌గ్రౌండ్ లోనే సముద్రంలో నిర్మించబడిన పొడవైన సొరంగం ద్వారా 'కేబుల్ కార్' వంటి దానిలో పంపుతున్నారు. దాని మరో దీవిలోనివారు సంగ్రహించి ఆ ఖనిజంనుండి రేడియంలాంటి అణు ధార్మికపదార్థాన్ని తీస్తారు. దానిని అణుబాంబులు మొదలైనవాటిని తయారుచేయటాని కుపయోగిస్తున్నారు.

ఒక కంప్యూటర్ ముందు కూర్చొని చూస్తున్న ఒక వ్యక్తి ఎర్రటి బల్బు వెలగటంతో అలవాటుగా టెలివిజన్ సెట్‌లోకి చూసి స్విచ్ నొక్కాడు. కాని వెంటనే ఏదో అనుమానం వచ్చింది. మరుక్షణం మరో బటన్ నొక్కాడు. అంతకుముందు టెలివిజన్‌లో కన్పించిన వ్యక్తులు కన్పించలేదు. ఇంతలోనే ఏమయ్యారు? అసలెవరు వీళ్లు? ఎలా జొరబడ్డారు లోనికి?

మరుక్షణమే అలారం సైరెన్ "బొంయ్" మంది. మరుక్షణమే ఆ అండర్ గ్రౌండ్‌లో కలకలం హెచ్చింది. సైనికులు ఉరుకులు, పరుగులమీద వచ్చి వాలుతున్నారు. ఎక్కడివారి నక్కడే ఆపేసి చెక్ చేస్తున్నారు.

ఇంత హడావుడి జరగటానికి కారణం సాగర్,

కైలాష్ అని వేరే చెప్పక్కర్లేదు. వారిద్దరు నిలుచున్న ద్వారం పైకిలేచింది. తాము టెలివిజన్‌లోకి ఎక్కినా గుర్తు పట్టలేనందుకు సంతోషించారు. కాని లోనికి వెళ్ళిన మరుక్షణమే ముందునుంచి ఒక లెన్స్ దూసుకు వచ్చింది. ఇద్దరు క్రింద కూర్చున్నారు చటుక్కున. ఫలితంగా కంట్రోలు రూంలోనున్న వ్యక్తికి వీరు కనిపించకపోవటం, అనుమానం బలపడటం జరిగింది. జరిగేది గ్రహించారు ఇద్దరూ.

వారు ప్రవేశించిన మార్గం సన్నటి నడవాలా వుంది. అంతకుముందు నుంచి వినిపిస్తున్న ఇంజను శబ్దం ఎక్కువయింది.

“మనల్ని గ్రహించారు. వెంటనే ఇక్కణ్నుంచి తప్పుకోవాలి!” అన్నాడు కైలాష్. ఇద్దరూ అలా క్రింద కూర్చునే పాకుతూ పోయారు.

“ఇక్కడంతా ఆటోమాటిక్ సిస్టంలా వుంది. అవతలి వైపు తలుపు బంధిస్తే?” అనుమానంగా అడిగాడు కైలాష్. సాగర్ జవాబివ్వలేదు. అంతకుముందే ఆ అనుమానం అతనికి వచ్చింది.

సైనికుల బూట్లచప్పుడు వినిపిస్తోంది.

గబగబా పాకారు. తలుపు దగ్గరకు చేరుకొన్నారు. బరువుగా ఊపిరి పీలుస్తూ ఉండిపోయారు కొద్దిసేపు.

అదే సమయంలో తలుపుదగ్గర చప్పుడయింది. ఇద్దరూ వెల్లకిలా పడుకుని మెషిన్‌గన్స్ తలుపువైపు వుంచి గురి పెట్టారు. తలుపు తెరుచుకుంది.

“ధన్ ధన్ ధన్ ధన్.”

మూడు సెకనులు గుళ్ళవర్షం కురిసింది. ఆ నడవా అంతా రీసౌండ్‌తో అదిరిపోయింది. టపటప రాలిపోయారు.

కొంతమంది సైనికులు. మిగిలినవాళ్ళు ప్రక్కకు నక్కారు.

రెండోవైపుకు తిరిగాడు సాగర్. అటునుంచి తలుపు తెరుచుకుని కొంతమంది లోనికి వచ్చారు. సాగర్ చేతిలోని గన్ గర్జించింది. కొంతమంది కూలిపోయారు. చటుక్కున బయటకు పరుగెత్తారు సైనికులు.

తరవాత మరో పదినిముషాలు సైనికులతో దాగుడుమూతలు ఆడారు సాగర్, కైలాష్. కైలాష్ పిక్కలోనికి దూసుకుపోయింది ఒక గుండు. నిప్పుకణిక లోనపెట్టి తిప్పుతున్నంత బాధ.

రెండునిమిషాలసేపు నిశ్శబ్దం. ఇరువైపు తలుపులూ తెరుచుకోలేదు. సాగర్, కైలాష్‌లు తలుపుకు గురిపెట్టి కాల్చారు. రంధ్రాలు పడి, ఎవరిదో ఆర్తనాదం విన్పించింది. ఇవతలివైపు తలుపు తెరుచుకొని ఇద్దరూ జంప్ చేసి నేలమీద పడిపోయారు. మరో ఇద్దరు కూలిపోయారు. ఇప్పుడా చిన్నగదిలో అయిదారుగురి శవాలు తప్ప ఏమీ లేవు. అదొక లిఫ్ట్ అని గ్రహించాడు సాగర్.

మరుక్షణమే లిఫ్ట్ క్రిందకు దిగింది.

“మనల్ని క్రిందకు దింపుతున్నారంటే, క్రింద ఆహ్వానం ఎదురుచూస్తున్నదన్న మాట” అన్నాడు సాగర్. కైలాష్ పళ్ళబిగువులో బాధ భరించి మెషిన్‌గన్ అందుకున్నాడు. పిక్కకి రుమాలు కట్టినా రక్తస్రావం ఆగటంలేదు. సాగర్‌కి కైలాష్ బాధ తెలుసు. కాని, విచారించటానికిది తగిన సమయంకాదు. అంతసమయమూ లేదు.

లిఫ్ట్ ఆగింది. తలుపులు తెరిచాడు ప్రక్కనుండి. బయటనుంచి గన్స్ గర్జించాయి. అడుగునుంచే కాల్చారు ఇద్దరూ. రెండు నిమిషాల అనంతరం బయట ఎవరూలేరు. అలారం

హోయ్‌మంటూంది ఇంకా! లిఫ్ట్ బయటకు నడిచి, నడవా వెంట ఉన్న తలుపు తెరిచాడు. పెద్ద హాలు కన్పించింది. లోనికి నడిచి తలుపులు వేశారు.

## 7

అదొక హాలులాంటి అంతర్భాగం. లైట్లు కాంతితో పట్టపగలులా ఉంది. హాలు ఆ చివర వెడల్పయిన సొరంగ ముఖద్వారం కన్పడుతూ వుంది. ఆ సొరంగం పైభాగాన బలమైన ఇనుప తాడు వుండి, దానికి వెడల్పుగానున్న తొట్టెలాంటిది వేలాడుతుంది. ఆ తొట్టెనిండా గనిలోనుంచి తీయబడిన ఖనిజం నింపబడి వుంది. హాలులోవున్న మెషిన్‌ల ద్వారా ఆ తొట్టె సొరంగ మార్గంగుండా ప్రయాణించి రెండో దీవిని చేరుతూంది. అటువంటి తొట్టెలు ఆ సొరంగంలో ఈజీగా రెండు పడతాయి. అంటె అటునుంచి రావటం ఇటునుంచి పోవడం జరుగుతాయన్న మాట.

అయితే ఆ హాలులోని మెషిన్‌లన్నీ నిశ్శబ్దంగా వున్నాయి. తొట్టెలో కదలిక లేదు. ఆ హాలులో ఎవ్వరూ లేరు.

అలారం మోత విని అందరూ పోయి వుంటారని గ్రహించాడు సాగర్. అయితే ఆ ఖనిజం ఏమిటో, ఆ తొట్టె ఎక్కడికి వెళుతూందో అతనికి తెలియలేదు. కైలాష్‌ని హెచ్చరించాడు. ఇద్దరూ ముందుకు పరుగెత్తారు. కైలాష్‌ని తొట్టెలోకి ఎక్కించి, మెషిన్‌ల దగ్గరికి పరుగెత్తి పరిశీలించాడు సాగర్. రెండు నిమిషాల ప్రయత్నం తర్వాత మెషిన్ స్టార్ట్ అయింది. రివ్వున పోయి, తానూ తొట్టె ఎక్కాడు.

సొరంగ మార్గం చీకటిగా వుంది. కనీసం అక్కడక్కడన్నా లైట్లు లేవు. తొట్టె కుదుపులకు కైలాష్, సాగర్‌లు

ఎగిరెగిరి పడుతున్నారు. రక్తం చాలాపోయింది కైలాష్‌కి. నిస్త్రాణతో కళ్ళు మూసుకున్నాడు.

సాగర్ ఆలోచిస్తున్నాడు. 'ఈ సొరంగం ఎంత దూరం వరకు వుంది? ఈ ఖనిజం యొక్క ఉపయోగమేమిటి? తమపై దాడిచేసిన విమానాలు, వీరూ ఒకే దేశం అని తెలుస్తోంది. కాని విమానాలు కన్పించలేదు. కాని ఇక్కడి అండర్‌గ్రౌండ్ చూస్తుంటె విమానాలను కూడా అండర్‌గ్రౌండ్‌లో దాచి వుండాలి. అందుకే తమ కళ్ళబడలేదు.'

"సాగర్! ఎన్ని ప్రమాదాలయినా ఎదుర్కొని నువ్వయినా కార్యం పూర్తి చెయ్!"

"కైలాష్" అన్నాడు మందలిస్తున్నట్లు సాగర్.

"అవును. నాకు తెలుసు. సాగర్ నా రక్తం చాలా పోయింది. ఎక్కువసేపు బ్రతకలేను. నీ వెంట వుండి నీకు అడ్డురాలేను. నన్ను వదిలెయ్" ఆ కంఠంలో దీనత్వం లేదు. దేశంకోసం ప్రాణాలిస్తున్నానన్న ఆనందం వుంది.

"డోంట్ బి పూలిష్" అన్నాడు సాగర్. "నీ ప్రాణాలకు ఏం భయంలేదు. నిరుత్సాహపడకు."

కైలాష్ బలహీనంగా నవ్విన నవ్వు సాగర్‌కు ఆ చీకట్లో కన్పించలేదు.

కాని కైలాష్ ఏమీ అనలేదు. మౌనంగా కళ్ళు మూసుకున్నాడు. తొట్టె ఉన్నట్లుండి ఆగిపోయింది.

# 8

"సాగర్! అటు చూడు!" వెనక్కితిరిగి వచ్చినవైపు చూపించాడు కైలాష్. అతని కంఠధ్వనినిబట్టి వెనక్కు తిరిగి చూశాడు సాగర్.

దూరంగా లైట్లు అవుపిస్తున్నాయి. ఎవరో వస్తున్నారు. "వెంటనే ఇక్కణ్నుంచి పారిపోవాలి పద!" ఇద్దరూ క్రిందకు దిగారు. అడుగున గచ్చు నేలలాగా గట్టిగా వుంది. అడుగుతీసి అడుగు వేస్తూంటె చప్పుడవుతూంది.

"నేను వద్దు. నువ్వు తప్పించుకో. వాళ్ళని నేను కవర్ చేస్తాను" అన్నాడు కైలాష్ మెషిన్‌గన్ లైట్ల వైపు గురిపెడుతూ. సాగర్ కదల్లేదు.

"సాగర్! క్విక్! వెళ్ళిపో. వాళ్ళు వచ్చేస్తున్నారు. నా గురించి ఆలోచించకు" అరిచాడు కైలాష్ చిన్నగా. ఇంతలో లైట్ల వైపునుండి కాల్పులు విన్పించాయి. చటుక్కున బోర్లా పడిపోయా రిద్దరు.

"సాగర్! క్విక్! గో ఎవే!" ఒత్తిడి చేశాడు కైలాష్. అతని కంఠంలో బలంలేదు. నీరసంగా వుంది.

కైలాష్‌ది మొండిపట్టు అని తెలుసు సాగర్‌కి.

ఇంతలో సొరంగం రెండోవైపు లైట్లు, చప్పుళ్ళు కన్పించాయి. ఉలిక్కిపడ్డా రిద్దరు.

"ఆల్‌రైట్! నేను వెళుతున్నాను!" చివరిసారిగా కైలాష్ చేతిని నొక్కి సొరంగం రెండోవైపుకు పరుగు తీశాడు సాగర్. అతని బూట్లచప్పుడు సొరంగంలో ప్రతిధ్వనిస్తోంది.

వెనకనుంచి కాల్పులు మొదలయ్యాయి. సొరంగం కూలిపోతుందేమోనన్నంత శబ్దం. కైలాష్ ఇటునుంచి కాలుస్తున్నాడు. ఎదురుగా లైట్లు కన్పిస్తున్నాయి. పరుగెత్తుతూనే కాల్చాడు. నిమిషం తర్వాత చీకటి అలుముకుంది. ఆగిపోయాడు సాగర్.

అక్కడ సొరంగం వంకర తిరిగింది. ముందుకుకూడా ఉంది. తోట్టె మొదట వంకర తిరిగినచోటు ఆగిపోగానే,

దానికక్కడ ఖాళీ చేస్తారు. అది హాలులోనుంచి తిరిగి సారంగంకు ఎదురుగానున్న మార్గంలోనుంచి తిరిగి సారంగంలోకి ప్రవేశిస్తుంది.

వంకర తిరిగిన గోడకు ఆనుకొని తల తొంగిచూశాడు. ధన్ మన్నాయి గన్స్. తల వెనక్కి లాక్కోకపోతే బద్దలైపోయేది. తమ గురించి వేట పెద్ద ఎత్తులోనే సాగుతోందని తీర్మానించుకున్నాడు. వెనకనుంచి చప్పుళ్ళు వినిపిస్తున్నాయి యింకా. సారంగం అంతమయిన హాలు కూడా అంతకుముందు చూసిన హాలుమాదిరే ఉంది. ఇక్కడ మిషన్ లుమాత్రం లేవు. హాలు అంతా ఖనిజంతో నిండిపోయి ఉంది. ఆ ఖనిజంమీద నిలబడి గన్స్ పేలుస్తున్నారు ఐదుగురు సిపాయిలు.

సాగర్ బోర్లా పడుకున్నాడు. గన్ ని మాత్రం బయట పెట్టి, సైనికులున్నవైపు గురుతుంది కనుక ట్రిగ్గర్ నొక్కాడు. ఆర్తనాదాలు వినిపించాయి. ఒకగుండు వచ్చి ముంజేతి మణికట్టులో దిగబడింది. వెనక్కి లాక్కున్నాడు చేతిని. మెషిన్ గన్ గుళ్ళకి సారంగం గోడ పెచ్చులూడిపోయింది. నెమ్మదిగా తల బయటపెట్టి చూశాడు. ఐదుగురు పడిపోయి ఉన్నారు. లోనికి అడుగుపెట్టాడు.

# 9

ఆదేసమయంలో సారంగంలో చప్పుళ్లు ఆగిపోయాయి. హాలులోఉన్న ఖనిజపు కుప్పలను దాటుకుంటూ ముందుకు నడిచాడు సాగర్. హాలు చివర ఒకగది ఉంది. చూస్తేనే అదొక లిఫ్ట్ అని తెలుస్తోంది. దానిలోనికి ప్రవేశించి స్విచ్ నొక్కాడు.

సారంగంలో ఈ పాటికి కైలాష్ చనిపోయి ఉంటాడు. సైనికులు అతన్ని కనుగొని, తాను ఏమయ్యాడో అర్థం

గాక తన్నుకుంటారు. కనీసం ఐదునిమిషాలైనా తనకు సమయం చిక్కుతుంది. ఈలోపునే తాను తన పని ముగించేయాలి. తాను చనిపోవటం ఖాయం. తమవద్దనున్న సమస్తం, ఆయుధాలు, బాంబులు లాక్కున్నారు. తన దగ్గర ప్రస్తుతం ఈ మెషిన్‌గన్ తప్ప మరో ఆయుధం లేదు. దీనిలోనైనా అమ్యూనిషన్ ఐపోవచ్చింది.

లిఫ్ట్ ఆగింది. తలుపు తెరిచి బయటకు తొంగిచూశాడు. ఎవరూ కన్పించలేదు. నడవా చివర ఒక తలుపు ఉంది. తలుపుపైన ఎర్రటి బల్బు వెలుగుతూంది. ప్రక్కనే గోడ మీద స్విచ్ కనిపిస్తూంది. బటన్ నొక్కాడు. తలుపు నిశ్శబ్దంగా పైకిపోయింది. లోనికి రాగానే మూసుకు పోయింది.

అక్కడి దృశ్యం అతణ్ని విభ్రాంతుణ్ని చేసింది. చాలా పెద్దగుహ అది. ఫ్లష్‌లైట్ల కాంతిలో పట్టపగలులా మెరిసిపోతూంది. చిన్నచిన్న విమానాలు తయారీలో ఉన్నాయి. తమపై దాడిచేసినవి అటువంటి విమానాలేనని గుర్తించగానే సాగర్ ఆవేశపూరితుడయ్యాడు. ఇదంతా చూస్తుంటే మరో ప్రపంచయుద్ధానికి నాంది పలుకు తున్నట్లే ఉంది.

ఆ పెద్దగుహలో ఎవరూ లేరు. నిర్జనంగా, నిశ్శబ్దంగా ఉంది. అదే సమయంలో గుహ పైభాగం పెద్ద శబ్దంతో రెండుగా విడిపోవ నారంభించింది.

చటుక్కున ప్రక్కనేవున్న ఒక ఖాళీ డ్రమ్ము ప్రక్కకురికి గమనించసాగాడు సాగర్.

రెండునిమిషాల తర్వాత తలుపులు తెరుచుకున్నాయి పూర్తిగా. బయట ఎర్రటి ఆకాశం కన్పిస్తోంది. టైం చూసుకోవటానికి సాగర్ దగ్గర వాచీ లేదు. సుమారుగా

సాయంత్రం అయిదున్నర, ఆరు అయ్యింటుంది.

తలుపులు తెరుచుకున్నాక పైనుంచి ఒక హెలికాప్టర్ దిగింది నెమ్మదిగా. తలుపులు మూసుకుపోయాయి మామూలుగా. హెలికాప్టర్ నుంచి ఒక ఆజానుబాహుడు దిగాడు పూర్తిగా మిలటరీదుస్తుల్లో ఉండి. అతనూ 'కైనా' దేశం వాడే ననటంలో ఎట్టి సందేహం లేదు.

ఈ ఆపరేషన్‌కు లీడర్ అని అర్థం అయింది సాగర్‌కి. బహుశా తమ విషయం అతనికి తెలిపివుంటారని భావించాడు సాగర్. కాని లీడర్ తనవైపే రావటం గుర్తించి అదిరిపోయాడు. అతడు తనని గమనించాడా?

లీడర్, సాగర్‌ని చూడలేదు. హాలు చివరకు నడిచి ప్రక్కనే గోడదగ్గరున్న ఒక స్విచ్ నొక్కాడు. మరుక్షణమే నేలమీద దిగటానికి అనువుగా మెట్లు కన్పించాయి, చిన్నపలక తొలిగిన తర్వాత లీడర్ వాటివెంట నడిచాడు.

సాగర్ హెలికాప్టర్ వైపు చూశాడు. పైలట్ దిగి ఎటో వెళ్తున్నాడు. పలక మూసుకుపోయింది. రెండు నిమిషాలు ఆగి, తానూ తలుపు తెర్చుకొని లోనకు ప్రవేశించాడు. అక్కడ పొడుగ్గానున్న నడవా దాటింతర్వాత ఒక తలుపు కన్పించింది. లోనికి పోయాడు. లోపల మరో హాలు కన్పించింది. రియాక్టర్‌లవంటివి నిర్మితమై వున్నాయి. కొంతమంది మనుషులు పనిచేస్తున్నారు. వారికి కనపడకుండా ఒక స్తంభం చాటున నక్కి, లీడర్‌కోసం వెదికాడు. లీడర్ హాలుకి ఒకప్రక్కగా ఉన్న తలుపు తెర్చుకొని లోనికి వెళ్ళటం కన్పించింది.

సంశయంలో పడ్డాడు సాగర్. అతని వెంటే వెళ్ళటమా లేక ఈ రియాక్టర్‌లని నాశనం చేయటమా?

హాలునంతటినీ పరిశీలించాడు. దూరంగా ఎక్స్‌ప్లొజివ్స్ అన్న అక్షరాలు కన్పించడంతోనే అతని కళ్ళు మెరిశాయి. కాని అంతలోనే చప్పబడిపోయాడు. వాటి దగ్గరకు వెళ్ళాలంటే రియాక్టర్‌ని, అంతమంది మనుషుల్ని దాటుకుంటూ వెళ్ళాలి.

తళుక్కున ఒక ఆలోచన మెరిసింది సాగర్‌కు. అంతకు ముందు విమానాలు తయారుచేసే హాలులో పెట్రోలు డబ్బాలు చూశాడు తను. వాటిని ఇప్పుడు ఉపయోగించుకోవాలి. తిరిగి వెనక్కు నడిచాడు సాగర్.

* * *

మర్నాడు పోర్ట్ బ్లెయిర్‌లో నున్న భారతీయ ఏజంటు ప్రభుత్వానికి పంపిన సమాచారంలో ఇలా ఉంది.

"భారత కాలమానం ప్రకారం క్రిందటిరోజు సాయంత్రం ఏడు గంటలకు అండమాన్ సమీపంలో పోర్ట్ బ్లెయిర్‌కు దగ్గరగానున్న ఒక దీవిలో పెద్ద పెద్ద ప్రేలుళ్ళు కలిగాయి. ఆకాశం అంతా ఆ వెలుగులో ప్రతిఫలించింది. తుత్తునియలయిన ఇనుప భాగాలు, మండుతున్న ఇనుప వస్తువులు ఎగిరి రెండు మైళ్ళవరకూ వచ్చిపడ్డాయి. ఈ దృశ్యాన్ని చాలామంది చూశారు.

సమీపంలో సంచరించే నౌకలు ఏమీ లేకపోవటంవల్ల ప్రాణనష్టం జరగలేదు. కాని దీవి అంతా నాశనం ఐంది. ఆ దీవిలో ఎలా ఈ ప్రేలుళ్ళు సంభవించాయో ఎవరికీ తెలీ లేదు. ప్రక్కనేవున్న మరొక దీవికూడా ప్రేలుళ్ళతో నిండిపోయింది. దాదాపు ఐదారు గంటలవరకు ప్రేలుళ్ళు వినవస్తూనే వున్నాయి. తెల్లవారుఝామునకూడా మంటలు ఆరిపోలేదు."

—: ఐపోయింది :—




(23 వ భాగము)

'ఛ్రుక్' మంది సూది దిగంగానే.

మందు లోనికి పోతూంటే, ఒంట్లోంచి ఆవిర్లు క్రమ్ముకొచ్చినట్లయింది.

శరీరం దూదిపింజెలా తేలిగ్గా గాలిలో తేలిపోతూన్నట్లనిపించింది.

మరు నిముషంలో కళ్ళకు మగత ఆవరించింది. మసకలు క్రమ్ముతున్నాయి.

ఎదురుగావున్న డాక్టర్ డేనియల్ గానీ, ఆయన ప్రక్కనే నిల్చున్న నర్స్ గానీ కనుపించలేదు.

కానీ, నా గుండెలనిండా ఆ మెరికన్ నర్స్ రూపం మాత్రం నిండిపోయి వుంది.

ఆమెను నా రెండుచేతులతో పట్టుకొని గొంతు గట్టిగా నులిమి చంపుతున్నట్లు, కత్తితో బలంగా పొట్టలో పొడు

స్తున్నట్లు, రివాల్వరు గురిపెట్టి కణతలు చిట్లిపోయేలా కాల్చినట్లు, కలలాంటి మైకంలో ఊహించుకుంటూ, స్పృహ లేని లోకంలోకి తూలిపోయాను.

ఆ స్థితిలో ఎన్ని నిముషాలు, గంటలు, రోజులు ముందుకు జరిగివుంటాయి. వాటి ఉనికి నాకు ఏమాత్రం తెలీదు.

మళ్ళీ కళ్ళు తెరిచేసరికి తెల్లటి ఎండ, వేడి వెలుతురు కిటికీలోంచి నా గదిలోకి దూరి, దూసుకొచ్చాయి.

ఈమారు సులభంగానే లేచి కూర్చోగలిగాను. అలా చేస్తున్నప్పుడు ఎక్కడా నొప్పిగానీ, బాధగానీ, పుట్ట లేదు.

ఒకక్షణం కూర్చుని, మెల్లగా ఒక్కొక్క కాలే మంచంపైనుండి క్రిందకు జారవేశాను.

ఒళ్ళంతా తేలికగా వుంది. అంతకుముందున్న అస్వస్థత గానీ, అనారోగ్యంగానీ, నీరసంగానీ కనుపించలేదు. చిన్నగా కాళ్ళను నేలపైన ఆనించి, లేచి నుంచున్నాను. గదిలో పచార్లు చేశాను.

చాలారోజుల తర్వాత మామూలు మనిషిలా తయా రైనట్లు నాకు నేనే తెలుసుకున్నాను.

"తలుపు నెట్టుకొని లోనికొచ్చిన డాక్టర్ డేనియల్ నావైపు చూసి, "హల్లో! రాజ్! స్పృహ వచ్చిందా నీకు?" అంటూ లోనికొచ్చాడు.

ఆయనకు జవాబు చెప్తున్నట్లు నవ్వాను.

"అలా కూర్చో!" అంటూ మంచం చూపించాడు డేనియల్.

వచ్చి కూర్చున్నాను.

ఐదు నిముషాలకాలం పరీక్ష చేశాడు. అంతా అయ్యాక చేతులు కడుక్కుంటూ "యూ ఆర్ ఓ. కే!" అన్నాడు.

ఆ మాటంటూవుంటే ఆయన కళ్ళు జ్యోతుల్లా వెలిగి పోవటం నేను గమనించాను.

"ఐ ఫీల్ దట్!" అన్నాను కృతజ్ఞతాపూర్వకంగా.

"రెండ్రోజులు మత్తులోంచి లేవకుండా వుండేందు కిచ్చాను మందు. దాని ప్రభావం కనపడుతుంది!" అన్నాడు డేనియల్.

"మీ సేవకు ఉత్తి కృతజ్ఞతలు చెప్పుకోవడం తప్ప, ప్రస్తుత పరిస్థితిలో నేను చెయ్యగలిగిందేమీ కనుపించడం లేదు" అన్నాను.

"డోంట్ బీ సిల్లీ! నువ్వు నాకేం చెయ్యా నవసరం లేదు. కష్టపడి నీ ప్రాణాలు నిలబెట్టాను. వాటిని అర్థంలేని మొండితనంతో, వ్యర్థమైన సాహసాలకు పోయి పోగొట్టుకోవద్దు. నిండుగా నూరేళ్ళు జీవించు. చరిత్రలో నీ గురించి, నువ్వు చేసిన మంచి గురించి మానవాళి రాసి, మరీమరీ మననం చేసుకొనే విధంగా నీ నడవడికను తీర్చి దిద్దుకో. అంతకన్నా నాకు ఆనందం కలిగించే కానుక మరేదీ వుండదు!" అన్నాడు డేనియల్.

ఆ మాటలు చెప్తున్నప్పుడు ఆయన కళ్ళల్లో కనుపించిన ఉద్రేకం, బుగ్గలపై కుబికిన ఆవేశం, చూసి అవాక్కయి పోయాను.

"అలాగే! మీరు చెప్పిన సలహా మరచిపోను డాక్టర్!" ఆయన చేతిలో చెయ్యివేశాను.

డేనియల్ నన్ను బలంగా కౌగలించుకున్నాడు.

మా ఇద్దరిమధ్యా ఏ మాటలూ లేవు.

"నీ కార్యక్రమం ఏమిటి?" అడిగాడు డేనియల్ ఐదు నిముషాల తర్వాత.

డెల్లానుగురించి చెప్పాలా, వద్దా అని ఆలోచించాను.

ఆయనకు నా మనస్సులో వున్న భావాల్ని చెప్పటంలో తప్పు లేదనిపించింది.

"మీ అనుమతిస్తే నే వెళ్ళిపోతాను. ముందు డెల్లాను వెతుకుతాను. మనిషినో, లేకుంటే కనీసం శవాన్నో పట్టుకోగలుగుతాను. ఆ తర్వాత ఏం చెయ్యాలో నిర్ణయించుకుంటాను" అన్నాను.

"గుడ్! కానీ మిస్టర్ రాజ్. మేము ఇన్నాళ్ళుగా చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. నా అనుమానం ఆమె మనఃస్థిమితం లేని పరిస్థితిలో సముద్రంలోదూకి చనిపోయి వుంటుందని. ఆమె శవంకూడా అందువల్లే కనుపించలేదు. అందువల్ల నువ్వు ప్రయత్నాలు మానుకుని వేరే దారి చూసుకోవడం మంచిది. నీ కిష్టమయితే విమానంలో అమెరికాకు పంపుతాను. అక్కడే సెటిలయిపోవచ్చు. కాదనుకుంటే మీ దేశం వెళ్తానన్నా నాకేం అభ్యంతరం లేదు. నీపైన ఏ విధమైన కఠినచర్యలు తీసుకోకుండా, ప్రభుత్వాన్ని ఒప్పించగలను. ఆలోచించు!" అన్నాడు డాక్టర్.

ఆయన మాటలకు ఆశ్చర్యపోయాను.

నాకు నా మాతృభూమి గుర్తొచ్చింది. పవిత్రమైన పుణ్యభూమి భారతదేశం. అక్కడ నేను గడిపిన అపవిత్రపు, అవినీతి జీవితం, దాని తాలూకు నేరాలుకూడా కళ్ళముందు సినిమా బొమ్మల్లా కదిలాయి.

బొంబాయి నగరం, అందమైన సముద్రం, తెలిసిన మనుషులు, ప్రదేశాలు, సుందరమైన ప్రకృతి, ఆకాశాన్ని అంటినట్లుండే హార్మ్యాలు అన్నీ గుర్తుకొచ్చాయి. డేనియల్ కల్పించే అవకాశాన్ని సద్వినియోగం చేసుకుందా మనిపించింది, తిన్నగా వెళ్ళిపోయి.

కానీ డెల్లా గుర్తొచ్చింది. ఆమెను గాలికి వదిలేసి, నా స్వార్థం నేను చూసుకోవడం, అన్యాయం మాత్రమే కాదు! అధర్మమనికూడా తోచింది మనస్సుకు. ముందామె సంగతి తేలందే, నా భవిష్యత్ పథకాల గురించి ఆలోచించడం తప్పన్న, గట్టి నిర్ణయానికొచ్చాను.

“నీలో జరుగుతున్న ఘర్షణ నాకు తెలుసు. నువ్వు మీ దేశం వెళ్ళడమే మంచిది. ఇన్నాళ్ళూ అనుభవించిన కష్టాలు చాలు. జన్మంతా సరిపోతుంది వాటిని తలచుకొంటూ సుఖపడేందుకు. ఏమంటావ్?” అడిగాడు డేనియల్ నా మనోభావాల్ని పసిగట్టి.

“అది కాదు! డెల్లాను వదిలివెళ్ళడం వీలు కాదనిపిస్తుంది!”

“ఆమె ఈ లోకాన్నే విడిచి వెళ్ళిపోయి వుండొచ్చని చెప్పానుగా?”

“అదే నిర్ధారణగా తెలియాలి! నాకు నేనే ఆ విషయం నమ్మకంగా తెలుసుకోవాలి!”

“ఐతే నా మాట విననంటావు?” కాస్త కోపంగా అడిగాడు డేనియల్.

“అలాగనుకోకండి. ఆమెకూ, నాకూ ఉన్న అనుబంధం ఎంత గట్టిదో మీకు తెలీదు. ఒకరికోసం ఒకరం ఎంతెంత సాహసాలు చేశామో, ఎన్నెన్ని ప్రమాదాలు యెదుర్కొన్నామో, గుర్తువచ్చాక, నా పరిస్థితిలో మీరున్నా, నాలాగే నిర్ణయం చేసుకొనేవాళ్ళు!” అన్నాను.

“దట్స్ ఆల్ రైట్! నేను బహుశా రేపు వెళ్ళిపోతాను. ఆ లోపల నీ మనస్సు మారి, రాదలచుకుంటే, నా వెంట నిన్నుకూడా న్యూయార్కుకు తీసుకెళ్ళగలను. లేదా నీ ఖర్మ!” అన్నాడు లేస్తూ కుర్చీలోంచి.

నేనేం మాట్లాడలేదు. మౌనంగా నిల్చున్నాను.

డేనియల్ గదిలోంచి వెళ్ళిపోయాడు.

ఆయన వెళ్ళాక నాకు నర్సుల విషయం గుర్తొచ్చింది. వాళ్ళిద్దరూ ఆయనతో వెళ్తున్నదీ, లేనిదీ తెలుసుకో నందుకు చింతించాను. డెల్లా కేదన్నా ప్రమాదం జరిగినట్లు ఋజువు ఐన పక్షంలో అమెరికన్ నర్సును చిత్రహింస చేసి చంపాలన్న నిర్ణయం అంతకుముందెప్పుడో తీసు కున్నాను. అది అమలుపరచడం సాధ్యం. అవుతుందా? కాదా? అన్న అనుమానం బయలుదేరింది.

మరుసటిదినం విమానం బయలుదేరే లోగా, నా అన్వే షణ పూర్తి కావాలి! కాని ఇంత పెద్ద దీవిలో ఒక్కడిని ఒక్క రోజులో వెతకలేనేమో ననిపించింది.

ఐనా నిరుత్సాహం కలగలేదు. ప్రయత్నించ దలచు కొన్నాను. వెంటనే బట్టలు మార్చుకున్నాను. బూట్లు తొడుక్కున్నాను. మెల్లగా బైటకొచ్చాను.

బిల్డింగు వెలుపలకొచ్చాక చెట్లనీడలో కుర్చీ వేసుకుని కూర్చుని విస్కీ త్రాగుతున్న అమెరికన్ నర్స్ కనిపిం చింది.

ఆమెవైపు నేను చూడగానే రమ్మని చేత్తో సైగ చేసింది.

దగ్గరకంటూ వెళ్ళాను.

"కూర్చో!" అంది తనకెదురుగా వున్న ఖాళీకుర్చీ చూపించి.

క్షణం సందేహించి, తర్వాత కూలబడ్డాను.

"త్రాగుతావా?" అడిగింది ఆమె.

"స్మాల్ పెగ్!" అన్నాను.

సీసా అందించింది,

తీసుకొని, నోటినిండా పోసుకుని గుటక వేశాను. సీసా తిరిగి ఇచ్చేశాను. ఆ చేదు వాసన, ఆ మత్తూ, రుచి చూసి చాలాదినాలు కావటంవల్ల, కడుపులో త్రిప్పింది.

"ఎక్కడికి బయలుదేరావ్?" అడిగింది నర్సు.

"అలా తిరిగొద్దామని!" అన్నాను.

"అబద్దాలు చెప్తున్నావ్. నీ ప్రియురాలు డెల్లాను వెతకాలని కదూ నీ తాపత్రయం" తెలిసినట్లు అడిగింది.

"ప్రియురాలు కాదు! ఆమె నా భార్య!" అన్నాను.

"అదే అదే!"

"అవును!"

"ఇంతదాకా డేనియల్ వెతికించాడు. ఆమె కనుపించ లేదు. హెలికాప్టర్లు వేసుకొని తిరిగారు. ఐనా లాభం లేకపోయింది. ఇంక నీకు ఎలా దొరుకుతుంది?" అడిగిం దామె.

"నాకు ఆమె కనిపించదని అంత ఖచ్చితంగా నీకెలా తెలుసు?" అడిగాను కాస్త సీరియస్‌గా.

"తెలుసని కాదు! ఊహించాను!" అందామె,

నా కామె మాటలు నమ్మ బుద్ధికాలేదు. తన చేతులతో కట్లు విప్పి, వెలుపలికి తీసుకెళ్ళి, ఎక్కడైనా గొంతు పిసికి చంపి, పూడ్చిపెట్టి వుంటుందా అన్న అనుమానం కూడా కలిగింది నాకు. బహుశా ఆమె శవమైనా దొరక్క పోవడానికి కారణం అదే ననిపించింది.

మెదడు వేగంగా పనిచెయ్యసాగింది. గమ్యం తెలీ కుండా దీవినంతా మళ్ళీమళ్ళీ తిరిగినా డెల్లా కనుపిస్తుం దన్న నమ్మకంలేదు. ఈమెను కాస్త మభ్యపెట్టి, మెల్లిగా రహస్యం రాబట్టుదామా అనుకున్నాను. అదే మంచిదని తోచింది.

‘‘డెల్లా, నేనూ వింత పరిస్థితుల్లో, విచిత్రమైన వాతావరణంలో కలుసుకున్నాం. ప్రేమనేది లేకుండా, శారీరకంగా ఒకటైనాం. ఆ తర్వాత ప్రేమ దానంతటదే పుట్టుకొచ్చింది. ఫలితంగా పెళ్ళి చేసుకున్నాం. ఆమె ఇలా మాయం కావడం నన్ను కొంతవరకు కృంగదీసింది. పోయినవాళ్ళతోటే మనమూ పోవడం మంచిదనిపించింది నిన్నటిదాకా! ఇవాళ డేనియల్ గారు కొన్ని విషయాలు చెప్పారు. మనిషి బ్రతుక్కి వున్న విలువలు క్రొత్త కోణాలనుంచి చూపించారు. అవి చూశాక ఆమె లేకున్నా బ్రతకటం తప్పులేదనిపిస్తూంది,’’ అన్నాను ఉపోద్ఘాతంలా.

నా మాటలు వింటూ తలెత్తి నా కళ్ళలోకి సూటిగా చూస్తూ డ్రింక్ తీసుకోవడం మొదలెట్టింది అమెరికన్ నర్స్.

‘‘దట్స్ గుడ్!’’ అంది సీసా ప్రక్కనపెట్టి.

‘‘లక్కీ! నా భావాల్ని నువ్వూ మెచ్చుకుంటున్నావ్!’’ అన్నాను.

‘‘నీలో ఇలాంటి మార్పే నేను కోరాను!’’ అందామె.

‘‘ఎందుకు? దానివల్ల నీ కుపయోగ మేమిటి?’’

‘‘నీలాంటి తెలివైనవాడు, అందమైన మగాడు, చదువుకున్న విజ్ఞుడు ఇలా ఎడారుల్లో, అడవుల్లో కాదు వుండవలసింది. నాగరికత, సుఖం, స్వర్గం అందుబాటులో వుండే మా అమెరికాలో.’’

‘‘అవుననుకో! తోడుండాలిగా! అది లేకుంటే కష్టం' అందులోనూ పరాయిదేశంలో’’ అన్నాను.

‘‘ఆ బెంగ పెట్టుకోకు! నేనుంటాను.’’

‘‘ఐతే నన్ను తీసుకెళ్తావా? అమెరికాకు నీతో...?’’

అడిగాను లేని ఆత్రుతను తెచ్చిపెట్టుకొని.

"వస్తానంటే తీసుకెళ్తాను. మేమంతా రేపు వెళ్ళాలనుకుంటున్నాం. నాతో వస్తావా?"

"రాక ఏం చేసేది? ఇక్కడుండి నేను చేసేదిమాత్రం ఏమిటి? డేనియల్ గారుకూడా రమ్మన్నారు!" అన్నాను.

"దెన్ ఇట్ ఈజ్ ఓ. కే." అంది సీసా మళ్ళీ తీసి పెదాలపైన పెట్టి పైకెత్తి వంచుకుంటూ.

ఆనందంలో వుంది గాబోలు, సీసాలో సగంపైగా వున్న ద్రవం మొత్తం గడగడమని త్రాగేసిందామె.

"అలా సముద్రం దగ్గరకు వెళ్దాం! వస్తావా?" అడిగాను నవ్వుతూ.

"ఆఁ!" అంటూ లేవబోయి తూలిపడింది.

నేను వొంగి రెండు చంకల్లో చేతులుపెట్టి పైకెత్తాను. అతి కష్టంమీద ఆమె కాళ్ళపై ఆమెను నిలబెట్టగలిగాను.

త్రాగిన మైకంలో నాలుగడుగులు వేసీ వేయకముందే పడిపోవడం మొదలెట్టింది. అలాగే సముద్రం దగ్గరకు వచ్చాం ఇద్దరం.

ఎదురెదురుగా కూర్చున్నాం.

పైన ఎండ తలలు మాడుస్తున్నా, ఎదురుగా సముద్రం పైనుండీ వస్తున్న గాలి చల్లగా శరీరానికి తగలటంతో కాస్త హాయిగా వుంది.

"అమెరికాలో ఇలాంటి ప్రశాంతమైన వాతావరణం దొరుకుతుందా?" అడిగాను.

"ఎవరికాక్కాషాలి ఇలాంటి భయంకరమైన ప్రకృతి? దయ్యాలకూ, శవాలకూ తప్ప, మనుషులకు మాత్రం అవసరం వుండదనుకుంటాను. అక్కడి లైఫ్ తలచుకొంటే చాలు! మత్తెక్కిపోతాను" అంది నా వొళ్ళో పడు

కుంటూ.

"ఇప్పుడూ మత్తులోనే వున్నావుగా?" అడిగాను ఆమె త్రాగిన సీసా విషయం గుర్తుచేస్తున్నట్లు.

"అది మనిషినిమాత్రమే మత్తెక్కిస్తుంది. కానీ నువ్వు నా మనసునూ, వయసునూ మత్తెక్కించావ్? నిన్నెలాగైనా నా వాణ్ని చేసుకోవాలనుకున్నాను. నౌ యూ ఆర్ విత్ మీ!" అంది పెనవేసుకుంటూ.

"ఆ మాత్రానికే ఆనందించకు!" అన్నాను, ఆమె పట్టు సడలించుకుంటూ.

"ఎందుకని?"

"ఇంతకు ముందులా లేను నేను" అన్నాను.

"అంటే..." విచిత్రంగా చూసిందామె నాకేసి.

"నాకీ ప్రమాదం జరగకముందు నీలాంటి అందగత్తెలను చూడగానే శరీరం ఉద్రేకంతో ఊగిపోయేది. రక్తం వేడెక్కేది. నరాలు కోరికలు నింపుకొని పాముపడగల్లా నాట్యం చేసేవి. ఇప్పుడెందుకనో శరీరం చల్లబడిపోతున్నట్లు, చైతన్యం నశిస్తున్నట్లుగా వుంటుంది" అన్నాను.

ఆమె కళ్ళల్లో అందాకా మిలమిల మెరిసిన మెరుపులు మాయమైనాయి. నా వంక సూటిగా చూస్తూ, "యూ ఆర్ నాట్ పొటెంట్?" అంది.

"అదే తేలడంలేదు! నువ్వు నర్సువి. నాకన్నా నీకెక్కువ తెలియాలి! అలా జరిగే అవకాశం వుందా?"

"ఉందనే అన్నాడు డేనయల్! అలా జరిగిన కేసులు రెండు మూడు విన్నానుకూడా! అయితే నా ప్రయత్నమంతా వేస్ట్!" అంది.

—(సశేషం)

# సప్లిమెంట్ పోటీ - 19.

**P, Q, R, S, T** — అక్షరాలను తీసుకొని మీకు నచ్చిన వరుసక్రమంలో, ఈ క్రింది గళ్ళను పూరించండి. మీ జవాబులను ఒక పోస్టుకార్డుసైజు తెల్ల కాగితంపై వ్రాసి, దానితో 75 పైసల స్టాంపులు జతపరిచి, ఈ నెల 30 వ తేదీలోగా మాకు చేరేటట్లు పంపండి.

| | | | | |
|---|---|---|---|---|

మా ఆఫీసులో సీలుచేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఏడాదిపాటు 'సప్లిమెంట్' ఉచితంగా పంపుతాం. ఫలితాలు జూన్ '76 నెల మాస పత్రికలో చూడండి.

## ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంటు" ముఖచిత్రాలు పరిశీలించండి. రెండింటికి సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలోగాని, వ్రాసి, ఈ నెల 10 వ తేదీ లోపు మాకు చేరేట్లు పంపండి. 'హోమ్ డెలివరీ' సభ్యులు తమ సభ్యత్వము నెంబరు వ్రాస్తేచాలు. సభ్యులు కానివారు తమవ్యాఖ్యలతో 30 పై.లు స్టాంపులుపంపాలి.
మాకు నచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రూ. 20 లు నగదు బహుమతి పంపుతాము.

## మీరే ఎన్నుకోండి ?

ఈ "సప్లిమెంటు"లో మీకు బాగా నచ్చిన నవల పేరును ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల10 వ తేదీ లోపు మాకు పంపండి. హోమ్ డెలివరీ సభ్యులు తమ నెంబరు తప్పక వ్రాయాలి. ఇతరులు తమ జవాబుతో ఈ కూపన్ కత్తిరించి పంపాలి. ఉత్తమ నవలకు రూ. 116 లు బహుమతి ఇవ్వబడుతుంది.

